# కవికోకిల గ్రంథావళి




౨: ఖండకావ్యములు.

దువ్వూరి రామిరెడ్డి

# కృతజ్ఞత.

---

బాల్యంబుననె కావ్యవనవీథి విహరించి
కవికోకిలాలాప గతులు మెచ్చె;
సౌందర్యభావనాశబలిత చిత్తుఁడై
స్వర్గతుల్య మొనర్చె స్వభవనమును;
కలిమికి సహజమౌ గర్వంబువిడి మిత్ర
బృందహృత్ప్రీతిక నెక్కుఁ గలిగె;
అర్థికి గౌరవహాని దోఁపింపని
దానశిల్పములోని తత్త్వమెఱిఁగె;
మాటలకుఁ జేఁతలకు మాఱుపాటు లేమి
వఱలె నీయందు రేబాలవంశచంద్ర
యనుచు నెల్లరుఁ బొగడంగ నలరినావు
రమ్యగుణమూర్తి శ్రీసుబ్బరామిరెడ్డి!

కృత్తికిఁ గావ్యకళా సం
పత్తికి మొగదారులైన మహతోంటి నృపుల్
ఇత్తఱి నరుదేయైనను
బొత్తిగ విడిపోవు మనలఁ బూర్వాభిరుచుల్.

కొండవీటి రాజ్యేందిర క్రుంకిపోయె
నకట! దురదృష్టవశమున, నైననేమి?
నేఁడు సిరిగల ప్రతి రెడ్డివీడుకూడ
పండితులపాలిటికి "పిల్లకొండవీడు."

"జనకుని స్మృత్యర్థము నే
ననుకొంటిని నీదుకృతుల నచ్చొత్తింపన్
అనుమానమేల? నీవా
ననవోయీ యన్నతీరు "లా" నఃపించెన్.

నీ రసికత, నీమైత్రియు,
నీరమ్యకళానుభూతి నిరతము శిల్ప
ప్రేరకమై నవకవితో
ద్ధారకమై పెంపు చెందుతన్ బ్రియమిత్రా!
నేను నీవును సకలంబు నిశ్చయముగఁ
గాలవాహిని నొకనాఁడు గలయఁగలము;
కాని, రమ్యమైన యపూర్వ కావ్యసృష్టి
అమరతం గూర్చుఁ గర్తకు నాశ్రితునకు!

సిరికిందగిన వదాన్యత,
పరువము, లలితాభిరుచుల బలిసిన భావ
స్ఫురణము, భోగప్రీతియు
విరిసెను నీబ్రతుకుఁ దీవ విరులటు మిత్రా!

ధనముండుట పరిపాటియె;
ధనమే సర్వంబుగాదు; ధనముండియు స
ద్వినియోగ బుద్ధిగలిగిన
మనుజునిభాగ్యంబె లోకమాన్యతగాంచున్.

రమయు వాణియుఁ బక్షపాతమువహించి
కూర్చి రర్థంబు విద్యయుఁ గొదవలేక;
అట్టియొద్దిక యందఱ కబ్బదోయి,
జీవితార్థంబు నిరుకేలఁ జిక్కఁబట్టు!

——

# విన్నపము.

---

1916 మొదలు 1933 వఱకు నేను రచించిన ఖండ కావ్యము లన్నియు ఈ సంపుటమున సమకూర్పఁబడినవి. వ్రాత ప్రతులను బట్టి, ఆయా ఖండకావ్యములను రచించిన తేదులను ఇందు పొందుపఱచితిని. 1921 లో 'నక్షత్రమాల' ప్రకటింపఁ బడినపుడు ఆసంపుటమునకు నేను రచించిన ఉపోద్ఘాతము ఈ ఖండకావ్య సంపుటమునకును ఉచితముగ నుండును గాన దాని నట్లే యుండనిచ్చితిని.

మోపూరు నివాసులును కళోపాసకులును కవితా రసజ్ఞులును నాకు మిత్రులును అగు

## శ్రీయుత రేబాల సుబ్బరామిరెడ్డిగారు

ఒకనాఁడు ప్రస్తావ వశమున నిట్లనిరి:

"నీగ్రంథములు చెల్లా చెదరుగ నున్నవి. మాసపత్రికలలో ప్రకటింపబడిన కొన్ని కావ్యములు గ్రంథరూపమున వెలువడనే లేదు. తుదకు నీపుస్తకములు ఎచ్చట దొరకునోయను సంగతికూడ చాలమందికి తెలియదు. నీకృతులన్నియు ఒకే సంపుటముగ నచ్చొత్తించిన బాగుగనుండును. నీ విష్టపడుదు వేని నేనందుకు వలసిన యేర్పాటు కావించెదను."



శ్రీయుతులు రేబాల సుబ్బరామిరెడ్డిగారు.



కీ. శే. రేబాల సుబ్బారెడ్డిగారు.

సుబ్బరామిరెడ్డిగారి కవితా ప్రియత్వము, ఔదార్యము నన్ను ముగ్ధుని గావించినవి. అర్థింపఁబడియు కవులకు సహాయము చేయు కవితాపోషకులు అరుదైన ఈకాలమున సుబ్బరామిరెడ్డిగారి ఈయయాచిత సాహాయ్యము ప్రశంసా పాత్రమని వేఱుగ చెప్పనక్కఱలేదు. నేను వారికెంతయు కృతజ్ఞుఁడను.

సుబ్బరామిరెడ్డిగారి జనకులు

## శ్రీ. శే. రేబాల సుబ్బారెడ్డిగారి స్మృత్యర్థము

ఈ కవికోకిల గ్రంథావళి యచ్చొత్తింపఁబడినది.

నేను నెల్లూరిలోనుండి అచ్చుప్రూఫులు స్వయముగ దిద్దికొన వీలులేకయున్నందున నామిత్రులును, మృదుమధుర కవితారచయితలునగు గోనుగుంట పున్నయ్యగారును, చిరకాలమిత్రులును "హాలిక" లాంఛన విశ్రుతులును ప్రభాత ముద్రణాలయాధికారులును అగు మరుపూరు కోదండరామ రెడ్డిగారును ప్రూఫులుదిద్ది శ్రద్ధతో మిత్రకార్యము నెరవేర్చిరి. వారిసాహాయ్యమునకు నేనెంతయు కృతజ్ఞుడను.

నెల్లూరు,
2—12—1935 } దువ్వూరి రామిరెడ్డి

---

# విషయసూచిక.

—: నక్షత్రమాల :—

—: నైవేద్యము :—

—: భగ్నహృదయము :—



—: పరిశిష్టము :—

# శుద్ధిపత్రము.

---

## ఉపోద్ఘాతము

| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 6 | | 1 | ఇంతవఱకు | ఇంతవఱకు ప్రకృతి |

## నక్షత్రమాల

| | | | | |
|---|---|---|---|---|
| 16 | 3 | 2 | నిర్ఘరిణి | నిర్ఝరిణీ |
| 18 | 3 | 2 | బాహువు | బాహువుల్ |
| 34 | 4 | 1 | ప్రోజ్జలంపు | ప్రోజ్జ్వలంపు |
| 37 | 3 | 4 | కడగినై చెద | కడిగినై చెద |
| 38 | 2 | 3 | లార్భకుండు | లార్భకుఁడు |
| 42 | 4 | 2 | పులగుత్తుల్, | పులగుత్తుల్ |
| 44 | 2 | 4 | గడిపితినో | గడపితినో |
| 46 | 2 | 4 | వలయించి | నలయించి |
| 47 | 2 | 1 | వగచినట్లుఁడ | వగచినట్లుండ |
| 47 | 2 | 2 | తెగవలెనున్న | తెగవలెనన్న |
| 49 | 2 | 4 | భిక్షుకులకు | భిక్షుకులకు |
| 62 | 1 | 11 | నెరయుచుండ | నెరియుచుండ |
| 67 | 1 | 3 | నీఁకమీఁద | ఇఁకమీఁద |

# నైవేద్యము

| పేజ్యాంకము | | 3 వ పంక్తి | హారి, | హారి |
|---|---|---|---|---|
| ,, | | 4 ,, | యింద్రజాలికం | యైంద్రజాలికం |
| 79 | 2 | 3 | భిక్షకుండేని | భిక్షుకుండేని |
| 82 | | 16 | పాథోధి | పాథోధి |
| 84 | 1 | 15 | పుష్పకంపు | పుష్పకంబు |
| 85 | | 5 | దగ్గఱఁజేటి | దగ్గఱఁజేరి |
| 109 | | 9 | యన్యాయ్య | యన్యాయ |
| 110 | | 3 | వెఁట | వెంట |
| 111 | | 8 | నానాంద | నానంద |
| 113 | | 1 | క్రొక్కాఱు | క్రొక్కారు |
| 124 | | 10 | వదనబు | వదనంబు |
| 135 | | 4 | విడచి | విడిచి |
| 138 | | 7 | సమత్థిత | సముత్థిత |
| 141 | | 7 | గానవే | గావవే |
| 141 | | 17 | నాహృదయుం | నాదుహృదయం |
| 144 | | 4 | నన్నింట్రెవిఁ | నన్నింట్రిఁ |
| 147 | | 9 | యర్చవేదిక | యర్చనవేదిక |
| 163 | 2 | 1 | యింద్రజాలి | యైంద్రజాలి |
| 170 | 2 | 11 | వడిసితి | వడసితి |
| 186 | 2 | 1 | కాలుమెయిళ్ళ | కాలుమొయిళ్ళ. |
| 186 | 2 | 3 | సూర్మరశ్మి | సూర్యరశ్మి |

## భగ్నహృదయము.

| | | | | |
|---|---|---|---|---|
| 206 | 2 | 3 | గడుపంగనేల | గడపంగనేల |

| | | | | |
|---|---|---|---|---|
| 206 | 3 | 3 | నీకు: | నీకుఁ |
| 208 | 5 | 2 | నిక్కముగానిఁ | నిక్కముగాని |
| 209 | 1 | 2 | కండిది | కడింది |
| 210 | 4 | 2 | దెకలించి | బెకలించి |
| 218 | 1 | 4 | సాఁగుతఞ | సాగుతఞ |
| 235 | 2 | 6 | పందిఁళ్ళ | పఁదిళ్ళ |

ప్రథమకవిత్వము.

| | | | | |
|---|---|---|---|---|
| 277 | 2 | 1 | డెక్కములో | డెక్కములో |
| 283 | 2 | 1 | స్వాంతుడు | స్వాంతుండు |
| 285 | 1 | 1 | గితీక్షయు | దితిక్షయు |
| 302 | 1 | 4 | జిహ్మలతలు | జిహ్వాలతలు |
| 312 | 4 | 2 | పనులెంతే | జనులెంతే |
| 316 | 1 | 3 | దెలవాటె | దెల్లవాటె |
| 317 | 3 | 3 | ననలవ్యాపార | ననలవ్యాపాద |
| 319 | 2 | 1 | సంతాంబులం | సంతానంబులం |
| 319 | 5 | 3 | స్వచ్ఛాత్రు | స్వచ్ఛాస్ర |
| 320 | 2 | 1 | గీస్ | గ్రీస్ |

"Poetry has been to me its own exceeding great reward. It has soothed my afflictions; it has multiplied and refined my enjoyments ; it has endeared solitude ; and it has given me the habit of wishing to discover the good and beautiful in all that meets and surrounds me "

—COLERIDGE.



# ఉపోద్ఘాతము.

---

మానవహృదయమును దైనిక కలకలమునుండి తొలఁగించి విషయభార విముక్తముచేసి, ప్రాపంచిక సీమాంతముల కవ్వల భావసృష్టి కల్పితమైన నక్షత్రమండలమున సంచరింపఁజేయుటకు శిల్పము సహాయకారి. శిల్పములలోఁ బ్రతిక్షణ భావనవ్యక్తికి నాలవాలమైనది కావ్యశిల్పము. ఇతరశిల్పములకును గావ్యశిల్పమునకును జాల వ్యత్యాసముగలదు. ఒకచిత్రపటమును దర్శింత మనుకొనుఁడు. ఆ పటమునందు ఒక్కభావము, ఒక్కస్థితి, ఒక్కవిధమైన రసానుభూతి యలవడును. కాని, కావ్యశిల్పమునం దిట్టినిశ్చలత యుండదు. అనుక్షణము భావములు పరిసరదృశ్యములు అనుభూతియు మెఱుఁగుతీఁగవలె మాఱుచుండును. కావ్యమును ఇప్పటి సినిమాకుఁ బోల్పవచ్చును.

కవులు సృష్టికర్తలు. వీరి ప్రధానకార్యము సృష్టి. ఇట్టిసృష్టివలనఁ బ్రయోజన మేమియని కొందఱు ముగ్ధహృదయులు, కొందఱు శుష్క రసహృదయులు ప్రశ్నింపవచ్చును. కావ్యసృష్టివలన నమూల్యమైన ప్రయోజనము గలదు. రామణీయకము పరిపూర్ణముగ వికసింపని యీప్రపంచమునుండి సర్వతోముఖ రమణీయమైన కల్పనా ప్రపంచమున, గంగాతరంగ శీతలవాఃకణ పూరితమును, నందనవన సద్యోవికసిత కుసుమ సౌరభ్య పులకితమునగు మందమారుత స్వాప్నికడోలికల రసార్ద్రమైన మానవహృదయమును గావ్యము ఉయ్యెల లూఁపుచుండును.

శింపాలతాంగిని అహ్నశాంకముఖిని ఇంతవఱకు సృజింపలేదు. కాని శిల్పియుఁ గవియు సృజించిరి. ప్రకృతిలోపమును బూరించుటయే కళయొక్క ముఖ్యప్రయోజనము. వివిధవస్తు సంయోగము నందుఁ బ్రకృతికన్నను గవులు ముందంజ వేసియున్నారు. "చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినటు" "Melody of flowers" మున్నగు కల్పన లిందునకుఁ దార్కాణములు. కావ్యము ఆనందమయము. కావుననే యానంద దాయకము. కావ్య ప్రయోజనములలో "సద్యః పరనిర్వృతయే" అను లాక్షణిక నిర్వచనము ప్రధానమైనది.

నిజమైన కవిత్వము ఆకృతిబద్ధముగాదు. ఏయాకృతియుఁ గవితారస ప్రవాహమును బట్టియుంచలేదు. మూర్తీభవింపని కవిత్వమే అప్పటమైన కవిత్వము. ఈ కవిత్వము ఏకాంతమునందు రసార్ద్రమైన మానవహృదయముచే ననుభవింపఁ బడుచున్నది. ప్రశాంతమును అక్షరములతో వ్రాయఁబడిన యీ కవిత్వమందుఁ జెవికి వినఁబడని గానమున్నది. ఈ గానమనోహరత్వమును మార్దవమును గర్ణేంద్రియ సహాయములేక హృదయమే స్వయముగ ననుభవించుచున్నది. కావుననే నొగూచి యను జపానుదేశపుఁ బ్రఖ్యాతకవి "వ్రాయఁబడిన కవిత్వమునకన్నను వ్రాయఁబడని కవిత్వమే మధురమైన" దని నుడివియున్నాఁడు. కీట్సు అను ఆంగ్లేయ కవియు, "Heard melodies are sweet, but those unheard are sweeter" అని వ్రాసియున్నాఁడు. కవి యనుభవించు ఆనందము అతని భావవీథిరిఁ బొడకట్టుదృశ్యము, స్థూలమైన భాషయందు గర్భీకరింపఁబడినపుడు ఆత్మసౌందర్యమును సగము కోలుపోవును. ఎందువలన ననఁగా భావములు సున్నితములైనవి; భాష స్థూలమైనది. కావునఁ గవిత్వమునందు అంతర్భూతమైన భాష కొంతయు బహిర్భూతమైన భాష కొంతయు సమ్మిళితమై యుండును. కవిత్వమును నిఘంటు మూలమునఁ దెలిసికొనఁ గోరు నతఁడు రసహీనమైన

శల్యపంజరమును మాత్రము చూడఁగల్గును. కాని యందలి యానందమును సౌందర్యమును ననుభవింపలేఁడు. కవిత్వమందలి ప్రతిపదముచుట్టును నిఘంటువు నిర్ణయమున కతీతమైన భావరోచి యావరించియుండును.

పద్యములు భావప్రేరకములు. భావములు ప్రతిబింబించుటయు, విరివియగుటయుఁ, బాఠకుని హృదయసంస్కారము ననుసరించి పరిపరివిధములుగ నుండును. కావుననే పాఠకులుగూడ కవులవలెనే రసార్ద్ర హృదయులుగా నుండవలయుననుట. తామరాకుపైఁ జెరలాడు మంచుబొట్టు ప్రొద్దుపొడుపు మొదలు ప్రొద్దెక్కుకొలఁది కిరణవర్ణభేదముల ననుసరించి బహువర్ణములు దాల్చునట్లు పాఠకుల సంస్కారభేదముల ననుసరించి కవితయు వివిధాకృతులతోఁ బొడకట్టుచుండును. ఇందుకిక్రింది దృష్టాంతము గనుఁడు. సూర్యుఁడస్తమించెను. సంజకెంజాయలు జలదశకలములపై నలమికొని పశ్చిమదిశను నొకచిత్రప్రదర్శనశాలగ మార్చివైచెను. వరిచేలు పండి యొరగి చల్లగాలికి సముద్రతరంగములవలె నల్ల నల్లన నాడుచుండెను. ఇట్టి దృశ్యమును నొక చిత్రకారుఁడును మఱియొక పల్లెటూరి కాఁపును సందర్శించుచుండిరనుకొందము. చిత్రకారుని చిత్తము ఊహాతీతమైన యా వర్ణసమ్మేళనముయొక్క సౌందర్యమున నిమగ్నమయి పోయియుండును. కాఁపువాని హృదయము బంగారు ట్రిసుకవలె పండి యొరగియున్న వరిచేనుగాంచి సంత ఉవ్విళ్ళూరుచుండును. ఆతని మనము నాకర్షించుటకుఁ బడమటిదెస యందేమియును వింత తోఁచలేదు. దృశ్య మొక్కటియే యైనను, వారి హృదయఫలకములందు భిన్నముగఁ బ్రతిఫలించెను.

పూర్వులలోఁ గొందఱు కవిత్వమును శాస్త్రముగఁ బరిగణించిరి. ఇది చాల గొప్ప పొరపాటు. శాస్త్రమున నానందములేదు; నగ్న సత్యము కలదు. శాస్త్రకారునికిని శిల్పికిని జాల వ్యత్యాసము గలదు. వారి మార్గములు ధ్రువములవలెఁ బరస్పర భిన్నములనిన సత్యబాహ్యముగాదు. కవియును

శాస్త్రకారుఁడును ఒకహృదయమును బరీక్షింపవలసిన యెడల కవి రసము, అనుభూతి, భావము మున్నగు వానికై వెదకుచుండును. శాస్త్రకారుఁడా హృదయమును గోసి అందెన్ని క్రోవులున్నవి, ఎన్నియరలున్నవి, నెత్తురే మార్గమున సంచరించునను విషయములను బరీక్షించుచుండును.

తెలుఁగు కవులలోఁ, గవిత్వము శిల్పమని ప్రథమమునఁ గనిపెట్టిన తత్త్వవేత్త మహాకవి తిక్కన. కావుననే యాకవి బ్రహ్మ "కవిత్వ శిల్పమునం బారగుఁడన్" అని చెప్పుకొని యున్నాఁడు.

స్వాతంత్ర్యమునఁ గొంత సాహసముగలదు. సాహస మనునది మానవ ప్రకృతిని నవీన మార్గావలంబనమునకుఁ బురికొల్పును. మానవ సంఘము రాజకీయ సాంఘిక మత నైతిక దాస్యమునం బడి యాచారశృంఖలల మూలమున యంత్ర చలితమగు నొక ప్రతిభాశూన్య విగ్రహమువలె నున్నపుడు అట్టి సంఘముయొక్క మనము నవీనకల్పనలకుఁ జోరఁ బాఱదు. ఆస్థితినిఁ గల్లోలించి భావదాస్య భారమున మ్రొగ్గుచున్న హృదయమునకు విశాల ప్రపంచ దృశ్యము కనఁ బడునట్లు విప్లవము జరుగనిదే మానవప్రకృతి నిర్ణిద్రముగాదు. కృష్ణదేవరాయల కాలమునందు నూత్న కావ్య సృష్టికింగూడ నీలాటి విప్లవమే కారణము.

ప్రపంచ చరిత్రమును బరిశోధించి చూచినయెడల, పూర్వులకు భవిష్యత్సంతతి వారినిఁ దమతమ అభిప్రాయాచార మూలమున బంధించు చాపల్యము అమితముగ నుండినట్లు దోఁచుచున్నది. ఇట్టి యధికార చాపల్యము అన్ని మానవజాతులలోను నున్నది. ఇది యసంగతమేగాక హాస్యాస్పదమును. ఇట్టి యారోపితాధికారము మతసాంఘిక రాజకీయ విషయములందే కాక కవిత్వమునంగూడ నాటుకొనియుండినది. కావ్యలక్షణము ప్రథమమునఁ గవుల రచనలనుండియే యుద్భవించిన దయ్యుఁ బ్రత్యేక లాక్షణికుల

యాధికారముద్రవలన ఆలక్షణమే కవులను నిగళబద్ధులను గావించినది.

కావ్యములలో నేయే వర్ణనము లుండ వలసినదియు నెట్టినాయికా నాయకు లుండవలసినదియు లాక్షణికులే తీర్మానించిరి. కాన కవిసృష్టికిఁ గొన్నిహద్దులేర్పడినవి. పూర్వకవులకు రాజులే యాశ్రయములు. రాజులు పండితులను సులోచనముల మూలమునఁ గావ్యపరీక్ష గావించుచుండిరి. ఇఁకఁ బండితులు రసార్ద్రచిత్తముతోఁ గాక శుష్కమైన లాక్షణిక మానదండముతోఁ గావ్యశిల్పమును గొలతవేయుచుండిరి. లాక్షణిక ప్రమాణమునకు వెంట్రుకవాసంత తగ్గినను ఆ కావ్యము గ్రాహ్యముగాదు. కావుననే యాంధ్రప్రబంధము లన్నియు నొకే యచ్చున గ్రుద్దినట్టు లొకేతీరున నున్నవి. ఒక కావ్యమును సాంతముగఁ జదివిన మఱియొక కావ్యమును జదువ నవసరముండదు. అదేనాయిక; అదేనాయకుఁడు; అదే యుద్యానవనము; అదే మోహము; అదే విరహము; అదేశీతలోపచారము; అదే చెలికత్తె; అదేసూర్యోదయము, అస్తమయము!

కాని, యిప్పటి కాలస్వభావము, పరిస్థితులు మాఱినవి. ముద్రణ యంత్రములు కాగితములు ప్రబలినవి. కావున గ్రంథములు సర్వజనసామాన్యమునకు సులభము లగుచున్నవి. ఇప్పుడు కవులను బోషించు వారు ప్రజలు. ప్రజల యభిరుచియు మాఱినది. ఇందుకుఁ జాల చారిత్రక కారణములు గలవు. పాశ్చాత్య సారస్వత సంబంధము వలనను, తన్నాగరకతా సంపర్కము వలనను ప్రజల భావములు ఆదర్శకములు మాఱఁజొచ్చినవి. సంఘమునందుఁ గొంత జీవచలనము ప్రారంభమయినది. ఈ నవీనపరిణామము కవుల హృదయములఁ బ్రతిఫలించి ఆంధ్రసారస్వతమునఁ జొచ్చినది. కావుననే నేఁడు హృదయమోహనమైన ఆధునిక సారస్వతము తఱితీపు తెలుఁగునఁదు బయలు దేఱినది.

ఈ కావ్యములను నేను విమర్శింపఁబూనుకొనలేను. కవియే తాను రచియించిన కావ్యములను, విమర్శకుఁడుగ నవతారమెత్తి పరిశీలించుట యసంభవము. స్వాభిమానము వలన ననవసర ప్రశంస గావించుకొనుటయో లేక వినయము వలన ఉచిత ప్రశంస చేయకుండుటయో సహజముగఁ దటస్థించును. కావున నీ కావ్యములయొక్క గుణాగుణవిమర్శనము రసైక పక్షపాతులైన సహృదయులకు వదలుచున్నాను.

కవులయెడ సమకాలికులకు నిరాదరణము అన్నికాలములందును ఉండినట్లు తోఁచుచున్నది. ఈర్ష్యయుఁ "దన పెరటిచెట్టు మందు గాద" నెడు సామాన్య జనుల మనస్తత్త్వమును, బరిచయమువలనఁ గలుగు నౌదాసీన్యమును ఇందుకుఁ గారణములుగ నుండవచ్చును. "సమకాలము వారలు మెచ్చరే గదా" యని చేమకూర వెంకన్న వ్రాసిన యీ చిన్ని వాక్యమునందు ఆతని హృదయ వేదన యంతయు నిమిడి యున్నది. సమకాలికులచే నిరాదరింపఁబడిన మహాకవి భవభూతియొక్క వేడినిట్టూర్పులు

యే నామ కేచిదిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి, ర్విపులా చ పృథ్వీ.

అను నీశ్లోకమునందు నేఁటికిని ఆవిర్భవించుచున్నవి. తాను రచియించిన "ఇస బెల్లా" యను కావ్యము పైదాడి వెడలిన యీర్ష్యాపూరిత విమర్శనము వలన భగ్నచిత్తుఁడై కీట్సు అను నాంగ్లేయకవి స్నేహితుఁడైన షెల్లీకి "నేను మరణించిన యనంతరము గొప్పకవి నయ్యెదను కాఁబోలు" అని వ్రాసిన లేఖను జదివిన కిరాతుని హృదయమునందైనఁ గరుణ మొలుకును. ఇట్టి నిరుత్సాహకర సందర్భములందు " O! I sing for the mere

joy of singing'' అను ఉద్దేశమే కవిని ఆనంద కవమునిగ ఞాసరించుచున్నది.

ఓరి బాలక నీమురళీ రవంబు
వ్యర్థమౌనని చిత్తతాపంబువలదు;
రాగపరిచితుఁ డెవ్వఁడో రమ్యగీతి
వినియెయుండు నానందంబు వెల్లివిరియ.

పెమ్మారెడ్డిపాళెం
1921

ఇట్లు
దువ్వూరి రామిరెడ్డి.





# నక్షత్రమాల.



## క వి మ నో ర థ ము.



సాంధ్యకిమ్మీరవర్ణవస్త్రములు దాల్చి
గిరితటవిహారశృంగారకేళి సొలసి
రమణఁ జరియించుజలధరార్భకుని గాఁగ
నేల సృజియింపఁడో నన్ను నీశ్వరుండు ?

ప్రత్యుషశ్శ్లేషమున విచ్చు ప్రసవమందుఁ
దరుణసూర్యాంశుమాలికా తరళకాంతి
మిళితమై రాలు తుహినాంబుకళిక గాఁగ
నేల సృజియింపఁడో నన్ను నీశ్వరుండు ?

శిలలఁ బ్రవహించి, శీకరంబులను జల్లి
ప్రకృతిహృద్గతభావంబు బయలుపఱచు
గానముం జేయు మలయూటకాల్వ గాఁగ
నేల సృజియింపఁడో నన్ను నీశ్వరుండు ?

శారదేందుమయూఖ సంస్పర్శనముల
దైనిక స్వప్నమాంద్యమ్ముఁ దలఁగఁ ద్రోసి
మొలకనవ్వుల మేల్కను కలువ గాఁగ
నేల సృజియింపఁడో నన్ను నీశ్వరుండు ?

యామినీ వ్యోమమండల ప్రాంగణమున
సుకవియానంద రాజ్యంబుఁ జొచ్చువేళ
శోభ వెదచల్లు మురిపెంపుఁ జుక్క గాఁగ
నేల సృజియింపఁడో నన్ను నీశ్వరుండు ?

---

# ప్రణయాంజలి.

---

ఎవ్వతెయందు నామది లయించి తదన్యము చింత సేయదో
యెవ్వతె ప్రేమపుష్పము సహింపఁగరాని వియోగగంధమున్
నివ్వటిలంగఁ జేసెడినొ, నిద్దురలం దనుభావ్యమైన యా
జవ్వని మన్మనఃప్రణయసాక్షిగ మంగళ మొందుఁగావుతన్!

అల్లియుఁబూలు పూవని లతావళు లట్టుల నాదుకోరికల్
గొల్లగ రేఁగియుం గుడుపుగూడక పోయె; మదీయపాపముల్
వెల్లువ లౌచు నిద్దఱను వేఱొనరింపఁగ, దైవదూషణం
బొల్లను; బూర్వకర్మఫలితోత్థితముల్ గదమోదఖేదముల్.

బయలం బ్రాఁకని ఆపకోఁతలకు నాభావంబు శుష్కించి లో
సయిఁపరాని విషాదకశ్మలతచే సంతోషలోకంబె యం
ధయుతంబై కళదప్పు, యౌవనపుటుత్సాహంబు జీర్ణింప, స్వ
ప్న యథార్థత్వముఁ లౌకికంబనెడిత్రోవంబోయిచింతించుదున్.

నిమిషమైన రహస్యంబు నిలుపలేని
యద్దపుంబెట్టెలే మనయాత్మ లైన
బట్టబయలుగ నిరువురిభావవృత్తు
లెఱుకపడునేమొ కన్నియా, యింపు గలుగ.

కామదగ్ధంబులైనె, శాంతి గాంచి యున్న
భావభూతిని నిర్మలప్రణయ లతిక
లల్లుకొని పూలు పూచె, నా యార్ద్రగంధ
మిరువుర మనుభవింపలేమే లతాంగి?

పండిపండని కోరికపంటభూమిఁ
బొరలి ప్రవహించు విరహనిర్ఝరిణి తటులఁ
బ్రణయబంధంబు విచ్చి, పరస్పరాను
చింతలకు జలాంజలి యీయ సిద్ధపడెదో?

అట్లుగాక వెన్నెల గాయునట్టి రేల
వలపు మధువాని చిత్తంబు బ్రమయుచుండఁ
జుక్క పూవులపందిరి సొగయఁ, జేతఁ
బట్టెదో వట్టివేళుల వ్యజన మబల!

తలిదండ్రుల్ మనకోరికల్ సమయు యత్నంబింతగావించియుం గలలం గల్గు మనోహరప్రణయసఖ్యంబుం దొలంగించిరే? చెలియా, యిద్దరి ప్రేమబంధనము విచ్ఛిన్నంబుగాకున్నఁ గాంక్షలు దుస్సాధ్యములయ్యెఁ గొంతదనుకన్ సంతోషమే కూర్చెడిన్

ఇంక నీలోకమున మన కిద్దఱకును
హృదయరక్తికి నాలంబ మొదవకున్నఁ
బ్రణయమెల్ల ఫలించు స్వర్గమ్మునందు
ననుభవింత మానంద రసామృతంబు.

కనులం గాటుకచీఁకటుల్ నెఱయఁ గ్రీగంట న్విలోకించి నా మనమున్ మానఁగరానిగాయములనొంపన్ స్వప్నమల్లెల చక్కనిదానా, పొడగట్టె దీవు? నను నింకం జిమ్మచీఁకట్ల వీణను వాయించి వియోగగీతి లయ మొందం బాడని మ్మొంటిగన్.

---

# సంధ్య.

---

అరుణుఁడు పశ్చిమాద్రిశిఖరాంగణమున్ దిగఁబాఱువారిదో
త్కరశకలంబులన్ రుధిరకాంతులు పెల్లలరన్ దిశాంతముల్
పరఁగెఁ బరస్పరంబు నిరువాగుల వారలు పోర, రక్తని
ర్ఝరముల, సంగఖండములఁ గ్రాలు రణస్థలు లట్లుదోఁచెడిన్.

భారతవీరపుంగవులు భాస్కరతేజు లపూర్వ శౌర్యదు
ర్వారులు ధార్తరాష్ట్రులును పాండునృపాలతనూజు లుర్వికై
ఘోరరణంబు సల్ప నటఁ గూలిన సైనికభగ్నకాయముల్
పేరిన యుద్ధరంగములలీలఁ జెలంగును బశ్చిమాశయున్.

క్షాత్రయుగంబునన్ భరతశౌర్య రమామణి వారికేళికిన్
శత్రుల శీర్షముల్ జలజషండము గాఁగ విభిన్న బాహువు
చిత్రమృణాలవల్లులుగఁ జెల్వగు శోణితపూర్ణసంగర
క్షేత్రసరోవరంబు విలసిల్లెనొ నా నపరాశ శోభిలున్.

కాంచఁగనే జపారుచిరకాంతులు మెల్లన నెల్ల లీనమై
కాంచనదీధితుల్ దిశలఁ గ్రమ్మఁ బురాతనభారతోర్వియీ
సంచున జాళువా గనిగ సంపదలం దులతూఁగుచుండెఁ బో
యంచుఁ దలంప హేమమయమయ్యె నజాండము చూడనందమై

ఎరలకు నేఁగు పక్షికులమెల్లఁ గులాయములంటి యాతురం
బఱచుచు వచ్చుటం గనఁగ భారతదేశ సువర్ణసంపదం
బరధరణీజనుల్ గని యపారముదంబున దానిఁ దోచుకోఁ
బరుగిడి వచ్చిరో యనఁగ భావమునం బొడకట్టు వింతగన్.

అంతఁ గ్రమముగఁ గాంచనకాంతి దిశల
నుడుఁగ, నిబిడాంధకారంబు మల్లడించె
నతులభాగ్యంబు శౌర్యంబు నంతరింప
సొంపు దఱిగిన యార్యవసుంధర నటు.

ఎప్పుడు గాఢసంతమస మీవసుధ న్విడుఁ, బ్రాచ్యదేశ మిం
కెప్పుడు శోణితార్ద్రరుచి నింపులుచిల్కను, బాలభాస్కరుం
డెప్పుడు పూర్వమట్టుల రహించుఁ బ్రతాప సముజ్జ్వలంబుగా
నెప్పుడు మానునో జలజశృంఖలరాయిడి బంధరాళికిన్.

---

# కవి.

---

వేగుజామున వికసించు విరులయందు
ఱేకు లెడలించు సంజ పూరెమ్మలందుఁ
గావ్యమునఁ బోలెఁ బఠియింతుఁ గౌతుకమునఁ
బ్రకృతిసామ్రాజ్య పాలనా పద్ధతులను.

చటుల కల్లోల రసనల సాగరంబు
పవలు రేయి నాలాపించు పాటలందు
ననితర గ్రాహ్యధర్మంబులై చెలంగు
విశ్వసృష్టి ప్రకారముల్ వినుచునుందు.

శ్యామలాకాశ ఫలకమునందుఁ దరళ
కాంతి వెదచల్లు తారకాక్షరము లోనర
విశ్వవైశాల్య బోధక విద్య నేర్తు
శర్వరీగర్భశాంతి యొజ్జగ విధింప.

గజురు తుంపరముత్యాలు కాన్క- లిడుచుఁ
దరలు సెలయేటిపాటలో దాఁగియున్న
రాగతత్త్వంబు నామనిరాత్రులందుఁ
గూయుకోయిలకడ నేర్చికొందు వనుల.

స్వీయచరిత రహస్యంబు వ్రాయఁబడిన
హృదయపుస్తకపుటముల ముదముతోడఁ
బ్రకృతి నామ్రోల విప్పఁ బ్రభాతరాగ
రంజితం బైన తూర్పుతీరంబు నందు.

---

# కుసుమాశ్రువులు.

---

'కమలా, లెమ్ము కుటీరకుడ్యముల బంగారంపు లేఁ బూఁతలం
గొమరారన్ రచియించె సూర్యకిరణాంకూరంబు లిప్పట్టునన్;
సుమముల్ గోయఁగఁబొమ్ము, నాన్న జలముల్ జొబ్బిల్లునీర్వావివ
స్త్రముతో స్నానముచేసి వచ్చెడిని పూజాసక్త చిత్తమ్మునన్.

అని జనయిత్రి పల్క విని యంతఁ గుమారిక లేచి దంతధా
వన మొనరించి బృందకును భక్తిఁ బ్రదక్షిణ మాచరించి చ
ల్లని మలగాలిసోఁకి యొడలం బులక ల్మొలకెత్తఁ బైటకొం
గును బిగియించి తోఁటకడకుం జనుదెంచె ననంటిడొప్పతోన్'.

లేఁత పచ్చికతలలఁ జలించుచున్న
మంచు తుంపరముత్యాలు మగువ నడచు
నపుడు నటునిటుఁ జిందఁగ నంఘ్రితలము
చలికి మొద్దువాఱెనో యన జలపరించు.

అరుణ మయూఖ రంజితములైన హిమాంబు కణాళి ముత్యపున్
సరములు ద్రెవ్విపో వరుసజాఱెడి పోలికఁ బూవు రేకులం
దొరఁగుటఁగాంచి యేమియునుదోఁపక యాకమనీయ దృశ్యబం
ధురత మనంబునగ్నమయి తొయ్యలి యామనుభూతినుండఁగన్

అమ్మ కమలా, బిరాన రావమ్మ యనుచుఁ
దల్లి పిలిచెనుగాని, నితాంత పార
వశ్యమున నున్న కమల యా పలుకులయిన
వినక తలపోయుచుండె నా విధములెల్ల.

ఎట్టులు చేతులాడునొకొ యీకుసుమంబులఁ గోయ? గాలువల్
గట్టెడు నశ్రుబిందులటు గాఱెడుఁ బువ్వులనుండి మంచు బొ
ట్లట్టిటు గాలికిం గదలినప్పుడు, పువ్వుల మధ్యనుండి సొం
పుట్టగ నవ్వెనాఁ బ్రకృతి, యుల్లము తాండవమాడు వేడుకన్.

కన్నుల విందు సేయు సుమకాండముఁ ద్రుంచి విచిత్రశోభలన్
జెన్నొలికించు నీప్రకృతి చిత్తము నెత్తురులొల్కఁ జేయ నే
నెన్నడుఁ బూన; లేఁబొడుపు టెండలు సోఁకినఁ బుల్కరించు పూఁ
బిన్నల హత్య చేయఁ దలపెట్టుట క్రూరము నన్నుఁ బోఁటికిన్.

ప్రకృతి రామణీయకమును బాడు వెట్టి
దైవపూజకుఁ దొడఁగెను దండ్రియేమొ!
ఆత్మకుసుమ సమర్పణం బాచరించి
వేదవేద్యునిఁ బూజింప వేడికొందు.

---

# రెడ్డికులప్రబోధము.

---

రెడ్లుగాఁబుట్టిన ఋణముఁదీర్చికొనంగ
        వీక్షించితిరె కొండవీటికోటఁ ?
దలఁచిన యంతఁ జిత్తమున రోషము రేఁపు
        కత్తుల కూపంబుఁ గాంచినారె?
రెడ్డివీరకుమార హృదయ రక్తంబులఁ
        దోఁగిన రణభూమిఁ ద్రొక్కినారె?
యాంధ్రశౌర్యేందిర కకలంక భూషణం
        బౌ రెడ్ల చరిత విన్నారె? యన్న
లార, యూరక రెడ్డికులాన జన్మ
మెత్తితిమఁటన్న నాదాయ మేమిగలదు ?
తల్లి మొగము నెఱుంగని తనయు లవత
రించియును లేనివారలే యెంచిచూడ !

సచ్చిదానంద దర్శనుఁడు వేమనయోగి
        మనకులంబునఁ బుట్టెననినఁ జాలు;
షట్చక్రవర్తి సచ్చారిత్ర నిర్మాత
        మనవాఁడెయన్న యాఘనతచాలు ;

ఆంధ్ర వీరాంగనలైన నాయకురాలు
మన కులస్త్రీ యన్నమాటచాలు;
ఔదార్య ధుర్యాత్ముఁ డనవేమ భూపుఁడు
మావాఁడె యన్న సంబరముచాలు;
నింక నెందఱెందఱనో యహీనయశులఁ
గాంచి లోకైక విఖ్యాతి గన్నయట్టి
రెడ్డికులపుఁ జారిత్రంబు శ్రేష్ఠమనుట
కేమి లోపంబుగలదు? మీరెఱుఁగరయ్య.

ఘనసైన్యంబులఁగూర్చి, బాహుబల విక్రాంతి న్విశేషించి పద్మ నృపాలాళికి గుండెగాలముగ, విద్యానాథులై కొండవీటను నద్దంకిని రాణ్మహేంద్రపురిఁ గోటల్గట్టి శౌర్యంబునన్ మును బాలించిన రెడ్డిరాజుల యశంబుల్ నేఁటికిం గ్రాలవే?

మార్తుర రాజ్యరమామణుల్ చెఱఁబడి
గోడుగుడిచిన చోటు కొండవీడు;
ఆంధ్రదేశ మతల్లి యలికంబునం దాల్చు
మండన తిలకంబు కొండవీడు;
కవితారసాలోల కల్లోలినిం దోఁగు
పండితాఢ్యుల నాడు కొండవీడు;
ఖండితారాతిరాణ్మండన మండితా
ఖండలచాపంబు కొండవీడు;

అట్టిచోటను బెన్గోట గట్టి నట్టి
మేటిదిట్టలు మనతోఁటి పోటరులెక !
నేఁటికిని రెడ్డి వీరుల నెత్తురచట
శౌర్యసౌరభ్యములు వెదజల్లుచుండు.

అరివీరకంఠనాళాస్ర ప్రవాహంబు
గవిసి త్రుప్పెత్తిన ఖడ్గధార;
భూగర్భమున రక్తపూరవిలీనమై
విశ్రమించిన బాహువీర్య మహిమ;
కావ్యసంపుటబద్ధ గాథాశ్రయంబున
గ్రుక్కిళ్ళువోవు నకుంఠకీర్తి;
బహుకాల విశ్లేషభరమున శోషిల్లి
రమణవాసినయట్టి రాజ్యలక్ష్మి;
యింక నెప్పుడు పూర్వశౌర్యాంక సరణి
రెడ్డికులవీర దోర్బల శ్రీసమాశ్ర
యంబుగాంచి వర్ధిల్లునో ? యట్టి యదను
గల్గునో ? మన కంత భాగ్యంబు గలదొ ?

పోయిరివీరభద్రుఁ డనపోతమహీపతి వేమయోగియుఁ,
బోయెను మల్లరెడ్డికవి, పోయెను గాటయవేముఁడుఁ, రణా
జేయ కుమారవీరులును జెల్లిరి; రెడ్డికులంబు డొల్లయై
పోయెనటన్నలాఘవము పొందనిరీతి యశంబునిల్పుఁడీ!

పోయి రేఁగాని వారల భూతినుండి
రేఁగుచున్నది వెండియు రెడ్డిశక్తి;
యొక నొకమాఱు లోకంబు నెల్ల నాత్మ
దివ్యతేజంబున న్ముంచి తేల్పఁగలదు.

పచ్చినెత్తురుటలల్ పై రేఁగు రణభూమి
జయనావ నడిపించు శౌర్యలక్ష్మి;
మోహనసౌరభ్యము ల్విసాళింపఁగఁ
గవితాలతాంగితోఁ గలయునేర్పు;
కీర్తివల్లికలు క్రిక్కిఱిసి దిక్కులకల్లఁ
గృతులందుకొన్న సాహిత్యరక్తి;
చేయొగ్గి యర్థులు జేపెట్ట సర్వస్వ
మైన నిచ్చెడు నుదారాశయంబు;
హోమధూమావృతం బగ్నిహోత్రమటుల
సన్నగిల్లియుఁ, జానదు-చావలేదు
ఇప్పటికి రెడ్డి కులమందు; నింకఁ జావఁ
బోదు మన నెత్రుకడపటి బొట్టువఱకు!

కొండవీటి దుర్గంబునఁ గ్రుంకినట్టి
రెడ్డిసూర్యుండు కాళరాత్రిని దరించి
యభినవాంశు ప్రసారంబు లలరుచుండఁ
దూర్పుదిక్కున నల్లదే దోఁచువాఁడు!

అనుమానంబొకయింతలేక గనుఁడీ, యావచ్చు బాలార్క-బిం
బ నవాంశుల్ ఘనమాలఁ జీల్చికొని సైఁపన్రాని కాంతిచ్ఛటం
గనులంగట్టుఁ; బ్రబోధగీతము లుషఃకళ్యాణి తారస్వరం
బున నాలాపము సేయుచున్నయది పెంపుంబొందనుత్సాహముల్.

వీడిపోయిన తంత్రులు బిగియఁగట్టి
హృదయమందుఁ బ్రతిధ్వను లెసఁగునటుల
వీణసారించుచున్నాఁడు ప్రియసుతుండు
లెమ్ము నిద్దుర, రెడ్డికులమ్మ, యింక.

అరుగో! యూర్ధ్వపథంబునం గనుఁడు, దివ్యాకారముల్ దాల్చి కీ
ర్తి రమాకాంతులు, రెడ్డివీరులు రణోర్విన్ దేహముల్వీడి ని
ర్జరలోకంబున సౌఖ్యముల్ పొరయు స్వార్థత్యాగు, లానందని
ర్భరచిత్తంబులఁ బుత్రులం గనఁగఁ జేరన్వచ్చి, మందారపు
ష్ప రసౌఘాకుల బంభరారవ మిళ ద్భవ్యామలాశీ రవం। బు
రహింపన్ వెదజల్లువారలు సుమంబుల్ మోద బాష్పార్ద్రముల్

నేఁడు పవిత్రవాసరము నిర్మలచిత్తముతోడ సంగముం
గూడి కులాభివృద్ధికొఱకుం బనిసేయఁగ దీక్షఁబూని మీ
వాడలఁ బల్లెలన్ నగరవాటికలందుఁ బ్రబోధగీతముల్
పాడుఁడు, కంకణాలు మణిబంధములన్ ధరియింపుఁడర్థిమై.

ధనదాన్యంబులువాణిజ్యభోగములువిద్యాబుద్ధులుం గీర్తియు
న్ఘనశౌర్యంబు నుదారతాగరిమ చక్కంగల్గి తంగేడుపూ
చిన చందాన సతంబు నూత్నరుచులం జెన్నారుతన్ విశ్వమో
హనమై రెడ్డికులంబు సర్వజన నిత్యానందసంధాయిగన్ !

---

# సోదరీస్మృతి.

---

చెల్లెలా, నీవుస్వర్గమ్ముఁ జేరి కొన్ని
వత్సరంబులు గడచియుఁ బ్రకృతియందు
నీదుచిహ్నంబు లెల్లెడ నింపినావె
యనుదినంబును నాకు దర్శన మొసంగ?

శారదాంబుదమాలిక సడలిపోవఁ
గళలుదేఱిన శశిరేఖఁ గాంచినంతఁ
బొత్తిగుడ్డలు దొలఁగింపఁ బొనగు నీదు
నాస్యబింబము తలఁపున నవతరించు.

ప్రత్యూషంబున మంచుతుంపరలతోడ,
విచ్చు పన్నీటిపువ్వు సేవించినంతఁ,
దల్లికౌఁగిట మురిపెంబు వెల్లిగొలుపు
నీదు ముద్దుమొగంబు వర్ణింపఁజేయు.

సందె వేళలఁ బలుచని జలదములను
బూతపూచెడి చెంగావి పూలసౌరు
నవ్వునెడ నీకు చెక్కుల నాట్యమాడు
కాంతిమంజిమ మఱు నాకుఁ గానిపించు.

భౌతికంపు సంబంధము వాసియును ని
రంతరాధ్యాత్మిక ప్రణయంబు మనలఁ
గడవరాని బాధంబులఁ గట్టివైచె,
స్వప్నవీథికి వచ్చెదే ప్రతిదినంబు!

---

# కోయిల.

---

పైరుకోఁతలఁ గష్టించి పల్లెచెలులు
కొంత విశ్రాంతిఁ గొన్నారు, కోయిలా, ర
సార్ద్రకంఠంబు నెత్తి గానామృతంబుఁ
జల్లుమా వారిమనములు చల్లవడగ.

చిత్తరంజక రాగనిశ్రేణి వైచి
దివ్యగానంబు భూమికి దింపరావె !
తంత్రు లెడలిన వల్లకీదండ మటులఁ
గూజిత విహీనమై తోఁచు గున్నమావి.

నీవు లేకున్న గగనవనీ నికుంజ
తలములును బాడుపడినవిధానఁ దోఁచు !
నేడ కేఁగితో కోయిల యెమ్మెలాఁడి?
పాడరావమ్మ, యొకమాఱు ప్రణయగీతి.

తేనెలూరెడి నీపల్కు తియ్యఁదనముఁ
గోరి విరహులపోలికఁ గుందువారు
కవివతంసులు; వాసంతకాల లాంఛ
నంబవయి రావె కోయిలా, సంబరముగ.

---

# స్వాతంత్ర్యరథము

అంబుదంబుల నమృతపూరంబు లొలుక
నింద్రచాపంపుఁ దోరణ మింపుఁగులుకఁ
గారుమెఱుఁగులు నెల్లెడఁ గడలుకొనఁగ
వెడలె స్వాతంత్ర్యరథము విన్వీథియందు.

జలధరమాలఁ జీల్చికొని, స్యందనకాంతి నభోంతరాళ ము
జ్జ్వలితముచేసి, యంధతమసంబులు వాఱిన మూలనైన శో
భల ననలెత్తఁజేయుచుఁ బ్రభాతవిభాకర బింబమట్లు సొం
పిలుచు నవీనజీవనము వింతగ నింపె సమస్తసృష్టిలోఁ.

ఆరథమందు దీప్తిమయమై కనుపట్టె నిజప్రభావదు
ర్వారపవిత్రమూర్తి కనుపండువు సేయుచు, ధర్మజీవనా
కారమొ! శాంతిబింబమొ! యకల్మష సత్యనికేతనంబొ! సం
సారఫలస్వరూపమొ! ప్రజాహృదయంబొ! యనఁగ వెలుంగుచున్

ఒకచేతన్ రుధిరంపుఁ బాత్రమును, వేఱొక్కంటఁ బీయూష పా
త్రికయుం గైకొని సభ్యతామిషమునన్ దేశంబులందెల్ల నిం
తకు ధర్మంబులు గాఁగ నెన్నఁబడు నన్యాయంబు లీనాఁటితో
వికలంబై చనుఁగాక యంచుఁ గరుణావేశమ్ము దీపింపఁగన్.

పచ్చినెత్తురు నమృతంపుఁ బాత్రఁబోసి
దివ్యదుగ్ధంబుగా మార్చె దేవిమహిమ,
హాలహాలగర్భమందైన నమృతరసము
సంభవించు నటుం చిలఁ జాటనేమొ!

నిలువదు స్యందనంబు ధరణీపతిపాలన దండభీతిచే,
నిలువ దనాథబాష్పములు నిల్చిన పల్లపునేల, మోసగిం
పుల మఱపించు క్రించుఁదనపుం జతురాత్మల కాఁగఁబో దవ
ర్గళజవమొప్పు నేఁగెడిని గన్నులకుం గనరానిచోటికిన్.

పూర్వసింహాసనంబులు, ప్రోజ్జ్వలంపు
మణిమయ కిరీటములు భోగమందిరములు
చక్రసంఘర్షణంబునఁ జదిసిపోయి
యవి యివి యనంగరాక రూపఱెడు నేఁడు.

లేవు దివ్యతురంగముల్, లేవు కరులు,
ప్రజలె యా తేరుమోకులఁ బట్టువారు;
వాయుజవమునఁ దారకాధ్వమున నేఁగు
నంతరాయశతంబులనైన దాఁటి.

తేరుజాడల నెత్తురు పాఱిపాఱి
బంగరుంబంటఁ బండించె బక్క నేలఁ;
జక్రనేములు దాఁకిన స్థలములెల్ల
సస్యలక్ష్మికిఁ గళ్యాణశాల లయ్యె.

స్యందనాసీన యగుదేవి 'శాంతి శాంతి'
యనుచు మంజులగానమ్ము నలరఁజేసి,
నవ్యనక్షత్ర వీణాస్వనమ్ములందు
మేళవించెను జనులు విస్మితులు గాఁగ.

---

# ప్రణయాహ్వానము.

---

చెలియా, వెన్నెలబైల మంచుతడిఁ బూఁచీపూవకున్నట్టి పువ్వులనెత్తావులు మోచిమోచి నిడియూర్పులోవు నుద్యానకోమల మందానిలపోతముల్ మనల సమ్మానింప వాతాయనంబుల డాయంజని ముద్దుఁగౌఁగిలి సుఖంబుంగూర్చి సేవించెడిఁ.

చదలుపందిట వెన్నెలజాజితీవఁ
జుక్కలను పూలుపూచి యో సుందరాంగి,
ప్రణయమోహనమైన యీ ప్రకృతినెల్ల
సురభిళోచ్ఛ్వాస వీచుల సొగయనూఁచు.

పరిసరోద్యానమునఁ జూతవాటియందుఁ
గలరవంబులు సల్పి పికద్వయంబు
నిస్తరంగ సరస్సటు నెగడురాత్రి
గర్భ నిశ్శబ్దతకును భంగంబుఁగొల్పు.

చంద్రికాముగ్ధ శర్వరీఛాయలందు
జీవలోకంబు సుఖసుప్తిఁ జెందుచుండఁ,
గవిమనంబును బ్రకృతియుఁ గలయుచుండఁ,
బోదమా కాంత, సెలయేటి పొదలదరికి?

పులుఁగులు గూళులం జెదరిపోయిన ఱెక్కలనొత్తికొంచు గొం
తులను బరస్పరంబు బిగితోఁ బెనవైచెడి వేళ, నెప్పుడుం
దెలుపని హృద్రహస్యములఁ దిన్నగ వీనుల విందు సేయ నోఁ
జెలి, సెలయేటి సైకతముఁ జేరుదమా మన కేలియాఁతలన్?

జిలిబిలి కమ్మగానములు చేసెడి యాసెలయేటి యొడ్డునన్
బులకల విస్తరిల్లి నునుఁబోడిమిఁ జూపెడు నీదు బుగ్గలన్
దొలఁకెడి సిగ్గుడాలుఁ గడదోఁపని ముద్దులఁ గ్రుమ్మరించి య
వ్వల మధురోక్తులం గడగివైచెదఁ గోమలి, రమ్ము మెల్లగన్.

---

# కొండవీడు.

సాంధ్యరాగాంకితాంభోద శకలచయము
లనెడి కీలల నిర్మగ్నుఁ డయ్యె నినుఁడు;
శర్వరీకాంత కుంతలచ్ఛాయలందు
నెలవుకొనె విషాదపు రామణీయకంబు.

కొండవీటి దుర్గంబునకు సమీప
మున నొకానొక కేదారమునఁ గృషీవ
లార్భకుండు దున్నుచుండి సూర్యాస్తమయము
గాఁగఁ దలపోయుచుండె నాగలిని విప్ప.

ఇటుతలపోసి, పూనుకొను నెద్దుల నిల్పఁగ మేడి నూనినం
తట మొనకల్లు లోఁదవిలి ధారుణిఁ జీల్పఁగ నందు వెండిసం
పుట మటు పుఱ్ఱె పై కుబుక భూతమటంచును గేకవైచి య
చ్చటఁ బనిసేయుతండ్రిఁ దనచక్కికి రాఁబిలిచెన్ భయంబునన్.

తనయుని వెఱ్ఱికేకలకుఁ దందరలాడుచు వృద్ధుఁ 'డేమిరా?'
యని పరుగెత్త సీరపథమందునఁ బుఱ్ఱనుజూపి బాలకుం
డను: 'నిదియేమితండ్రి? తలయాకృతిగల్గిన రాయి దున్నుచుం
డిన వసుధార్ద్రగర్భము వడి న్వెడలెం గనుఁగొమ్ము' నావుడున్:

కృషికుఁ డంతటఁ బుక్కను గేలనెత్తి
యశ్రుధారాభిషేకంబు నాచరించి,
భయమునను సంభ్రమంబునఁ బెఱుకకున్న
తనయునిం గాంచి గద్గదధ్వని వచించె:

'మాతృదేశపరాయణ మానసులయి
సలిపి రిచ్చోట రెడ్డివీరులు రణంబు;
కత్తిగంట్ల నమూల్యరక్తంబు దొరఁగి
కీర్తివల్లిక పాదు క్రిక్కిఱిసి నిండ.

'శ్యామలాకాశవీథి నక్షత్రము లటు
కాలవాహినీతటములఁ గానిపించు
రెడ్డివీరకుమార చరిత్రపాద
చిహ్నములు, మృతశౌర్యంబు చివురువెట్ట.

"అరివీరుల్, పులిగర్జలన్ విని కురంగానీకముల్ కాననాం
తరముం జొచ్చెడుపోలికన్ రణమునన్ ధైర్యంబువోనాడి యే
డ్తెఱఁ బర్వన్, భుజవిక్రమంబు బలమున్ దీపింపఁ బోరాడి కీ
ర్తి రమం గాంచి ధరిత్రిగర్భమున శాంతింబొందువారల్ నృపుల్

'అట్టిశూరాగ్రగణ్యులయందు నొక్క-
పురుషుశిరముగఁ దోఁచు నీపున్క- తనయ,
దీని వీక్షించినంతనే స్తిమితమైన
నాదు రక్తంబు సైత ముష్ణముగఁ బాఱు.'

అనవిని బాలకుండు, 'జనకా, మనవారలెవారు? వారికిన్
మనకును బూర్వ మెన్నఁడయినం గలచుట్టఱికంబుఁ దెల్పుమా'
యనఁ, దలయూఁచి వృద్ధుఁడు: 'దిగ స్తములన్యులమయ్యెఁ జీఁకటుల్
మనముగృహంబుసేరునెడ మార్గమునన్ వచియింతునంతయున్'

అని మొద్దులఁ బోఁదోలుచుఁ
దనయుఁడును దాను నింటిదారి నడచుచున్
మును గొండవీటి నేలిన
జనవంద్యుల రెడ్ల పూర్వచరితలు వినిచెన్.

'పూర్వవీరుల ధమనులఁ బొంగినట్టి
రక్తపూరంబె మనలోనఁ బ్రజ్వరిల్లుఁ
గాని, కాలభరంబునఁ గండలెల్ల
శాంతకర్షకవృత్తి దాస్యమునఁ దవిలె.

కత్తికి నడ్డులేక రిపుఖండనలీలల నారితేరి భూ
పోత్తములన్ యశంబు గని యుర్విని బాలనచేసినట్టి ర
డ్డితతి సీరచోదకపు వృత్తి గ్రహించిరి; పోటుకత్తులన్
నెత్తుటఁ ద్రుప్పువట్టి చెడనే చెడె శూరత యంతరించుటన్ !

'పరవీరావళి హృత్పుటంబులను జీల్పన్ శక్తిమంతంబులై
దురమందున్ మెఱుపట్లు శోభిలిన కత్తుల్ నేఁడు రూపాంతర
స్ఫురణన్ సీరములందుఁ గఱ్ఱులుగ నేపున్ సొంపుచో నాడి యీ
ధరణీగర్భముఁ జీల్చుచున్నయవి శాంతప్రక్రియం గోరుచున్ !

'ఒక్క క్షణంబునన్ గగన ముల్లసితంబుగఁ జేసి యుల్క వే
ఱొక్క క్షణంబులో మఱుఁగునోజగ రెడ్ల ప్రతాపవహ్ని న
ల్దిక్కులనిండి యాంధ్రమహీతేజము నిమ్మడిచేసి, మోసపుం
డక్క తెలుఁగకుంట నకటా ! యలకత్తుల బాఁపెఁ జెన్నతన్.

ఇటులఁ జెప్పెడినంతలో నిల్లుసేరి
యెద్దులను దొడ్డిదోలిరి యిరువు రపుడు ;
కొడుకు మనమున నిసియెల్లఁ గొండవీటి
స్వప్నమే తప్ప మఱియొండు స్మరణ లేదు.

# కవితాప్రణయిని.

'సరస కవిత్వశారద, నిశాముఖమందు సుధాంశుమండలీ
కిరణతతుల్ శరజ్జలద కీర్ణములై మెలమెల్ల దిక్కులన్
నెఱసెడి రాత్రివేళ రమణీయ సముజ్జ్వల తారకావళీ
భరిత నభంపుఛాయలఁ గృపామతిఁ జేరవె నన్నుఁగూడఁగన్?

'కలయన్ స్వర్గమునందు నీదు రుచిరాకారంబు వీక్షించి చం
చలమై ద్రిమ్మరు నామనంబు నినుఁ గాంచం గ్రమ్మఱం గోమలీ,
కలకంఠంబులు గూసినం, గిసలయాగ్రంబుల్ పిసాళించినన్,
వలపుం జిల్కెడిపూవు పూచినను నీ నామంబె చింతించుదన్.

'పల్లవకోమలంబులగు పాదము లీవల మెట్టుచుండు నా
చల్లనిచప్పుడుల్ హృదయ సంచలనంబుల శబ్దమట్లు రం
జిల్లఁగఁ జేయునుల్లమును; సిగ్గు నా ప్రణయంబుఁ దెల్పికోఁ
బల్లవపాణి, నీకృపకుఁ బాత్రుఁడనంచుఁ దలంచి వేఁడెదన్.

'తళుకున్ బంగరు ఏటి సైకతములం దావుల్ గుబాళించు పూ
వులగుత్తుల్, వెదచల్లు పుప్పొడులసొంపుం జిల్కు నీపాదచి
హ్నల వీక్షించి ప్రమోదబాష్ప సలిలస్నాతంబులం జేసి ము
ద్దులు వర్షించితిఁ జంచలాక్షి, మదియందుం బ్రేమ చిప్పిల్లఁగన్.

'నీవు వసియించుసీమకు నేనుగూడ
వచ్చెదను వేగఁ గొనిపొమ్ము వలపులాఁడి,
శీతలామృతవర్షంబుఁ జిందు నీదు
సరస వీక్షా ప్రసాద భిక్షంబు వెట్టి.'

అని యువకుండు పల్క విని, యాకవితాలలితాంగి ముద్దు మోమునఁ జిఱునవ్వుదొంతరలు పొంపిరివోవఁగఁ బాణిపల్లవంబున వలిపంపుఁబయ్యెదను బొల్పుగనొత్తుచుఁ గాలియందె ఘుల్లని రవళింప నేలపయి నల్లనఁ దా బొటవ్రేలు రాచుచున్:

వలపుల తేనెతుంపరలఁ బచ్చనిమోసుల నెత్తు చిత్తపుం
గలఁతను దోఁపనీక కలకంఠమునా వచియించె: 'మోహనా,
పలికెదవోయి నీ ప్రణయబంధము; నెవ్వఁడవీవు? స్వర్గపుం
బొలముల సంచరించు మముబోఁటుల సంగతిఁ గోరివచ్చితే?

'నాదు బహిరాకృతిఁ గని యానందవార్ధి
నోలలాడిన వారెందరో గలారు
గాని, యెడలేని ప్రేమ శృంఖలలఁ జిక్కి
నామనముఁ గొన్న ప్రియులు గానంగ నరుదు.

'అవనిపై సంచరించు నీవంటివారు
దివ్య నక్షత్రమండలిఁ దిరుగఁగలరె?
అందరానిఫలంబుల కాసయేల?
పొమ్మ, ననుఁబోలువారు మీభూమిఁ గలరు.'

అనవిని, యా యువకుఁడు 'కా
మిని, యిట్టులఁ ద్రోసిపుచ్చ మేలే? నీకై
యనురాగవశత నెట్టుల
దినములు గడిపితినో దానిఁ దెలిపెద వినుమా.

'అప్పుడైన నీహృదయంబు నందుఁ గొంత
నెనరు గల్గి నన్నేలెదో చనవులాడి,
వినియు నీప్రేమకుం దగ ననుచు భ్రుకుటి
భంగమాత్ర నసమ్మతిఁ బయలుపఱతో.

'కవితాకోమలి, నీమనం బిడక యాకారంబుఁ గాన్పించి కై
తవలీలల్ పచరించి నాప్రణయగంధమ్మున్ వృథాపుచ్చెదే?
యువకుండ న్మధురార్ద్రచిత్తుఁడను స్నేహోల్లాసధుర్యుండఁ బ్రా
భవకాంక్షిన్ ననుమోసగించి యరుగన్ భావించితే నిర్దయన్?

‘ప్రత్యూషస్సుల నూత్నపత్రములు విచ్చి
విమల హిమబిందువులు రాల్చు సుమ వితతుల
తోడఁ బ్రమదాశ్రువులు వీడి పాడుచుందుఁ
గలికి, నీమనం బంటెడు గానములను.

‘సందెమబ్బుల చిఱువేరు చాయదీసి
పండువెన్నెల పసరునఁ బదనుచేసి
తరుణి, నీపట్టు ముసుఁగు నద్దకమువైవ
విఫల యత్నంబులం జల్పి వెఱ్ఱినైతి.

‘పారిజాతపుష్పంబులు పవనహతిని
మృదులతృణముల రాలెడు నెడల, నీదు
చరణవిన్యాస కోమల శబ్దమనుచు
నడుగుగుర్తులఁ బలుమాఱు నరయుచుందు.

‘సాలెగూళ్ల ముత్తెంపు సరములటుల
లేఁతగాలికి నల్లఁ జలించు మంచు
నీటిబొట్ల మాలనుగట్టి నీదు మెడను
వైవఁ దలపోసి యెగతాళిపడితి చెలియ.

'గాఢ నిశ్శబ్ద శర్వరీ గగనమందు
నీవు పలికించు వల్లకీ నినదములను
వినుచుఁ బ్రమదాశ్రుపూరంబు కనులఁదొరఁగఁ
గాంచుచుందు గభీర నక్షత్రవీథి.

'వలపులు పండుపండమికి వందురు చుండెడు చిత్తమందు నెత్రు లొలుక నడ్డుమాటలనుతూపుల నొంచెదెయాత్మహత్యకుం దలకొన దారిఁజూపెదవె? ధర్మమె నమ్మినవాని మోసగిం పుల వలయించి చంప? నినుబోఁటికి నింతటిక్రూరచిత్తమే!

'గ్రామవాసిని, ఎఱుఁగను కైతవంబు,
ప్రకృతి తల్లి స్తన్యంబునఁ బ్రబలినాఁడఁ,
బొలముల విహరించుచుఁ బ్రొద్దుఁ బుచ్చుచుందు,
నట్టి నాముద్దువలపును నరయలేవె?'

అని యువకుండు పల్కఁగ రసార్ద్రమనంబున రేఁగుభావముల్ దొనికెను బాహ్యరూపములతోనను బ్రార్థన కొప్పికోలుగాఁ జనవుమెయిన్ మృణాలసదృశంబగు బాహువులెత్తి ప్రేయసుం దన కవుఁగింటనొత్తెఁ గవితా లలితాంగి విముగ్ధచిత్తయై.

---

# ద్రౌపదీసందేశము.



సంజయా, యింకఁజాలు నీశాంతిమార్గ,
మడవిఁ బడరాని యిడుమలఁ బడితిమయ్య;
బోధలొనరించి హక్కులఁ బులిమిపుచ్చ
నిన్నుఁబంపెనె కురురాజు నేర్పుతోడ.?

వగచినట్లుండవలయును, వాని యాలి
త్రాడు తెగవలెనున్న విధాన నీవు
పూర్వకష్టంబులకు సానుభూతి చూపి
తేనెపూసిన కత్తిని దింపఁదలఁతె.

కపటమార్గంబులం బన్ని కనుల మూసి
రాజ్యభాగంబుకొన్న ధైర్యంబు కతన
నేడు సైతము మాటల నిద్రపుచ్చి
వనికి వెడలింపఁ గుట్రలుఁ పన్నువారె?

మున్నటి దినాలు గావివి, మోసములకుఁ
దవిలి తలయూఁచునే నేఁడు ధర్మరాజు?
పరిభవానల కీలలు పాండుసుతుల
హృదయముల రగిలింపవే రేపుమాపు?

నను సభలోని కీడిచి, కన న్వినరాని పరాభవంబుచే
సినఁ గనులారఁ గాంచియు నిసీ! పతులేవురు ధర్మబద్ధులై
మును పగఁదీర్పకుంటఁ గురుభూపతి మమ్ములఁ జుల్కనాడెనం
టె! నిరతమొక్కరీతిఁ జనునా మనకాలము సంజయా, యెటుల్?

అంతంబొందెనె పాండుపుత్ర దృఢబాహాశక్తి రోషంబు? దు
ర్దాంత ప్రక్రియ వైరివీరమథన ప్రారంభ కౌతూహల
స్వాంతుల్యాంతులుగాను, కాలమెపుడో వచ్చుంగదా యంచు న
త్యంతాసక్తిఁ బ్రతీక్ష చేసెదరు శౌర్యాలంబులౌ మత్పతుల్.

రాయబారంబులేల యీరచ్చలేల?
పాలుఁగోనక శాంతింతురే పాండుసుతులు?
ఊరకిమ్మన్న నిచ్చునా యుర్వి నృపుఁడు?
పిల్లిశాపంబులకు నుట్లు ప్రిదిలి పడునె?

తెలుపుము సంజయా, విరటుధేనువులం బరిముట్టువేళ ను
జ్జ్వలభుజవిక్రముల్ కురునృపాలవరుల్ చవిగొన్న పార్థుతూ
పుల దోనలింక రిత్తవడిపోవవు; గాండివి చిత్తమట్ల వై
రుల రుధిరంబుఁ జూఱఁగొన రోషముఁ గ్రక్కుశరంబులేనియున్.

రాజ్య మేనాఁటికిని వీరభోజ్యమనుచు
జనులు పల్కెడిమాట నిశ్చయము సుమ్మి,
పరమసుఖములఁ దులదూఁగు నరవరుండు
పిలిచిరాజ్యంబులిచ్చునే భిక్షుకులకు?

బొల్లిమొగాలపైఁ జెమటబొట్టులు గ్రమ్మ నురక్షతంబులన్
బెల్లుగ నెత్తురోడికలు పేర్చఁగ మిమ్ము పృథాసుతుండు వి
ద్యుల్లతికాభబాణములఁ దూల నదల్చి వధించుదాఁక మీ
యుల్లము రాజ్యభాగమున కొప్పునొయొప్పదొ సూతనందనా.

వైరివిభీషణాకృతిని వాయుసుతుండు గదన్ ధరించి దు
ర్వార మదేభ మబ్జవనిపైఁ బడురీతిఁ గురూర్వనాథులం
బేరు దలంపరానియటు పీనుఁగుపెంటలు సేయునప్పుడై
నా రవయేని నెంతురె మనంబునఁ బాండుతనూజశౌర్యమున్?

కవలసఁ బిల్లవారలటుగాఁ దలపోయుదు రేమొ! మీ పంబు
గవిసిన యప్డె వారి భుజగర్వము శౌర్యముగానవచ్చు; మ
బ్బు విడిచివచ్చుసూర్యుని సముజ్జ్వల తేజమునాఁగఁ జూడఁగా
నెవరును జాలరయ్య రణమేడ్తెఱ సల్పెడి బాలవీరులన్.

ఉత్తమాటలనేమి ప్రయోజనంబు?
అవని యొసఁగుటో, లేకున్న నని సలుపుటో
చెప్పిపంపుఁడు; నామేన జీవమున్న
దనుక సంధియత్నంబులు దలఁగుఁడయ్య.

---

# దుర్యోధనుఁడు.

రాజరాజ దుర్యోధనా, రాజ్యలక్ష్మి
నట్టనడియేటియందు నీపుట్టిముంచె
నయ్య, విధి తిరస్కారంపు టవధివోలె
నీకు నంత్యపతన మింత నీచమగునె!

ఏలితి వీ ధరావలయ మెంతటివీరుల కేని గుండెలో
గాలముగాఁగ, వైరిబలగంబులకున్ యమదర్శనంబుగన్;
పాలకుఁ బోరువెట్టు పసిపాపలు 'వచ్చెను రాజరాజ' నన్
డోలిక నిద్రవోదురు కడున్వెఱపెత్తఁగఁ బేరువిన్కలిన్.

ఎఱుఁగవె భీతియన్న 'నదియెట్టుల నుండు' నటంచుఁ బల్క నీ
వెఱవమి, విక్రమక్రమము, వీర్యము నెక్కడపోయెనోయి? యా
సరసున డాఁగినాఁడవు? విచారము లేదె? యశంబుకన్న న
శ్వరమగు ప్రాణముల్ మధురసంబులె? భారతకీర్తి నెంచవే?

హృదయముఁ గోసియిమ్మనినఁ బ్రీతిగ నిచ్చెడు ప్రాణమిత్రుఁడే
యదవదలేక నీకయి రణావనిఁ గూలిన కర్ణయోధ నీ
మదిఁ బొడకట్టఁడే? యిటుల మాన్యతపోవిడి తుచ్ఛజీవముం
బదిలము సేయనేల నరపాలక, వంశయశంబు నెంచుమా.

ఎంతకాలంబు బ్రతికిన నెప్పుడైన
మరణమొందక మానఁడు మానవుండు;
క్షత్రియుఁడు వ్యాధిబాధలఁ జచ్చుకన్నఁ
గత్తిపోటుల మడయుటే కరముప్రియము.

సాటిలేని విరోధులఁ జదిపినట్టి
పరభయంకర గద చేతఁ బట్టినావు;
లెమ్ము లెమ్ము, దుర్యోధనా, లెమ్ము లెమ్ము
క్షత్రియత్వము రూపింప శక్తిలేదె?

ప్రవహింపదే నీదు రక్తనాళంబులఁ
బూర్వుల శోణితపూర మిపుడు?
ప్రజ్వలింపదె నీదు భావకుండంబున
నవమానరోష హోమానలంబు?

తీఱనే నేఁటితో దిక్కులవిలసిల్లు
భారత క్షత్రియ వంశకీర్తి?
గొడ్డుపోయెనె నేడు కురురాజ్ఞి గాంధారి
కదనవీరశతంబుఁ గన్నతల్లి?
లెమ్ము, దుర్యోధనా, యింక లెమ్ము లెమ్ము,
సరసితటమున నున్నారు సమరకాంక్షు
లైన పాండవేయులును మురాంతకుండు;
ప్రాణములపైన మోహంబు వదలుమయ్య.

ప్రాణమిత్రుండు కర్ణుండు స్వర్గమేఁగె,
నంపశయ్యను గాంగేయుఁ డస్తమించెఁ;
గొడుకులును దమ్ములునుగూడఁ గూలినారు;
అంత యభిమానమే దేహమందు రాజ?

* * *

గెలిచితివా యకల్మషపుఁగీర్తియు రాజ్యమునబ్బఁ, బ్రాణముల్
దోఁగితివా నిలింపపురి తోఁటలలో విహరింతువయ్య; శూ
రులకు రణంబు పండువు; విరోధుల గీటడఁగించి సర్వభూ
వలయము నైనఁ జావయిన భారతరాజ,గ్రహింపు మిత్తెఱఁగ్.

* * *

---

# రాధయుత్కంఠ.

---

చల్లని పన్నీట జలకంబులాడి
యగరుధూపము వెట్టి యలకంబులార్చి
నుదుటఁ గస్తురి బొట్టు కుదురుగాఁదీర్చి
కన్నుఁదమ్ములఁ గ్రొత్త కాటుక దిద్ది
గోరంటపూగుత్తి కొప్పునం దురిమి
కమ్మతావులనీను కలపంబునలఁది
పొడికప్పురంబులఁ బడకింటఁ జల్లి
పాన్పుపైఁ బువ్వులు పఱపుగాఁ బఱచి
యేలరాఁడో సామి యిం కేలరాఁడో
యనుచుఁ బోరము నానుకొని వేచియుంటి.

*　　　*　　　*

స్వాంత మాలస్యంబు సైరింపలేక
వేదనాభరమున వ్రీలంగఁజొచ్చెఁ
గనికని దారులు కన్నులు నొచ్చె
నాసామి కృష్ణుండు ననుఁ గాంచరాఁడు.

*　　　*　　　*

సంజకెంజాయలు శమియించిపోయెఁ

బతుకులు గూళ్ళకుఁ బరుగిడసాగె
మందల కాపులు మరలిపోయెడిని
వేణుగానంబులుఁ వీనులసోఁకె
కోయిల కొమ్మావి గుబురులోఁ గూసె
సందెచీఁకటి పొగ చదలావరించెఁ
జుక్కల రసగుండ్ల జొంపంబు లలరె
నేలరాఁడో కృష్ణుఁ డింకేల రాఁడో!

* * *

కప్పురపుం దివ్వె కడముట్టవెలిగె
బాన్పుపైఁ బువ్వులు వసివాళ్ళువాడె
మంచిగందపుఁబూఁత మైఁ జిట్టిపోయె
నిద్రిమాంద్యమ్మున నేత్రము లొ్మగిడెఁ
బడమటి దెస కేఁగు నుడు గణంబులను
గనుచు ద్వారముకడఁ గన్నుగూర్కితిని.

* * *

నాసిగ్గు పుచ్చంగ నలిన బాంధవుఁడు
వెయ్యి దివ్వెలతోడ వెలుఁగుచు వచ్చె.

* * *

కూర్కులేమిని గన్నుఁగొన లెఱ్ఱవాఱ
బొరలుచిట్టిన మేనిపూఁతలు రాలఁ
జెమ్మట ముత్యాలు చెక్కిళ్ళజాఱ

ఘల్లుఘల్లని చేతిగాజులుమ్రోయ
మజ్జిగ జిలుకుచు మధురగీతములఁ
గాంతుఁ డొనర్చిన కఠినంపుఁ జేఁతఁ
దుమ్మెద పైఁబెట్టి దూఱుచునుండ
నాముద్దు కృష్ణుండు నావెనుక నిలిచి
ముసిముసి నవ్వుల మురియుచునుండె.

*            *            *

వేచియుండిన యప్పు విభుఁడరుదేఁడు,
వేసవివానల విధముగా నతఁడు
కలవలె వచ్చును గనిపించిపోవు.

---

# ఎంత మోసము!

బాటసారి

చీలుదారులఁ గూర్చుండి చిన్నదాన,
కన్నులను నీరు నించెదు కరుణమొలుక,
నేపథంబున నేఁగ నీ కిచ్చ గలదు?
ఇరులు గ్రిమ్మకమున్నె నిన్నిల్లు సేర్తు.

చెట్లనీడలు విరివియై చేరెఁ దూర్పు;
సంజకెంజాయ పడమటఁ జక్కనలమెఁ;
బైరుకోఁతల కేఁగిన పల్లెపడుచు
లింటి కరుగుచుఁ బాడువా రేలపాట.

గాలితాఁకున వెన్నులు కదలునపుడు,
తిరుగఁ బాఱిన పరిచేలు తీయు రాగ
మదిగో! వినఁబడుచున్నది, యలల మర్మ
రములు సంధ్యా ప్రశాంతగర్భమునఁ బోలె.

## యు వ తి

గోపికామోహనుఁడు నందగోపసుతుఁడు
వచ్చు నీదారి నని సఖి పలుక వింటిఁ;
బ్రొద్దువొడుపున నుండి యీపొన్నక్రింద
వేచి వేచి యీదారులు చూచుచుంటి.

రత్నఖచిత కిరీటంబు రాజుశిరము
నందు వెలుఁగొందుచుండు నటంచు వింటిఁ,
బట్టుపీతాంబరము వల్లెవాటువైచి
మత్తకరి నెక్కి వచ్చు నన్మాట వింటి.

## బా ట సా రి

చిన్నికృష్ణుని సేవింపఁ బొన్నక్రింద
వేచియున్నావె? నీముందు వెళ్ళినట్టి
వేణుధారినిఁ గాంచవే? విశ్వమోహ
నంపుగానంబు విననె యో నళినవదన?

నెమ్మిపించెము క్రొమ్ముడిఁ జిమ్మజిగులు
చిన్నికూఁకట్లు మెడపైనఁ జిందులాడు
బొజ్జనటుకును వ్రేలు క్రొంబూలమాల
యతని పదశబ్దముల ఛంద మమరుచుండు.

ఆమహాత్మ్యఛాయలు సోఁకినంతమాత్ర
జీర్ణ తరు లతావళికూడఁ జివురు వెట్టు;
ఆ మురళీ మోహనారావ మలరినంత
రెల్లుపుల్లల సైతము రేఁగు గీతి.

యు వ తి

ఇపుడు స్మృతియందు నావ్యక్తి యెసఁగుచుండు
భగ్నమైన యింద్రధనుస్సుపగిది నహహా!
యెగిరిపోయెడు కలయట్టు లీక్షణముల
నాటి యింద్రజాల మదృశ్యమయ్యె నపుడె!

వేణుగానంబు దేనినో విన్నయట్లె
దోఁచుచున్నది, దూరానఁ దోయదములఁ
దారకావీణ లొనరించు ధ్వను లనంగ;
నెంతమోసంబు జరిగెనోయీ సఖుండ!

బా ట సా రి

అదియె తెలియరాని విచిత్ర మతివమిన్న.

# అజ్ఞాతకవి.

కిసలయగుచ్ఛమధ్యములఁ గీల్కొని నే దినకాంతిఁగాంచలే
నిసి! యని మంచుబాష్పముల నేడ్చు సుమంబటు సత్కవీశ, క
ర్కశ పడనేల? తావిఁగొనుగాడ్పులరీతి విమర్శకుల్ కృతిన్
రసముగ్రహించి నీయశము రాజిలఁజేయుదురయ్య యెల్లెడన్.

పొలుపుగ శేషవల్ నిలువఁబోక మనోజ్ఞ నిసర్గగానముల్
సలిపెడు నిర్ఝరంబ, గిరిసానుతటంబున నిన్ను నెవ్వరుం
దలఁప రటంచు నెంచెదవొ, తాలిమినానుము బాటసారి నీ
కలరవ మాధురీమహిమఁ గాంచి నినుం బ్రకటించు నిద్ధరన్.

డాఁగియుండు వసంతంబు డాయుదనుక
వేఱ ప్రకటన నీకేల వినుము పికమ,
స్వర్గగానంబు భూతలస్థంబు చేయు
నీ పికస్వరకంఠంబు నెగడుచుండ?

ఓరి బాలక, నీమురళీరవంబు
వ్యర్థమౌనని చిత్తతాపంబువలదు,
రాగపరిచితుఁ డెవ్వఁడో రమ్యగీతి
వినిమెయుండు నానందంబు వెల్లివిరియ.

# ముసలిమాలెత.



మిడిమిడి యెండ సోలుచు శమింపని తాపముతోడ నూరుపుల్
వెడలఁగ డొల్లయై కడుపు వెన్నెముకం గర మంటియుండఁగన్
బుడిబుడి మిట్టపల్లములఁ బూనికఁ గాలిడఁబోయి తొట్రిలం
బడుచు గతి శ్రమన్ ముసలిమాలెత వచ్చుచునుండె నొంటిగన్.

కాల కఠోరసీర మలికంబను ధారుణిదున్న లోఁతుగం
జాళులు వాఱెనా వళులుసాగి శ్రమాంబులు పిక్కటిల్లి, స్వే
తాలక వృత్తముల్ నొసలి కావలనీవల వ్రేల నందు ము
త్యాలవిధంబునం దొరఁగు నాముదివగ్గు తలం జలింపఁగన్.

ఒంటిపూఁటైన నాఁకటిమంట దీఱఁ
గుడువ నొక కడియన్నంబు గూడకున్కి
నస్థిపంజరమైన దేహంబుగూడ
మోవలేదన సోలును ముసలియవ్వ.

దారిద్ర్యదేవత తనరూపు గనుపింప
వగ్గువాలకమూని వచ్చెనో కొ!
భేతాళునాజ్ఞ గావించు పిశాచంబు
పీనుఁగు నొడలితో వెడలెనో కొ!
స్వార్థ పరస్వాంతుఁడౌ రాజుచేఁ బడి
లావుదూలిన దేశలక్ష్మి యొకొ!
సకలవస్తు ప్రదర్శన శాలలో నిడ్డ
ముదిమి యవధిఁదెల్పు మూర్తియొకొ!
యనఁగఁ జేయూఁతకఱ్ఱను నవనినూని
నడువఁజాలక తడఁబడి యడుగులిడుచు
నెండవేఁడికి మేనెల్ల నెరయుచుండఁ
జెట్టునీడకుఁ దానల్లఁ జేరవచ్చి;

నను నచ్చోటనుగాంచి, కూలఁబడి ప్రాణంబుల్ వెలింబాఱునో
యన నిశ్చేష్టతనుండి తేఱి కడుదాహంబెత్తె నీరమ్ముఁ దె
మ్మను నర్థంబుగ దోసిలిం బెదవి డాయంబట్టి చూపింప నం
తనె తద్భావమెఱింగి తాళదళపాత్రంబందు శీతాంబువుల్,

కొని తెచ్చి యీయఁ బెనుదగ
తనియంగాఁ ద్రావి యలఁత దఱిగినపిదప
నను దీనదృష్టిఁ గనుఁగొని
వినయముతో నిట్టులనియె వృద్ధాంగనయుః

'నోటఁదడిలేక మాటాడుదీటులేక
గాసివడియున్న ననుఁగాంచి కనికరమున
నీరు తాగించి ప్రాణంబు నిలిపినట్టి
నిన్ను నేమని పొగడుదుఁ గన్నతండ్రి!'

అని కృతజ్ఞతాసౌరభ మార్ద్రవచన
కుసుమములఁ జల్ల, నేనును గుతుకమొంది
యవ్వచరితంబుఁ గనుఁగొను నాసతోడ
నిట్టులంటిని నాదరం బుట్టిపడఁగ:

'ఎవ్వరిదాన వీవు ? మఱియిచ్చటికిం జనుదెంచుటేల ? నీ
కెవ్వరు చుట్టపక్కము? లిఁకెయ్యెడకుం జననిచ్చగల్గె నో
యవ్వ! సమస్తముం దెలుపుమా'యనఁగన్నుల బాష్పపూరముల్
నివ్వటిలంగ నాత్మకథ నెట్టనఁ దెల్పెను గద్గదోక్తులన్:

'పడమటి మెట్టదేశములఁ బైరులు పంటలు వానలేమికిన్
వడఁబడి యెండి కాటకమువచ్చిన సన్నజనంబు మంటలం
బడియెడి దోమగుంపటుల మాడి దినంబున కొక్కసారియున్
గడికబళంబు లేక కడుకష్టము నొందుచు నుండి రచ్చటన్.

'డెల్టాభూములఁ బైరులు
గలవని యచ్చోటిజనులు కౌతుకపడుచున్
వలసలువచ్చిరి ప్రాణం
బులు నిలువం బెట్టు నాస పొంపిరివోవన్.

'నాకూఁతురు నాకొడుకును
నాఁకలి యెట్టిదియొ యెఱుఁగనట్టుల నన్నున్
సాఁకుచునుండిరి వేళకు
ఆకో అంబలియొ గలుగునంతకు నిడుచున్.

'ముసలితనమునందు ముప్పుతిప్పలుగల్గెఁ
దమ్మిచూలి వ్రాలు వమ్మపడునె?
కొడుకుఁగూఁతు మొన్నఁ గ్రొత్తజ్వరంబుల
వాతఁబెట్టి నేన బ్రతికియుంటి.

'పండుటాకులురాల్పక పసరులొలుకు
పిన్నకనటల వెదకెఁ బాపిష్టిబ్రహ్మ !
ముసలిముదుకకు సంజీవి మెసవఁబెట్టి
విసముఁ దినఁబెట్టెఁ బ్రాయంపుఁ బిల్లలకును !

'క్రుంగు వేరు దెగియుఁ గూలని ముదిచెట్టు
పగిది నయ్యె నాదు బ్రతుకదేమొ!
యెవరికొఱకు మనుదు నింకమీఁద నిలలోన?
భారభూతమైన ప్రాణమేల?'

అనుచుం బట్టిన నిల్పరాని వెత యాస్యంబందుఁదోల్కాడ దృష్టి నిరోధంబొనరించు బాష్పకణముల్ చెక్కిళ్ళపై జాఱ, పండిన కేశంబులు వాయుతాడితములై నీరంధ్ర ఘర్మాంబు సేచనముంబొందఁగ నార్తమూర్తియయి సంస్తంభించియున్నంతట

వృద్ధనారి దైన్య మీక్షించి మద్హృద
యాబ్జమొలికెఁ గరుణ మనెడు మధువు;
ఆర్ద్రహృదయమునకు నార్తభావమునకు
నెట్టిపరిచయంబు లెసఁగియున్నో!

అవ్వకొంతసేపు నట్టులే కూర్చుండి
యేమితలఁచెనేమొ యేఁగునిచ్చఁ
గజ్జఁదడవుచుండఁ గని నేను బల్కతిఁ
దోడ్పడంగఁ గోర్కె తొందరింప:

'కాయముజూడ దుర్బలము, కన్నులపాటవముం దొలంగె, నే సాయమొనర్ప బంధువులు సైతము లేరిట నెట్లుకాలముం ద్రోయుదు వవ్వ? యీకలుపు దుంపలు తీయను సత్తువైనలే దే! యటుగాక నీకడుపు నెట్టుల నింపెద విట్టిపల్లెలన్?'

ఎండుటాకుల వెన్నెల పండినటులఁ
బెదవిమూలలఁ జిఱునవ్వు పొదలుకొనఁగ
నవ్వ యిట్లనె: 'నాయనా, దైనసేమి?
పుట్టఁజేసిన దేవుండు పూరియిడునె?

'గొడ్డుకాటకమున బందుగులను జేరి
యదవ త్రావుడు త్రావంగ నాసలేదు;
అట్టులోటను ఆకైన అంబలైనఁ
గూలియొనరించి కుడుచుటే మేలునాకు.

'కన్నకన్నవారల యిండ్ల కడపఁద్రొక్కి
బిచ్చమెత్తుట యన్న నాకిచ్చలేదు;
కాలుసేతులు నున్నంత కాల మొరుల
చేతికూటికి నాసింపఁ జిన్నతనము!'

అనవిని, యవ్వ నైతిక గుణాతిశయంబున కబ్బురంబునొంది నెనరుమై వచించితిని: ‘ నీదగు నీతికి సంతసంబు గల్గెను; నిఁకమీఁద నీవెచటికిం జననెంచక ప్రత్యహంబు గైకొనుము మదీయగేహమునఁ గోరినయట్టుల మజ్జిగన్నమున్.’

---

అనిన సంతసించి యవ్వఇట్లనె: ‘ నయ్య,
కూలిచూపి నాకుఁ గూడుపెట్టు,
తిరిపెమెత్తి తిన్నఁ దీఱునా యాఁకలి?
రమ్ము పల్లెఁజేర జిమ్మదీసె. ’

---

# జాతీయగీతము.

---

జ్జోహార్! జోహార్! భారతమాతా,
జోహార్! జోహార్! జోహార్!
శారద శుభ్ర వియత్తల పథమున
సంచరించు నీరథము,
నీ మృదు వీణాగాన ప్రబుద్ధము
నిత్యము మామనము.
జోహార్! జోహార్! భారతమాతా,
జోహార్! జోహార్! జోహార్!

ప్రత్యూషలక్ష్మి మకుటమణి ప్రభఁ
భాసె తమోగణము,
నీపదపంకజ నూపుర ఝుంకృతి
నిద్రారహితము జనము.
జోహార్! జోహార్! భారతమాతా,
జోహార్! జోహార్! జోహార్!

విప్లవ ఝంఝా విచలిత జీవన
వీచి నికాయమున,
స్థిర విజయోడుప కర్ణధారణము
సేయుమ శౌర్యమున.
జోహార్! జోహార్! భారతమాతా,
జోహార్! జోహార్! జోహార్!

ముకుళితహస్తులు నీప్రియపుత్రులు
మోదదృష్టిఁ గనుము,
నీకరుణామృత నిర్ఝరపూరము
నింపు మమ్మ సతము
జోహార్! జోహార్! భారతమాతా,
జోహార్! జోహార్! జోహార్!

నీపదపీఠిని ప్రాణసుమంబులు
నిల్పి భజించెదము,
గర్హిత దాస్య భరంబును మాన్పి
సుఖంబులు మా కిడుము.
జోహార్! జోహార్! భారతమాతా,
జోహార్! జోహార్! జోహార్!



# రాట్నపుపాట.

---

పొద్దుపొడుపూ చుక్క పొడిచింది రాట్నమా,
గూళ్ళలో పక్షులు కూసేను రాట్నమా
అరుణకిరణాలతో ఆటలాడే నూలు
తమ్మికాడలలోని తంతులంటీ నూలు
మంచినీళ్ళల్లోన మఱిగిపొయ్యే నూలు
పాలీడుపొంగుతో సరసమాడే నూలు
గాలితరంగలలోన తేలిపొయ్యే నూలు
వడకవేరాట్నమా, వజ్రాలదూది
నడవవేరాట్నమా, నక్షత్రవీథి.

పొద్దుపొడుపూచుక్క పొడిచింది రాట్నమా,
గూళ్ళలోపక్షులూ కూసేను రాట్నమా
ముద్దులొలికేపాట ముత్యాలపాట
పరువు నిల్పేపాట బంగారుపాట
మత్తుమాపేపాట మధురంపుపాట

నిద్రలేపేపాట    నిద్దంపుపాట
కడుపు నింపేపాట    కనికరపుపాట
పాడవేరాట్నమా భావిభారతము
ఆడవేరాట్నమా యాంధ్రనాటకము.

పొద్దుపొడుపూ చుక్క పొడిచింది    రాట్నమా
గూళ్ళలో పక్షులూ కూసేను    రాట్నమా
కట్టగుడ్డాలేక    కటకటాపడుచు
కుడువకూడూ లేక    గోడుగోడనుచు
దాస్యవారాశిలో    దరిగానలేక
బెదరిబెదరీచూచు    పిరికిపందలను
ఆత్మనిందలతోడ    నడలు బేలలను
పురికొల్పశంఖంబు    పూరించి లేపి
తిప్పవేరాట్నమా    దేశచక్రంబు
విప్పవేరాట్నమా    విజయకేతనము.

# ఏలపాట.

---

వస్తావంటే చక్కనిదానా
వలపుచిందే చూపూదానా
మల్లెపువ్వుల కోసకుపోయీ మల్లీవస్తాము.
గండుకోయిలా కూసేచోట
గుండుమల్లెలూ పూసేబాట
ముద్దుముచ్చటా దీర్చూకొంటా మురిపేమాడేము.
చెంపచేయీ పెట్టుకోని
చింతపొయ్యే చిన్నాదానా
కళ్ళనిండా కాటుకనీళ్ళూ గారూటెందుకే?
పక్కపక్కా రాసుకొంటా
పదములెత్తీ పాడూకొంటా
అల్లో నేరేటీచెట్లానీడ ఆడుకొందామె.
పూలగుత్తులూ కోసీయిస్తా
పుట్టతేనెలూ తీసిపెడ్తా
చల్లనీటీ కొండా యేట జలకమాడేమె.
వస్తావంటే చక్కనిదానా
వలపుచిందే చూపూదానా
మల్లెపువ్వుల కోసకుపోయీ మల్లీవస్తాము.

---



## విన్నపము.

ద్విపదరచనయందు సంప్రదాయసిద్ధములగు గణములే గాక చంద్రగణములలోని 'సలలము' 'భలము' అను పంచమాత్రిక గణములను, అప్రయత్నపూర్వకముగ పడినచోట అంగీకరించితిని. అట్టి గణభేదమువలన ద్విపదయొక్క యేకగతియందలి విసుగువేసటలు తొలఁగునని నాయుద్దేశము. శీర్షికలకడ చుక్కగుర్తులుగల కావ్యములన్నియును గేయములు. వానివాని గతిప్రసరణముల ననుసరించి చదువవలయును.

దువ్వూరి రామిరెడ్డి.

# ప్రేమాంకము.



దారినిఁ బోవుచుండ నొకతట్టున రత్న మయాచితంబు చే
కూరినరీతి నాయెడఁ దక్కున్ సరిదాఁకిన మిత్రుఁడున్ మనో
హారి, కళాతపస్వి, సరసాత్ముఁడు, మోమునఁ బ్రేమమాధురీ
సారము చిప్పిలం బరులస్వాంతము లాగెడి యింద్రజాలికుం
డై రమణీయభావకవితాంచితుఁడై చెలువారు రాజమ
న్నారు సఖుండుగా దొరకె నాకుఁ, దదాప్తత కానవాలుగన్
కోరియొసంగితిం గృతినిఁ గూరిమినెచ్చెలి కంకితంబుగన్.

22-12-1924.
పెమ్మారెడ్డిపాళెము.

ప్రియమిత్రుఁడు,
దువ్వూరి రామిరెడ్డి.



# నైవేద్యము.

---

తల్లి, నీయుత్సవముగాంచఁ దరలినార
లనుఁగుఁ దనయులు నైవేద్య హస్తులగుచు;
ధన్యులెల్లరు నాత్మోచితంపుఁ గానుక-
లర్పణము సేయవచ్చిరి; యందికొమ్మ.

స్వర్ణసుమముల నర్చన సలుపువారు
భాగ్యవంతులు నీపాద పద్మములకు;
ఏమి లేనట్టి భిక్షుకుం డేని నేఁడు
కంటి క్రొన్నీటి ముత్యాల కానుక లిడును.

పూజ్యు లధములు, ధనికులు పుట్టుబీద
లనెడి యెడలేక యెత్తిరి హారతులను;
భక్తిపరవశులైన యాపౌరజలగీతి
దిక్కు-దిక్కులయందుఁ బ్రతిధ్వనించు.

అమ్మరో, నీదు మందిర ప్రాంగణమున
మండుచున్నది కర్పూర ఖండగణము!
త్యాగపరిశుద్ధమగు నాత్మఁ దలఁగిపోవు
కామమటు ధూమరేఖలు గడలుకొనఁగ.

పొద్దుపొడుపున నీ పాదపూజకొఱకు
కవిని, తెచ్చితి దోసిటఁ గన్నెపూలు;
బలి వితర్దిక నిరతంబు వెలుఁగునటుల
హృదయపు సుగంధదీప మర్పింతుఁ గొనుము.

ఫిబ్రవరి 1921.

---

# * కర్ణధారి.

---

సందెచీఁకటి దెసలఁ జక్కనలమెం;
గాలిదుబ్బులు చుక్కగములఁ గ్రమ్మెం;
బ్రబలవేగాన దుపాను వీచెన్;
ఆకసము గీకసం బావిలింపన్
గర్జించె మేఘాలు కంపమెత్తన్;
నటియించు భైరవు జట లొకో నాన్
నురుగుఁ గ్రక్కెడి కడలి తరఁగగుంపుల్
చెలియలికట్టపైఁ జిందులాడన్;
ఉన్మత్తప్రకృతి నృత్యోత్సవంబుల్
మింటిని మంటిని మేళవింపన్
గడిమి విడువకు కర్ణధారీ,
పడవ నడుపుము భయముదీఱ.
నడిసముద్రంబునఁ బడితినంచున్
జడివాన నిలువంగ జాలనంచున్
పడగండ్ల 'బాంబులు' పడునో యంచున్
గటికిచీఁకటి గన్ను గాననంచున్
ఒంటినైతిని సాయ మండదంచుం
బరిపరి విధముల భావింపఁగం
బ్రాణ సంశయమునఁ బలవింపఁగన్

సమయంబు గాదిది జడచిత్తుఁడా,
చినిఁగిన తెఱచాప చెఱఁగులెల్లన్
సవరించి, యాత్మవిశ్వాసంబునం
    గడిమి విడువకు కర్ణధారీ,
    పడవ నడుపుము భయముడీజీ.
పుడమిఁబ్రాఁకెడు చిన్న పురుగువోలెం
గష్టనిష్ఠురవిధి కాలిక్రిందం
బడి చిందుచిందురై ప్రాణమేదం
బుట్టలేదోయి యే పురుషుఁడైనం
గ్రిందికి దింపకు కేతనంబున్;
'సెర్చిలైటులు' వోలెఁ జీఁకట్లలోన్
మెఱసెడిఁ జూడు! క్రొమ్మెఱుఁగుఁదీఁగల్
దారిఁజూపెడు ధ్రువతార పైనన్
మిక్కు–మిక్కు–న వెల్గు మేఘాలలోన్.
జీవనదీపమై చెలఁగు నాసన్
మలపక పాథోధి మధ్యంబునం
    గడిమి విడువకు కర్ణధారీ,
    పడవ నడుపుము భయముడీజీ.

29-5-1922

---

# బాటసారి.

నిశ్శబ్దయామిని నీరవ వీణ
తంతులఁ గదలించు తరుణీలలామ,
యింత తటాలున నేల నిల్పితివి
రమ్యమూర్ఛన లీను రాగంబు లెత్తి?
యానందమదిర పొంగారు పాత్రంబుఁ
బెదవులకంటించి పెఱికివైచితివి.
ఆ క్షణంబానిన యనుభూతివలన
హృదయంబు పిచ్చెత్తి యెగురు నెందెందొ!
యర్ధరాత్రం బాయె; నంధకారంబు
దిక్కుల వ్యాపించెఁ; జుక్కల గములు
మబ్బుచాటునదాఁగి మాయమైపోయె;
జల్లుజల్లున వాన జడివెట్టి కురిసె;
బాటసారిని, వన్యపథమందుఁ జిక్కి
దిక్కుదోఁపక యొంటి దిమ్మరువాఁడ;
ఆరుపఁబోకు గవాక్షంబునందుఁ
గాంతిల్లు దివ్య సుగంధదీపంబుఁ;
దలుపుదీయుము దీర్ఘ దైనిక శ్రమము
స్వప్న శీత స్పర్శ సమసి సుఖింపఁ,
గాంత, యొక్కింత నేఁ గన్నుమోడ్చెదను.

# మర్త్యకవి.

---

అనవరతంబు నీ వంతఃప్రపంచ
గంభీర నిర్మల గగనంబునందు
నెగిరిపోయెద వోయి, యెటులఁబట్టినను
ఓ మర్త్యకవిమౌళి, యూహ వంచించి
యేకాననంబున, నే మూలయఁదో,
యేపూవుఁబొదరింట నేయాకు సందో,
వినరాక కనరాక వికసించి తావి
యూర్చెడు క్రొంబువ్వు నోజ నెయ్యెడనో
వసియించెదవుగాని, వన కుటీరమున
నీ యపూర్వపు సృష్టి నీలాంబరమున
రతనాల విల్లునా రమ్యమైతోఁచు.
అప్సరోవీణల యం దుద్భవించు
రాగంపుగములు స్వర్గద్వారమునకు
హృదయంబుఁ గొంపోవు రీతి, నీకావ్య
పుష్పకంపు రసార్ద్రి పులకితాత్మలను
జీవన యాథార్థ్య సీమలం దుండి
కొనిపోవు నందన వన గంధవహము
వీతెంచుకల్పనా శీత నగంపుఁ

గడపటిశృంగంబు కడకొక్క త్రుటిని.
చంద్రకిరణంబుల జనియించినట్టి
యా స్వప్నలోకంపు టచ్చఱబోంట్లు
పటికంపుఁబాత్రల పైయంచు పొరల
ద్రాక్షాసవముఁ దెచ్చి దగ్గఱఁ జేరి
యందీయఁ దమిదీఱ నాని, మత్తెక్కి
యఱగన్ను మోడిచి, యన్నికష్టముల
మఱచి సుఖింతు నీమహిమంబు వలన.
మిన్ను పైఁబడినను మేలుకొల్పకుము;
ఆనంద రసవార్ధి యందీఁదనిమ్ము.
కవికులాభరణ, నీకావ్యమాధురికి
వినిమయంబుగ నీకు విశ్వంబునందు
నేమియుఁ గన్పట్ట దీఁడైనయటుల!
ప్రార్థనాంజలి పుటి బాష్పముత్యముల
యుపహార మిచ్చి నేనొక్క వందనము
నర్పించుచున్నాఁడ నందికోవయ్య.

30-5-1922

---

# రాధాకృష్ణులు.

---

## రాధ

ఏమోయిశ్రీకృష్ణ, యింతప్రొద్దాయెఁ
గనులకు నీరూపు కఱవాయెనేమొ!
సంజరంగులలోన సమసె గోధూళి;
వేణుసంగీతంబు వినువీధి ముట్టెఁ;
కాళింది మడుగులోఁ గలఁ బూచియున్న
కలువపూనెత్తావి గాడ్పులు విసరె;
ఆమనితోఁటకు నతిథియౌ పికము
ప్రేమప్రవాహంబు వెలికుబ్బి పాఱ
హృదయ తటాకంపుఁ దుదితూముఁ దెఱచె;
నీయందు లీనమై, నినుఁగాంచు వేడ్క-
నాతురపడు మతి నాఁపంగలేక
వాకిట నిలుచుండి వనవీథి నెపుడుఁ;
గనికని నాకన్నుఁగవ నీరుగ్రమ్మె.
ఇంతకక్కస మేల? యింత కసియేల?
చంపనెంచిన నింత చాటుఁదనమేల?
నీ నవ్వు విన్నంత నిన్ను గన్నంత
వచ్చె నాప్రియుఁడంచు భావింతుఁగాని,

యవ్వల స్మృతిదక్క నంతయు నిందఱి
జాల మల్లెడకో జాజిపో యెదవు!
నిన్ను నమ్మినదాని, నిన్వలచుదాని,
నీపదంబులఁ జిత్త నీకేజ కళిక
నిడు తపస్విని జీవ నేంద్రచాపంబు
ఖండించెదేమోయి, కఠినహృదయుండ!

### కృష్ణుఁడు

ఓముద్దరాల, నన్నూరక యేల
కానిమాటలు పల్కి కటకటించెదవు?
యమున గట్టులనుండి యాల మరలించి
వచ్చితి నిప్పుడే వనసీమదాఁటి;
కావి దుమారంబు గ్రమ్మిన చేల
మైనఁ దీలేదింక నరయు మోచెలియ.
నిష్కారణపు శంక నిందింపఁ దగదు,
తథ్యమారసి నన్ను దండింపరాదె?
లావణ్యసరసిలో లాస్యంబు లాడు
నీమోముదమ్మి యే నిమిషంబెకాని
చూడకుండిన నాకు శూన్యమా జగము.
మున్నటి వలపులు, ముద్దుముచ్చటలు
మఱచి యిట్లాడెదో మతిలేనిదాన!

రాధ

ఔగాని, శ్రీకృష్ణ, యీ మాయవలపు
బయలయ్యె, నింతగా వర్ణింపనేల?
వలిపపు వలెవాటుపైఁ బసపుగుర్తు
లతికినట్టుల నేల యయ్యెనో చెపుమ?

కృష్ణుఁడు

మోదుగాకులుగోయ ముదిమోక లెక్కఁ
బువ్వుల రసమంటి పుట్ట మిట్లాయె.

రాధ

తాఁకినఁ గందెడు తనువుపై నేల
గోటిగిచ్చులుఁ బడ్డ గుర్తు లగుపట్టు?

కృష్ణుఁడు

ఇందుకే శంకించితే! పువ్వుఁబోఁడి,
కోరిందపొదలోనఁ గోడెమా డేఁగ
వెన్నంటి పోయెడి వేళఁ గంటకము
లంటి గీతలుపడె, ననుమానమేల?

రాధ

చివురుటాకులువోని చెక్కిళ్ళసొబగు
కలఁగిన రుచి దోఁచు కారణంబేమి?

కృష్ణుఁడు

మావిగున్నల నీడ మధ్యాహ్నవేళ
నలసి నిద్రించెడు నప్పుడు గటిక
యొరయిక నొక్కింత యొత్తిగిలె నేమొ.

రాధ

అందాల కందమా యధరబింబమునఁ
గాటుక మరకలు గనుపట్ట నేల?

కృష్ణుఁడు

నీకన్నులకు సాటి నిలిచి వలపింప
ముదముతోఁ గల్వల ముద్దిడికొంటి;
ఆ రంగు పెదవుల కంటెనో యేమొ!
ఏ నొక్కతప్పిదం బెఱుఁగ నోసకియ.

10-5-1922

---

# వాల్మీకి.

వాల్మీకి కవిచక్రవర్తి, నీవెవరు?
సరస కవితాలతా శాఖలందుండి
యామనికోయిల యట్లు కూసెదవు?
ఏచోటఁ బుట్టితి వేడ పెరిగితివి?
యేతల్లి చనుఁబాల నింత మహిమంబుఁ
గాంచితో చెప్పుమ కవిసార్వభౌమ;
నింగిని భేదించు నీమహాసృష్టి
యెదుట నీచారిత్ర మెం దడఁగిపోయె?
గంగానదీ శీతగర్భంబునందు
నిదురించుచున్నదా నీచరిత్రంబు?
అభ్రంకష హిమాచలాంతర కటక
గంభీర గహ్వరాగాధ శూన్యమున
మాఱుమ్రోసెడు నె నీమహనీయ వాణి?
ఓ యాదికవిరాజ, యోదివ్యవాగ్మి,
యెన్ని యేండ్లునుబూండ్లు నేఁగెనో కాని,
మున్ను హిమాలయ మోహనాటవుల
నీవుమీటిన కావ్య నిర్ణిద్రవీణ
నేఁటికి వినఁబడు నిఖిలదేశముల!
భావ కిరణంబులు పడుగుపేకలుగ

నీ వల్లినట్టి రమణీయదృశ్యంబు
బంగారుస్వప్నంబు ప్రజలనెల్లపుడు
నానంద రసవార్ధియందుఁ దేలించు.
నీచేయి సోఁకిన నిమిషంబునందె
బంకమన్నైన రూపముఁదాల్చి నిలుచు!
ఈ యింద్రజాలంబు నేడ నేర్చితివి?
యీశిల్పనైపుణి యెట్టు లలవడియె?
ప్రకృతిభాండారంపు ద్వారంబు దెఱచి
గుప్తరత్నంబులఁ గొల్లగొట్టితివి!
ఆకాశమునఁగల యన్ని తారకలు
కడలి గర్భమునందుఁ గల జీవమణులు
సరితూఁగలేవు నీ సౌభాగ్యమునకు!
భావవారిధిఁ బూల పడవ నడిపించి,
ముత్యాల రేవులో మునిఁగి యడుగంటి,
పలురంగు మణులను వలలీడ్చి తెచ్చి,
నవ్యమా కావ్యమండన మొనర్చి
విశ్వసాహిత్యంబు వెలిఁగించినావు!
కవితా నభో రవీ, కవిచంద్రులెల్ల
నీకాంతిపూరంబు నిండారఁ ద్రావి
తమ కళ పెంపొంద దైవాఱుచుంద్రు.
నీ మనోవల్లకీ నినదంబుఁ గాంచ

సాధ్యంబుగామి నాశారద వీణ
నేమూలవైచెనో యెఱుఁగంగరాదు.
నీసృష్టికెదురుగా నిలిచి నిట్టూర్చి
తమ్మిచూలియునైనఁ దలవంప వలయు.
పుట్టించితివి పో యపూర్వమూర్తులను
హైందవ సామాజి కాదర్శములను;
రామాయణము నీదు రమణీయ భావ
నందన వనిఁ బాఱు నవ్యనిర్ఝరము;
హైందవసంఘ మీ యమృతంపుటూటఁ
దరతరంబులనుండి తనిఁదీఱ నాని
నవజీవనపు శక్తి, నవధర్మరక్తిఁ
గాంచి లౌకికయాత్ర గడిపెడి నహహా!
జాతీయకవి, నమస్కారశతంబు
లర్పించి నీచరణాబ్జ రేణువులఁ
దలఁదాల్చితినిఁ; జంద్ర తారకా భరిత
నీల గగనముక్రింద నిలుచున్నయపుడు
మనుజుని యల్పత మఱిఁద్రోఁచునటుల
నీ ప్రతిభావాహినికి మునునిల్చి
నా కవిగర్వంబు, నాభావశక్తి
దుమ్ముదుమారమై తూలిపోయెడిని.

24-5-1922

# కవి: సన్న్యాసి

[అస్తమయము: సముద్రతీరము. ఒకసన్న్యాసి యింద్రధనువు రంగులు గల గుల్లలను జోడినిండ సేరికొని, సముద్రతరంగములు పాదముల నభిషేకించునట్లు తీరమునఁగూర్చుండి, గుల్లపడవలను దేలించుచుండును. ఇంతలో నొక దివ్యపురుషుఁడు వేణువును మ్రోయించుచు నాకసమునుండి యచ్చోటికి దిగును.]

సన్న్యాసి
(స్వగతము)

సాంధ్యవర్ణాంకిత జలధరదూత
యనఁగ నెవ్వండీతఁ డంబరమునుండి
తీరసైకతమున దిగుచున్నవాఁడు!

(ప్రకాశముగ)

ఎవ్వండవోయి, నీ విద్వేళయందు
ఱెక్కలుపుట్టి చరించెదు నింద్ర
జాలంపు మురళివై స్వర్గంబునుండి
యవతరించెదవు మానవలోకమునకు?

కవి

సన్న్యాసితిలక, నే స్వప్నపురవాసి
శిల్పినిగాని,—నీచేష్టలు గాంచ
నుబుసుపోకకు వచ్చి యుదధి వీచికల
గుల్ల పడవలు తేల్చి క్రుంగంగ నవియుఁ
గన్నీరు నించినగతిఁ గానిపించు.

## స న్న్యా సి

స్వప్న పురవాసి, నే జాలరిభంగిఁ
గడలిమధ్యంబునఁ బడవ నడిపించి
మంచిముత్యంబుల మణుల గడింపఁ
బలుమాఱు వలలీడ్వ వత్తునేగాని,
చటుల ఝంఝూవాత సంక్షుబ్ధ వార్ధి
కల్లోలములఁజిక్కి కడగానలేక
పడవ తుత్తునియలై పగులునో యంచు
నూహించి, భయపడి యొడ్డుకు నెట్టి,
శూన్యభావంబున శుక్తిపోతములఁ
దీర వీచులయందుఁ దేలించుకొనుచుఁ
గాలంబుఁ గడపెదఁ గపటసంతృప్తి.
ఔ గాని, నీవేమి యాచరించెదవు?
వేణువాదనమె నీవృత్తియా యేమి?

## క వి

అంబర చరులైన యధ్వగుల కొఱకు
విశ్వంబునంగల వివిధ నక్షత్ర
గణముల నొండొంటిఁ గలుప రత్నాల
వింటి వంతెనలు కల్పింతు రమ్యముగఁ;
గడలిఁదచ్చిన గాథకావ్యంబు లల్లి

యున్న త్తవీచుల యుద్ఘోషలెల్ల
నిశ్శబ్ద రజనీ వినీలగర్భమున
శ్రావ్యమౌ యప్సరస్సంగీత మటుల
నొనరింప వేణువు నూదుచుండెదను.

సన్న్యాసి

ఓమంత్రకాఁడ, నీవేమేమొ నుడివి
మోసగించెదవు సమ్మోహంబుఁగొలిపి.
ఒకచేత నమృత మింకొకచేత విషము
నాను మాను మటంచు నందియిచ్చెదవు!

కవి

అదియె జీవనరహస్యంబు సన్న్యాసి,
చేఁదుఁతీపులు రెండుఁ జేరియే యుండు,
నొకటి యుండినచోట నుండు రెండవది.
పడవ వ్రీలునటంచు భయపడెదవేని
జలధి దున్నెడు కోర్కెఁ దలపోయఁబోకు.
అలల రాపిళ్ళకు నాగలేవేని
ముత్యాలపై నాస పుట్టంగనేల?
పన్నీరుపువ్వును బడయ నెంచినను
ముల్లు దాఁకునటంచు నల్లాటమేమి?
నీ నీడ నెడఁబాయు నిఖిల యత్నములు
వ్యర్థమౌనని వేఱ వచియింప వలెనె?

## సన్న్యాసి

అల్లైన నోశిల్పి, యల్లవిగో గనుము!
భగ్నమై పడియున్న పడవచెక్కలను
యాత్రకు యోగ్యమానటుల జోడించి
తెరచాపలం గట్టి తెడ్ల నందిమ్ము.

9-6-1922

---

# మాతృమందిరము.

[మాతృమందిర సందర్శన తత్పరులైన కొందఱు యాత్రికులు, కొండ నెత్తమున నొకనాఁటి రేయి గడపి, ప్రొద్దుపొడుపున మేల్కాందురు. కనుచూపుదూరమున వారికి మాతృమందిరము కనుపట్టును.]

మొదటి యాత్రికుఁడు

అవనీధరంబుపై ననిల డోలికల
నల్లనల్లన నూఁగు నంబుదార్భకులు
బంగారుకలలలోఁ బడి చిక్కుకొనిరి.
మంచుముత్తెపుఁ దెరలు చించి తొలఁగించి
పడకింటి కిటికీని బాగుగాఁ దెరచి
నవ వధూతిలకంబు నాఁ దొంగిచూచు
దిన రమామణి తూర్పు తీరంబు నందు.

రెండవ యాత్రికుఁడు

విరిసెడి క్రొంబూల వింత నెత్తావి,
చుట్టుపట్టుల నున్న సొగసైన గిరులు,
కర్ణపేయంబైన ఖగపాళి రుతము,
ఆనందజనకమై యలరు నిచ్చోట!

మూడవ యాత్రికుఁడు

మాతృమందిరమున మంగళధ్వనులు,
బంగారు గంటలు పలికించు రవము,
శంఖ నినాదంబు, సామగానంబు
నాలకింపుఁడు! కాలహరణంబు తగదు.

నాల్గవ యాత్రికుఁడు

అమలసౌరభ మీను నగరు ధూపంబు
కర్పూరఖండంబు గనిపించు త్యాగ
మాత్మలో వెలిఁగించు నమృతదీపంబు!

ఐదవ యాత్రికుఁడు

అల్లదే! సోదర యాత్రికులార,
పర్వతశిఖరంబుపై మాతృమంది
రంబు సూర్యాంశుల రమణీయమగుచు
మణిమయ మకుటంబు మాదిరిఁ దోఁచు;
పూజసల్పఁగ ఫల పుష్ప చయంబు
దోసిళ్ళఁ గొని తెచ్చి త్రోవపట్టుదము.
మందిర మార్గంబు మహితవృక్షముల
నీడలఁ జల్లగా నిదురించుచుండు.

పలువన్నెమణులను బఱచిన పోల్కి
రాలిన పువ్వుల రాజిల్లు నేల
సూర్యతాపంబున స్రుక్కక యున్న
మాతృసాన్నిధ్యంబు మనము చేరుదము.

ఆ కా శ వా ణి

నిలుఁడోయి, నిలుఁడోయి, నిశ్చింతులార,
సత్యమెఱుఁగరు బాల్య చాపల్యమునను;
సరణి యెల్లను బుష్పసంకీర్ణ మనుచుఁ
జల్లనీడలఁ బోవు సమతలం బనుచు
భావించెదరుగాని పరిచితిలేమి,
నిదియె యాత్రికులఁ బరీక్షించు పథము!
మెఱసెడి నదియెల్ల మేలిమిగాదు;
బాహ్యచిహ్నంబుల భక్తుఁడు గాఁడు;
ఎందఱెందఱో యాత్రి కేఁగుదెంచెదరు
విజయ మొందెడివాఁడు వేయింటి కొకఁడు,
అధమ లోహములెల్ల నగ్నిపుటాన
నంతరించును నొక్క యపరంజి దక్క.
దుర్బలచిత్తులు, దుష్ట చేష్టితులు,
కార్యశూన్యులు, మోసగాండ్రును, జడులు
మార్గమధ్యమునుండి మరలెదరు గాని,

తిలకింపలేరు మందిర పుణ్యభూమి.
ధర్మజీవనుల పాదస్పర్శచేత
ననుదిన పావనంబైన దీ పథము!
ఆత్మసమర్పకులౌ వీరవరుల
యస్థులచేఁ బూతమైనదీ పథము!
త్యాగవ్రతుల శోణిత ప్రవాహమునఁ
గడుగంగఁబడిన దీ కఠినంపుఁ బథము!
దీని తత్త్వంబును దెలిసికోలేక
యాటపట్టని యెంచి యరుదెంచినారె?
భోగలాలసులార, పొండు మీపురికి.

[ఇంతలో దారిప్రక్కనఁ బడియున్న యొక పునుక యాత్రికులను జూచి, కలకలనవ్వి, యిటులఁ జెప్పసాగను:]

పు ను క

ఏండ్లు పూండ్లాయె మేమిచ్చోట నొరగి,
దుమ్ము దుమారంబు తొఱ్ఱల నిండి
పుట్టగొడుగులు పచ్చపూరియు మొలిచె;
మాయెమ్ము లెచ్చోట మట్టిలోఁ జివుకు
నచ్చోటఁ దీవియ లల్లి పుష్పించు;
ఆ సుమ మకరంద మానిన నరుఁడు
పరమ విజ్ఞానియై పరిఢవిల్లెడిని.

జననమొందిన యప్డె చావు నిశ్చితము,
మాతృదేవీ బలిమంటప మందు
యజ్ఞ పశువుగ నిల్చు నంతటి భాగ్య
మెవనికి సిద్ధించు నిందఱిలోన,
నా మహాపురుషుని యఃఅకాలి దుస్మృ
ప్రిజల శిరం బెక్కి భవ్యంబు సేయు;
ఆతని కన్నుల యం దుద్భవించు
బాష్ప బిందులు దేవభాండారములను
వెలలేని ముత్యాల విధమున నుండు.
ఆ యశస్వి చిర నామాక్షరపంక్తి
యప్సరో గేయమై యలరారుచుండు;
ఆ ధీరు క్రొన్నెత్తు రన్నిదిక్కులను
విజయాంకములు వ్రాసి వ్రేలాడఁగట్టు.
యాత్రికులార, మీయందఱిలోన
నట్టి వీరుండున్న నడుగు పెట్టుండు.

[యాత్రికు లొకరిమొగ మొకరు చూచుకొని దిగాలుపడుదురు; కొందఱు తలకొక్క దారిపట్టుదురు; మఱికొందఱు వేషధారులు నోటఁ దడిలేక వెనుకంజవేయుదురు; ఇంకఁ గొందఱు దుర్బలహృదయులు అందఱికన్న ముందుగ వెనుకకు మరలుటకు యత్నించి గిరిసానువునుండి కూలఁబడుదురు. కాని, యొక్క యువకుఁడు మాత్రము, సజల నయనుండును, పులకిత శరీరుండును, పుష్పాంజలి బద్ధుండునై నిలుచుండి పునుక కిట్లు విన్నవించును:]

## కడపటి యాత్రికుడు

ఆటపట్టగు నాకు నఖిల విశ్వంబు,
విశ్రామభూములై వెలయు గ్రహంబు,
లంగంబు చెండుగా నాటాడుచుందు!
విత్తు నశింపంగ వెలువడుఁ జెట్టు;
వత్తి కాలకయున్న వఱలునే కాంతి?
యభ్యుదయ హేతువై యలరుఁ ద్యాగంబు;
అట్టిత్యాగము నాకు నాదర్శకంబు!
బాధలే నా కాప్త బంధువర్గంబు;
బీదతనంబె నాప్రియమైన హక్కు;
లోకహితంబు నాలోచించు పనియె
కఠినంపు విధి; దైవఘటితంబు నదియు.
స్వాతంత్ర్య రథ మెక్కి సంసిద్ధుఁడనుగ
మనుకొంటి; గుఱ్ఱాలఁ బూనింతు నిపుడె.
విజయాపజయములు విధిమూలకములు;
యత్నంబె మనచేత నైన కార్యంబు.
మాతృపాదంబులం బడు భాగ్యమున్న
గిరులైన నన్నడ్డగింపఁ దరంబె?
మార్గ మధ్యంబున మడసితి నేని
మీవలె నెమ్ములు మేదిని వైచి

నక్షత్రములలోన నటియించు చుందు.

పునుక

ఓయి కుమార, నీయుత్త మాశయము
వెలిపుచ్చితివి త్యాగవీరుండ వీవు!
మాతృమందిర బలిమంటప వేది
నాత్మకర్పూరంబు నంటింప వోయి.

ఆకాశవాణి

పూజారి వాఁడుగో! పువ్వుఁబుత్తులను
దెచ్చి ద్వారముకడఁ దిలకించు వాఁడు.
కాల మమూల్యంబు కదలు కుమార,
కాలిగుర్తు లనంతకాల సికతములఁ
బూర్వవీరుల పోల్కి ముద్రించి పొమ్ము!

5-10-1922

---

# హృదయాభిలాష.

శ్రీగోపపాల, యాశ్రితభక్త జాల,
దివ్య వేణువినోది, దీన శరణ్య,
నలినాక్ష, నాజీవనంపుఁ బాత్రమున
నీ గానసారంబు నిండింపుమయ్య.
ఆనందమున నందు నంగంబుగరఁగి
గీతారస స్రుతి రీతి ననంత
కాలసాగరమునఁ గలసి పోయెదను.
విశ్వ కావ్య కవీశ, వేదాంతవేద్య,
విజ్ఞాన మయమైన విస్ఫులింగమున
నంటింపు నాహృదయంపుఁ గర్పూరము.
నిరతంబు నీపాద నీరేజపీఠి
నెత్తావిఁ జల్లుచు నేను వెల్గెదను.
ఓ జగజ్జ్యోతి, నీ యుజ్జ్వలశోభ
నా మనో నేత్రంబునకుఁ దోఁపనిమ్మా,
కన్నులఁ బ్రమదాశ్రు కణములు దొరఁగి
పూజకుఁ బువ్వులై పొసరునో దేవ!

7-10-1922

# భవిష్యద్దర్శనము.

---

సందెముత్తైదువ, సరిగవలిపంబు
వరివెన్ను పావలు పట్టిలాగంగ
వాత్సల్యమునఁ బైకి వంగెనో యనఁగఁ
జెంగావి నిగ్గులు చేలపై నలమె.
ఈ రామణీయక మీక్షించి యుంటఁ
గాలునిలువక యూరి కిడపటనున్న
పొలమున విహరింపఁ బోతి నొంటరిగ.
తిన్నతిన్నగ వీచు తెమ్మెరల వలన
వెన్నులు బంగారు వీచులై రేఁగె!
కాంతియు గానంబుఁ గలసి యనూహ్య
మగు నింద్రియవిషయమై కానిపించె.
అచ్చోట నానంద మనుభవించుచును
నొక్కింత కూర్చుండియుంటి నిశ్చలత.
అంతలోఁ గెంజాయ లంతరింపంగఁ
గప్పెను బ్రకృతి నక్షత్ర సంఖచిత
కోమల తిమి రావగుంఠ నాంబరము;
గాలి వీచుటమానెఁ, గదల వాకులును;
అమ్మ పేరెదనాడి యలసి కనుమోడ్చు
పసికూనలటు సరోవర మధ్యమందు

నిశ్చలశాంతిమై నిదురించు నలలు;
గాంభీర్యమును దాల్చె గగనతలంబు;
సగము జాగ్రదవస్థ సగము స్వప్నమున
భావించుచును గట్టుపైన గూర్చుంటి.
సత్యమో, భ్రాంతియో, స్వప్నంబొగాని,
యింద్రజాలము వోలె నెదుటఁగన్పట్టె.
అది సత్యమైయున్న నాశ్చర్యకరము!
అది కలయేయైన నానందమయము!

* * *

మావితోఁటను బర్ణమంటపమందు
జనరంజకంబైన సభ యొండు జరిగె.
మొగలిరేకులు తమ్మి పూఁదోరణంబు
లందంబు నెత్తావి నర్పించుచుండె.
రారాజు కొంబచ్చ టా గద్దె డిగ్గి
యందఱితోఁ బాటె యవనిఁ గూర్చుండెఁ;
బనిపాటు లేనట్టి బంటుసిపాయి
త్రుప్పుపట్టినకత్తి తొంటిపై రాయఁ
దనపూర్వ జయములఁ దలపోయుచుండె;
బురదచిట్టలు షడ్డ పుట్టములఁ గాఁపు
వర్తించె నృపపరివారంబుఁ గలసి;
కూలినాలి యొనర్చి కుడుచు నిరుపేద

యజమాని సరిబంతి నాసీనుఁడయ్యె.
సకల మానవజాతి సంతతులు కుల
వర్ణ భేదంబులఁ బాటింపఁ బోక
యొక్కకడుపునఁ బుట్టి యొకచన్నుఁబాలు
ద్రావినరీతి సౌదర్యంబు గలిగి
యన్యోన్య సాహాయ్య మర్థించువారు.
స్ఫటికపాత్రంబున శాంత్యాసవంబు
ధర్మదేవత తెచ్చి తనిపె నందఱిని;
ఏక కుటుంబమై యీప్రపంచంబు
స్వర్గంబు భూమిపై స్థాపింపఁ బడియె.
అభ్యుదయాంశువు లన్నిమూలలను
నవనవోజ్జ్వల జీవనంపు దీపముల
వెలిఁగించుచుండె; నీ విశ్వమంతయును
మానవకళ్యాణ మందిరం బయ్యె.
అంతలో లౌకిక యాథార్థ్యములను
భావంబు వ్రాలెను బక్షివిధాన;
బొగ్గుకంబము లట్లు పొడకట్టుచుండెఁ
దత్ప్రాంతముల నున్న తాళవృక్షములు!
చిమ్మచీఁకటి నోంటిఁ జిక్కుకొనియుంటె.

7-10-1922

---

# సమరతృష్ణ

---

సంగరతృష్ణచే స్వాంతంబు రగులఁ
బటు దురాశావేశ పారవశ్యమున
నధికారదాసులై యవనిఁ బీడించు
మనుజ సంతతులార, కనికరము లేక
బలహీన జాతులఁ బట్టిచంపెదరు.
దేహంబు నలుపైనఁ దెలుపు పసుపైన
నాత్మబంధులుగారె యఖిలజనంబు?
కామంబు, క్రోధంబు, గర్వంబు, జాతి,
దేశంబు, భాషయున్ దెరలు చింపంగ
సర్వసామాన్యమై చను మానవత్వ
మొక్కటీరుసఁ గాక యున్న వేర్వేఱ?
మానవరక్త సంభార విక్రియము
గావించు నక్రైస్తు ఘాతుకులార,
విజయ మదిరాపాన వీతచిత్తమున
నేల పావనమూర్తి నేసు మహాత్ము
మఱియొకమాఱు కర్మాగారపంక్తి
చిమినీలపైకెక్కి సిలువ వేసెదరు?

నిస్సహాయయు, దాస్య నిగళబద్ధయును
నగు సమాయికజాతి యస్థిపునాదిఁ
గనకమందిరములఁ గట్టుచున్నారె?
యూలపోయెడివారి యుడుకు నిట్టూర్పు
విసరదే మీచితి వేఁడిమంటలను?
సొంత యక్కఱకన్న నెంతో యెక్కుడుగ
వస్తుల నిర్మించి వాని వెలపుచ్చ
జనసంఘముల బానిసలుగఁ జేయుదురె?
ఇట్టి యన్యాయ్య మింకెంతకాలంబు
అవును గాదనకుండ రవులుకొనఁ గలదు?
ఐశ్వర్యవంతుల యఱచేతి ఫలమ,
కష్టజీవుల పాలి కంఠపాశంబ,
ఓ నాగరకత, నీయున్నతాదర్శ
మిదియె యైయుండిన నింకఁ జాల్చాలు!
మానవ హృదయమ్ము మంటవెట్టకుము.
చీఁకట్లుపెనుగాలిఁ జిమ్ము ఱెక్కలను
భూమిపై పైఁగప్పి పొడుగంగఁబోకు
కాలకూట జ్వాల గ్రక్కు సర్పముల
వాణిజ్య దేవతా, వాయుసామ్రాజ్య
మందుఁ జరించు మాయల మంత్రకత్తె,
అతిదురాశా తృషఁ బతితులౌ జనుల

బంగారు పావలకుఁ బట్టి బంధించి
కొండలం గానలఁ గోనల గుహల
మింటను మంటను వెంటఁ జీడాడ
నీడ్చికోఁ బోయెద వేమి నీ మహిమ?
నీపాదచిహ్నాల రాపాడి వచ్చు
సంగర పశుశక్తి చచ్చి చావకయ
యాత్మకృతాపరా ధాంకమై నిలిచి
బహుళ పశ్చాత్తప్త బాష్పపూరములఁ
దన మనోవికృతుల దాహంబుఁ దీర్చు.
శాంతి నానాజాతి సమితి చేకూర్పఁ
జాలునే చిత్తముల సలసలం గ్రాగు
పాషాణ రసములు పైకిఁ బొంగంగ?
సమర పరాజిత శత్రువర్గముల
కొల్ల ద్రవ్యము పంచుకొనువేడ్కఁ బెద్ద
భాగంబులకుఁ బోరు 'పరమ సౌహార్ద
చక్రవర్తుల' కేల శాంతిపీడనము?
ఖండాంతరంబుల కపటనాటకము,
కాలమెప్పటికైనఁ గనికరము లేక
నీముసుంగును జీల్చి నిజమూర్తిఁ జూపు.
భావి సంగర ముష్టిఁ బట్టుపడనీక
జగతినిఁ గాపాడ సకలదేశముల

కవిమహాశయు లొక్క కట్టుగావలయు.
ఇదియె నాస్వప్నంబు; నిదియె నాయాశ.
కలయు నిక్కంబగు కాలంబురాదె?
ఓ కవివరులార, యో జగదేక
శాంతి దాయకులార, సర్వజనీన
సేవా సమాసక్త చిత్తాబ్జులార,
అల్లదే! దర్శించుఁ డవతరించెడిని
ఆధ్యాత్మిక యుగంబు! నానాండమఖము!
జ్ఞానహోమాగ్ని మీ కరదీపికలను
వెలిఁగించి, జెండాలు వినువీథి నెగుర
నఖిల మానవ హృదయధ్వంసి కీట
కములకుఁ దల్లియౌ కటిక దురాశ
సమయింప సంగ్రామ సన్నద్ధులగుఁడు.
నిభృత శాంత కుటీర నీడములనుండి
కవికోకిలములార, గగనంబు గనుఁడు.
ఎంతవిశాలమై యెంత గాంభీర్య
రామణీయకముల రాజిల్లునదియొ!
లేలెండు తటి యుదే లెండు సఖులార!

25-10-1922

---

## * మేలుకొలుపు.

---

మేలుకో భారతకుమారా,
మేలుకోరా తరుణధీరా,
మేలుకో!

కష్టనిర్భర దాస్యమట్టులఁ
గాఱుచీఁకటి సడలిపోయెను,
భావి భవితవ్యాపమును జాటఁగ
వాఁడుగో! శుక్రుఁడు రహించెను,
మేలుకో!

మంగళ ధ్వనులటుల పక్షులు
మంజులా లాపములు సల్పెను,
మాతృభూమి జయాంకమై రవి
మండలం బుదయించెఁ దూర్పున,
మేలుకో!

మేలుకో భారతకుమారా,
మేలుకోరా తరుణధీరా,
మేలుకో!

30-10-1922

---

# వానకాలపు వరిచేలు.

క్రొక్కాఱు మబ్బులు గుంపులుగూడి
యాకసంబునఁ దేలు నట్టి తరుణమునఁ
బసినాఁటి యానంద రసము పొంగంగఁ
బలుమాఱుఁ గాంచితిఁ బచ్చవరిచేలు!
వానముత్తెసరాల వల ముసుఁగుఁ దాల్చి
దినలక్ష్మి కోమల దీధితులు చిల్కె;
జల్లులం దడిసిన సస్యపుంజంబు
దుమ్ము కప్పుదొఱంగి తొలకాడెఁ గాంతి;
గాలిలోఁ దడిపచ్చికల తావి విరిసె.
పొగవన్నె మబ్బుపై నెగిరెడి కొంగ
బారు భౌతికరూప బంధంబు లెడపి
పుణ్యలోకముఁ జేరు ముక్తాత్మ మాల
యన భావవీథిఁ దోఁచెను విచిత్రముగ.
వానచినుకులు సేయు గానంబు నేఁడు
అఖిల లీలామనోహరమైన బాల్య
కాలంపు స్వప్నంబుఁ గనులఁగట్టించు;
నింద్రజాలమురీతి నిగురొత్తఁ జేసె
నెన్నఁడో మఱచిన పిన్నతనంపుఁ
బారపొచ్చెములు లేని బుజ్జికోరికెల.

1-11-1922

# హతాశ.

---

అర్ధరాత్రపు వేళ, నంబరవీథిఁ
తారలు వికసించు తరుణంబునందు,
స్వర్ణమయంబైన స్వప్నమోహమున
మానవలోకంబు మగ్నమైనపుడు,
ఒంటిగావచ్చి నా యుటజంబు కడకుఁ
దలుపుఁ దట్టుమటంచుఁ జెలికిఁ జెప్పితిని;
'అల్లపో' యని తలయాడించె సకియు.
రెండుజాములు దాఁటె రెండేండ్ల పగిది,
వేచియుంటిని—మది విసిగి వేసారె;
నింకైన నరుదేర దేమి కారణమొ?
రమణి దగ్గఱలేని రాత్రులయందుఁ
గడతెంపఁ గారాని కాలభారంబు
సీసంపుగోలుసునాఁ జిత్తాంతరమున
వ్రేలెడి నిసి!—యెట్లు వేగింతు నిశను?
ఇంక మాకుఁ బరస్పరేక్షణ ప్రాప్తి
గలుగుట నిజమేని, కన్నీటిబొట్ల
మాలను రచియించి మాయలమారి
చేడియ కర్పించి శిక్షగావింతు.

నా యవివేకంబు నాకుఁ దోఁపింప
నరుణుఁడు తూర్పున నావిర్భవించెఁ;
బాలఁతి రానూవచ్చెఁ బోవనుంబోయె!
పచ్చి లత్తుకపూఁతఁ బైదలి యడుగు
ముద్రిలు వాకిటి ముంగలం దనరె!
సకియ మేలిముసుంగు సందడి వినియుఁ
బవన కంపిత పర్ణరవ మనుకొంటిఁ;
జేరియసి చేతి దీపిక కాంతిఁ గాంచి
యమలతారాశోభ యని భ్రాంతిపడితి;
నెంత ముగ్ధుఁడ నైతి! నెంత పొరపడితి!
అభిశప్త జీవనుండైన నేనేడ?
సకియ కంఠాశ్లేష సౌఖ్యమదియేడ?

3-11-1922

---

# శైశవస్మృతి.

---

శైశవ స్మృతి! యిహ స్వర్గానుభూతి!
వానమబ్బులపై సవారిచేయుచును
వర్షాగమంబున వచ్చితే నీవు!
నవసెడి మనచిన్ననాఁటి నేస్తముల
వానచినుకులు సల్పు గానములగుండఁ
జెవిలోన గుసగుస చెప్పుచున్నావె?
అల్లిబిల్లులు దిరుగ, నాటలాడంగ,
వాఁగులై వీథులఁ బ్రవహించునీటఁ
గాళ్ళడ్డముగఁ బెట్టి కట్టలుగట్టఁ
బ్రతి వానకాలంబు బాల్యంబుఁదాల్ప
నుల్ల మెవ్వేళ నువ్విళ్లూరు చుండు.
ఉల్లాసమున నాడు నోమబ్బులార,
జ్ఞప్తిలేదా మీకు నాముద్దుమొగము?—
మటుమాయలెఱుఁగని మందహాసములఁ
జిందు సుకుమారంపుఁ జిన్నారి మొగము!
భావింపలేరె నా పసినాఁటి కనుల?—
ఆశ్చర్య మిళిత దివ్యానందమునను

మిమ్ముఁ గన్నట్టి యాకమ్మని కనుల!
మఱవరు గద నాదు చిఱుకేలుగవను?—
పొద్దు నిగ్గులు పైడి పూఁత పూయంగ
పరిగపేటు విధాన మెఱయు మీాయంచు
జాలరుం బడయు కోసము చాఁపి చాఁపి
పలువాఱు వేసటపడిన కేల్గవను!
అట్టి శైశవ మిప్పు డలరునే నాకు?
బాల్యంబు గడచె; యావన మంకురించె;
నిరువది యారేండ్లు జరిగె నిప్పటికి.
అంబరచరులార, యంబుదములార,
యే దానధర్మంబు లే జపతపముఁ
బూర్వజన్మంబునఁ బొనరించి నారొ!
యిట్టి నిర్మలవృత్తి, యిట్టి జీవనము,
నెడలేని శైశవం బీపుట్టు వందుఁ
బడసినారలు మీారు పావనాత్ములు!
కాల హాలంబు నా కనుబొమలపైన
నడ్డచాళులు దున్నె; నైన మీారేమొ
పసినాఁటి చిన్నారి ప్రాయంబు విడక
యనుదిన నవ్యులై యలరుచుండెదరు!
మిన్ననఁ జరియించు మిమ్ముఁ గన్నపుడు

నా వయస్సు గియస్సు భావింపఁ బోక,
వానచినుకుల నాడ వలతునేగాని,
పరుల యాడికలకు భయపడి, యింటఁ
బట్టి బంధించిన పగిది నుండెదను.

## మే ఘ ము లు

ఓ మిత్రమా, విధి కుమ్మలింపకుము
ఇంట నీవుండిన నేమి, నీయెడఁద
పిన్నటవలె మాదు బిగి కౌఁగిలింత
స్పర్శా సుఖంబును బడయుట లేదె?
కాల దౌర్జన్యంబు కాయమును దక్క-
నీహృదయాం బంట నే యంట లేదు;
ఓయి బాల్యసఖుండ, పోయివచ్చెదము,
మఱల నేడాదికి మనకు దర్శనము.

3-11-1922

---

# అభిసారిక.

మల్లెపూవుల దండ లల్లు సుకుమారి,
పరవశంబైన భావంబున మఱచి
యేల పూఱేకుల నిట్లు చిదిపెదవు?
కడుమెత్తనైన నీ కన్నెమనంబు
నెవ్వాఁడు హరియించె నీ నిశీథమున?
ఈ పూవుఁ బొదరింటి కేఁగెద నంచు
బాసచేసి ప్రియుండు మోసగించెడినో?
యటుగాక, నీ మృదులాంతరంగమును
బీడించువేదన వెలియార్ప నొక్క—
నిర్జన శాంతంబు నిభృతంబునైన
స్థలమునుగోరి ఉచ్చుటకు వచ్చితివో?
ప్రణయ దీపము వెల్గి బాట గాన్పింప
నర్ధరాత్రమునందు నభిసరించితివో?
నీ యంద చందంబు, నీ నీటు గోటు,
నీ ముద్దు మురిపెంబు, నీ విలాసంబు
నెంత వ్యర్థంబాయె నింతిరో నేఁడు!
చెమరించు నీమోము చిన్నెలయందుఁ
బ్రతిఫలించు నగాధ భావఘర్షణము!

భగ్నాశ నీ విటు పరితపింపంగ
నెడలేక తొరఁగిన కడగంటినీటఁ
దడిసె నీవు రచించు దండ, పూఁబోఁడి.
తనచేతఁ దలపోసి తలవంచు కొనఁగఁ
బొఁద్దువోడుపున నీ పువ్వుల మాలఁ
బ్రేమదూతి యనంగఁ బ్రియునకుఁ బంపి
మంచికాలము రాక మది నెంచి కొనుము.

3-12-1922

# గణిక.

దారికోవల క్రేవఁ దనరారు గణిక,
యెంతమెత్తందన! మెంతటి ప్రోది!
యెంతక్రొత్తందన మిగుఁరొత్త నీవు
మున్నగాఁ గురిసిన ముత్యాల జడికి
మురిపాల గుబురువై పెరుగుచున్నావె?
దైవసృష్టిని నీకుఁ దావొండుగలదు;
నేనును నీపైన నెనరూనియుందు.
ఏను నీవైతినో యెవరికిందెలియు
మున్నుగతించిన పుట్టువులందు!
ఈవు నేనౌదువో యెవ రెఱుంగుదురు
రాఁబోవుజన్మాల రాకపోకలకు!
గుసగుస చెప్పెదు, గునిసి యాడెదవు.
నీలోన వెలిఁగెడు నిర్మలజ్యోతి
వెలికొత్తెఁ బోరాట పెట్టుచున్నదియె?
నీ యందచందంబు, నీ సంతసంబు
నందఁ బాల్గొన నాదు డెంద ముప్పొంగు!
పంచవన్నె ముసుంగు వలిపంబుక్రింద
నొకవేళ నిరువుర మొకరమే యేమొ!

---

# దీపనిర్వాణము.

ఏదిక్కుఁ జూచిన నిసుక యెడారి,
నిబిడాంధకారంబు, నిస్సీమ తలము!
జగతి గర్భంబెల్ల చైతన్య రహిత
గంభీరశూన్యమై కనుపట్టుచుండె.
ఒంటిగా నేనొక్క యొంటెపై నెక్కి
యీ బయలు తరింప నేఁగుచున్నాఁడ.
రేయిఁ బాంథునకు దారిని జూపుచుక్క
లాకసంబున నెందు నగపడవేమొ!
ఒంటెపదముల చప్పు డొకటియు, గాలి
నిటూర్పు సడిదప్ప నిశ్శబ్దవీథి
వేఱు సందడి యొండు వీనులఁ బడదు.
హృదయదౌర్బల్యంబు వదలించి నూత
నోత్సాహముం గొల్ప నొక్క కోకిలయు
నమృత తుల్యంబైన యానందగీతిఁ
బాడ దక్కట! నాదు పాప మేమందు?
పలుమాఱు నాచేతి బంగారుదివ్వె
వెలిఁగింతుఁ గాని, కంపిలి యా నిమేష

మండె పయ్యెర నీచి యారిపోయెడిని!
వెలిఁగించి వెలిఁగించి విసిగి వేసారి,
పెను దుపాను కెరళ్ళ గునిసి త్రుళ్ళింత
లాడు చుక్కాని లేనట్టి పోతంబు
తీరున, విధి యీడ్చు తెలుఁగుల నెల్ల
ధూళి గ్రుంగుచు నేఁడు ద్రొక్కుచున్నాఁడ.

3-12-1922

---

# వీణాప్రియ.

---

తంత్రులుదెగిన నా ధ్యానవిపంచి
విశ్వమోహనగీతి వెలికూర్చు నీదు
వీణ తంత్రులువేసి బిగియించి మర్మ
నీరవ మూర్ఛన నెఱపించు శ్రుతికి
మేళగించి, రహస్య కేళీగృహంబు
నకుఁ బంపుఁడని ప్రేమ నాప్రాణపతికిఁ
జెప్పిపంపితి దూతిచే నొకనాఁడు.

ఎన్నియో దినములు నేండ్లును బూండ్లు
గలసిపోయె ననంత కాలశూన్యమున!
హృదయేశుఁడేమొ నా వదనంబుఁ గనఁడు,
వీణయుం బంపఁడు, వినిపింపఁ డెట్టి
వార్తయునైన; నాపాపమెట్టిదియొ!
నా గానగర్వంబు, నా సోయగంబు,
నా భూషణప్రీతి, నా వచోరీతి,
నా యభిమానంబు, నా గౌరవంబు,
నాదు కౌలీనంబు, నా సిగ్గుసెరము
తొలఁగి, మేలిముసుంగు వలిపంబుఁ దిగిచి

యంతఃపురము వీడి యలజడికోర్చి
బిచ్చకత్తె విధానఁ బృథ్వి యెల్లెడల
దుమ్ముదుమారంబు గ్రిమ్మిన చీర
ధరియించి త్రిమ్మరు తరుణంబునందు
నా ప్రాణనాథుండు, నామనోహరుఁడు
వనకుటీరంబున వసియించి నన్ను
'రమ్ము నాకోర్కెలరాణి! రమ్మిటకు
నిపు డర్హవైతివి యీదివ్య వీణ
సారింప రమ్ము నాసరస గూర్చుండి.'
అని తియ్యగాఁబల్కి యానందబాష్ప
ములు కన్నులఁ దొరంగ ముద్దాడె నన్ను.

5-12-1922

---

# * సేవ.

మముఁగన్న భారతమాత మందిరమున
దివ్వెలై మన ముందామా, పైఁడి
దివ్వెలై మన ముందామా.
పరమ పావని తల్లి పాదపూజల వాడు
పువ్వులై మన ముందామా, పొన్న
పువ్వులై మన ముందామా.
భారతిదేవి విపంచిక రవళించు
తంత్రులై మన ముందామా, దివ్య
తంత్రులై మన ముందామా.
జన్మభూమీశౌర్య సౌరభ్యములు చల్లు
గీతలై మన ముందామా, భావ
గీతలై మన ముందామా.
కదనవీరులచేతి ఖడ్గ ధారలలోని
మెఱుపులై మన ముందామా, కారు
మెఱుపులై మనముందామా.

16-2-1923

# * ప్రబోధశంఖము.

---

ఏల తెలియక సంశయించెదవు?
భారతకుమారా,
డీలుపడి వెనుకంజ వేసెదవు?
విన్నదనమున మోము వాల్చెదవు?
దాసోఽహ మంచును
జిన్నతనమునఁ గేలుమోడ్చెదవు?

తెల్లచర్మము నీకు లేదనియో,
బలమైననాడులఁ
జెల్లు నెత్తురు పాఱలేదనియో!
భారతీయుఁడ ననెడి గర్వమునఁ
దలయెత్తి నిక్కి
తేఱిచూడుము సకల లోకమును.

ఎంతకాలము స్వప్నసింహంబు
దడిపించు నిన్ను?
జింతసేయుము తొలఁగు మోహంబు.

ఏలనోయీ గద్గద స్వనము?
ఆక్రోశగానము
చాలుచాలిఁక విఫల యాచనము!

వీరపూజోత్సవపు సమయమునఁ
బూరింపలెమ్ము
ఘోరభీషణ విజయ శంఖమును!
ఏల తెలియక సంశయించెదవు?
భారతకుమారా,
డీలుపడి వెనుకంజ వేసెదవు?

10-3-1923

---

# * రజని.

నిర్మల నీల నభంబునఁ జుక్కలు
నిండె సజీవ వికాసములన్;
మర్మ విపంచిక నీరవ రజనీ
మానిని మీటెను మూర్ఛనలన్.
ప్రాంత కుటీర లతా ద్రుమసౌధము
లస్ఫుటతారా కాంతిన్,
వింతగఁ గరఁగెడివో యన ఛాయా
క్రాంతములై కనుపట్టెన్.
నిశ్చలశాంతిని నిఖిల జగతి సుఖ
నిశ్వాసము వెడలించెన్,
నిశ్చల నిబిడ గభీరానందము
నిండి పొరలె లోకమునన్;
దైనిక కలకల మూర్ఛితభావము
తారా శిశిర స్పర్శన్
మానస గగనమునందు విహంగము
మాదిరి నెగిరెఁ బ్రబుద్ధంబై.
గోకపైని ప్రదీపిక యట్టులఁ
గూర్చుంటిని నే నొంటరిగన్

సారెకు జాగ్రత్స్వప్నము సందుఁ బ్రి
సక్తుఁడనై మఱిమేల్కాంచుఁగ.
అహాహా! నామది విశ్వముతోడ ల
యాన్వితమై నటించుచుఁగ,
అహాహా! విశ్వము నా హృత్పాత్రిక
నాసస రసమున లయమొందుఁగ.

14-3-1923

---

# * అభిసారిక.

---

గాలియడుగుల నెవరికోసరము
ఓ మోహశీలా,
కదలివచ్చితి వీ నిశీథమున?
కాలియందెలు ఘల్లు మనుననియొ
ఓ వలపురాణీ,
కేలఁగైకొని మెల్లనడచెదవు!
పులుఁగు తుటుము తటాన కీచనుచు
అర గూర్కు గూళులఁ
బలుక, వెఱపున దెసలు గాంచెదవు
నిలిచి యేమని యాలకించెదవు?
నీ యడుగుసడికే
యులికిపడి 'యెవర' నుచు మఱలెదవు!
తెల్లవెన్నెల నీ దుకూలంబు,
మైపూఁత నిగ్గులు
తెలియరావని యూహ సల్పెదవు!
నీవు నడచెడి బాటయెల్లెడల
వ్యాపించు గందపుఁ
దావు లెట్టుల గప్పిపుచ్చెదవు?
ఓ ముద్దరాలా,
నీ విహారము బయలు పఱచెదవు. 15-3-1923

# * ఆగంతుకి.

---

చాలు లజ్జా మధుర వినయము!
ఏల యవగుంఠనము వైచెదు
పూలదండలు గట్టియుఁ మెడఁ
గీలుకొల్పక కేలఁ జిదిపెదు
శోభినీ,
యప్సరగకామినీ!

సందెవేళలఁ బూలతేకులు
కిం్రిది కురలఁగఁ గాంచి కాంచి మ
రందబిందులు కన్నుఁ దమ్ములఁ
జిందఁ బొగిలెదు ప్రకృతిచేష్టకు,
కామినీ,
సుందరగామినీ!

పలుకరించినఁ బలుకవేమొ!
పులుకుఁ బులుకునఁ జూచి, చూపుల
వెలువరించెదు లలిత హృదయా
విల కఠోర వ్యసనభారము!
ఏలనే?
మౌనం బేలనే?

ఎపుడు మౌనవ్రతపు టుద్యా
సపు దినంబులు వచ్చుఁ గోమలి,
యెపుడు విరియునో మూకసందే
శపు నిలీన రహస్య భావము;
పోలునే,
చింతన చాలునే!

తేలివచ్చెడి కల విధంబునఁ
గాలియడుగులు సందడింపక
యేల వచ్చితి వీ వసంత వి
నీల గగన చ్ఛాయ నొంటిగఁ?
బలుకవే,
భావముఁ దెలుపవే!

చీఁకటులు బలమయ్యెఁ; జుక్కల
రాక పోకల నేల తలఁచెదు?
నా కుటీరమునందు వెన్నెల
సోఁకి తమము నశింప దీపము
పెట్టవే,
నామది ముట్టవే.

16-3-1923

---

# పిచ్చి బికారి.

---

మాయాకుమారి

ఓయి యాగంతుకా, ఓయి విరాగి,
పాములు వ్రేలాడు పగిది జడివాన
కుమ్మరిల నెడలేక కుండపోఁతలుఁగ,
ఝంఝా మరుత్పక్ష చాలితంబగుచుఁ
బెనఁబడి చెట్లెల్లఁ బెల్లగిలి కూలఁ,
గన్నుపొడిచిన యట్లు కాఱుచీఁకట్లు
నలుగడ వ్యాపింపఁ, బలుమాఱు మెఱుఁగు
తీఁగల వెల్గునఁ దీవ్రతర ఘోర
ఘాతికోన్మత్త దుర్వార ఖేలనము
కనులకు వ్రేఁగయి కనిపింప, నేమి
బిచ్చంబుఁ గోరి యీ వెఱగొలుపు రాత్రి
వచ్చితి వొంటిగాఁ బిచ్చిబికారి?

బికారి

ఓ యైంద్రజాలిక మాయాకుమారి,
ప్రళయ లీలోద్యత ప్రకృతిసంగ్రామ

భూమి సింహాసనంబునఁ గొలువుదీరి
యచల ప్రదీపికయటు వెల్గు నిన్ను
నివ్వేళగాక నే నెవ్వేళఁ గందు?
నీ చేతిభిక్షకై నిఖిలంబు విడచి
కాలవీథిని నొంటిఁ గదలివచ్చితిని.
నీ పాదములకడ నిలిచి వేఁడెదను;
నీ తేనె చిఱునవ్వు నెఱపి 'కొమ్మ'నుచు
బిచ్చంబు పెట్టుము ప్రేమమై రమణి!

మాయాకుమారి

యేమి బిచ్చంబోయి, యీ నిశీథమున?
ఉత్తచేతుల రాణి; నిత్తఱి నీకు
నేమియ్యఁ గలను?

బి కా రి

ఇం కేమికావలయు?
నీ జడకట్టులో నిద్దుర వాడి
నలఁగిన చంపక దళముల మాల
బిచ్చంబు పెట్టుమీ పిచ్చిబికారి
సంతృప్తి నొందును; జాలించు యాత్ర.

20-3-1923.

---

# * బాష్పదౌత్యము.

---

జీవనగంగా హారిత తటంబునఁ
    జింతా వటతరు మూలమునన్,
ఏల యధోముఖివై గడతెంచెద
    వివ్వధి యౌవన నిశలన్?
ఆవలిగట్టున స్వప్న పురంబున
    నవ్యయ నిర్వృతి వనులన్
డోలాఖేలన రతుఁడౌ ప్రియునిఁ గ
    నుంగడు భావన సల్పెదవో?
నీ వయసెల్ల హృదీశుని చింతన
    నిర్మల ధూపము పగిదిన్
గాలెడి నబలా, రేయుం బవళులు
    గంధముఁ జిమ్ముచు నల్గడలన్.
ధావమాన శరదంబున శకలపు
    దౌత్యము నమ్మిటు వేచెదవే?
చాలు నిరీక్షణ! చాలిఁకఁ జింతన!
    చాలు రహస్య వియోగహతుల్!

జీవన సంధ్యా పరిణత బాష్ప స
చేతన నీరవ దూతికలన్
గాల పయోనిధిఁ బర్ణపుటంబులఁ
గదలింపుము ప్రియు కడకున్.
హా! విధివశ్యతఁ జేరుదు రవ్వలి
యంబర చుంబి తటంబున్.
బాలతపస్విని, యెపు డేవేళనో
వల్లభుఁ డొసఁగును దర్శనమున్,
శ్రావణ నీరద మాలిక లిరువురి
శయ్యాడోలికలై యూఁగన్.

22-3-1923

---

# * అతిథి.

---

తెఱచియుంచితిని జీవన మందిరద్వారంబుఁ
దీర్ఘవాసీ, కొను మాతిథేయ సత్కారంబు!
ఓ యాత్రికా, ఓ నక్షత్ర మండల పథికా,
యే యజ్ఞాత సాగర శాంత తట తరువీథి,
నే యానందకూల సమీరణ శిశిరచ్ఛాయ
నేకాకివై తిరిగితివోయి, నిశాముఖవేళ?

ఏ యలౌకిక మార్గ సముత్థిత కాంచనధూళి
నీ జీర్ణ వస్త్రమిటు కావిరిపట్టె బికారి!
ఏ నిగూఢ విపంచీరాగము వింటివోగాని,
ఏ చిన్మయానుభవ స్వప్నముఁ గంటివోగాని,
యిటు విహరించెదు ముక్తపథంబున నతిథీ!

---

26-3-1923

---

# * మోహినీప్రకృతి.

---

జిలిబిలి తియ్యని రాగము లెత్తీ చేసెను గానము సెలయేఱు,
తళతళ వెన్నెల నిగ్గుల నలలుం దాండవమాడెను మైమఱచి;
కలకల కోకిల రవములు రజనీ గాంభీర్యమునకుఁ దోడ్పడియె;
జలజల దేహము పులకించి వ్రేళులు జాఱెను వీణాతంత్రులను.

ఓరె! నా జీవన శుష్కఝరంబు
పాఱెఁ గూలంకష పూర్ణముగ;
జాఱెరా, పరలోక జీర్ణతటంబు
పూరసంఘర్షణ శీర్ణముగ!
పగిలెఁ గమండల పాత్రిక!
చిగిరించె సంసార వల్లిక!
తగదిఁక బైరాగి జీవిక!
జగమెల్ల నందనవాటిక!

27-3-1923

---

# *జీవన ద్వేషి.

---

యామిని

ఏడకయ్యా చిన్నవాఁడా,
కోడెప్రాయపు వన్నెకాఁడా,
యేఁగెదవు నడిరేయి వెలుపడి
వాఁగువఱ్ఱుల దారివంకకు?
ఏలరా?
యీ వింతనడవడి చాలురా!
ఆకసంబునఁ జుక్కదివ్వెలు
చీఁకటులఁ గడు బలుచచేయఁగ
జీవలోకము చల్లనిద్దురఁ
గేవలమ్ము మైమఱచి తేలఁగఁ
దల్పముఁ
విడి తిరుగఁ గారణమేమిరా?
కన్నుబొమ్మలు వంకి సొంపఱి
చిన్నవోయిన చిన్నెలొలికెడి
నెట్టివేదన లెట్టిచింతన
లిట్టితఱిఁ జెలరేఁగె మదిలోఁ?

డెల్పరా?
నా మెద నెత్తురు లొల్కరా.

## జీ వ న ద్వే షి

ఓసి వలపుల రేయిసానీ,
ఓసి కల్వల సిరులరాణీ,
విసిగి వేసరి జీవబంధన
విసరమును దెగఁదెంప వచ్చితిఁ
గానవే,
జే నేఁడు తలంబును జూపవే.

## యా మి ని

ఓయి ప్రాయపు టందగాఁడా,
ఓయి ముద్దుల మురిపెగాఁడా
ఏల యంటెర చీడపుర్వు వి
శాలజీవన పుష్పదళముల?
మానరా,
యీ పిచ్చియత్నం బేలరా?
సరసి నీటను బ్రాణములు విడఁ
దరలుటయె నిజమేనిఁ జెప్పుమ—
నా హృదయం బంతకన్న న

గాథ, మంచు మునింగి తాపము
వాపరా,
నీ విసుగువేసట లడఁగురా.
నేలపై నీ తనువుఁ బాపుట
చాల నిష్టంబేనిఁ జెప్పుము—
నాదు మెత్తని రొమ్ముతలగడ
నాదరంబున మోమునానిచి
తూఁగరా,
యెడలేని యూరట నొందరా.
జీవనము నురితాళ్ళ వీడుట
నీవు తలఁచెద వేనిఁ జెప్పుము—
జడను సలఁగియుఁ గమ్మతావులఁ
గడలఁ జిమ్మెడు పూలదండను
నిత్తురా,
మరణాభిలాషము మానరా.

28-3-1923.

---

# * ఆనంద సత్రము.

---

ఈ వసంత యౌవన రజని,
నీ మృదు తారాకాంతిఁ,
బార హీన గంభీర జలధి
వాయు తరంగాహతుల
మ్రోగెరా నాదు హృదయ మురళి
మోహన గీతాగతుల!

ఆడెరా నా జీవనపాత్రి
నానంద ఫేనిల మదిర!

విరిసెరా నా భావమునందు
విశ్వజనీనానుభూతి!

ఆహా! ఈ మనోహర రాత్రి
నైతి నసంత స్వర్గి.

ఓరే, విరహ విహ్వలకామి,
ఓరె, దరిద్ర కుచేల,
ఓరే, నిష్ఠురజీవన పథిక,
ఓరె, మానవ ద్వేషి,

రండిరా, రారండి! హిమకర
రంజిత గగన చ్ఛాయ
నానంద సత్రద్వారముల
నన్నింటినిఁ దెఱచితి, రండి!
అతిథులారా, చెఱియొక పాత్ర
యాసవ రస మానెదము!
ఆ మత్తులోనఁ గరఁగిపోవు
నైహిక యాత్రా శ్రమము.

30-3-1923.

---

# * ఆమని నిషా.

జాగ్రత్త! జాగ్రత్త! మాయ జగత్తని
శాస్త్రము లెల్లను విప్పెదవు;
భాగ్యము భోగము చంచల మంచును
బైరాగి ధర్మముఁ జెప్పెదవు;
ఎవ్వారు విందురీ పిచ్చి బోధనము
లీ మధుమాస నిశీథమున ?
ద్రాక్షరసాయన పాత్రిక పెదవులఁ
దవులఁ దలంతురె చేఁదనుచు ?
ఓయి యతీశ్వర, చాలిఁక బోధన
మూరక తెల్పకు నీమతము.
ఆనంద భాండము నంటు హాలాహల
మయ్యయ్యో! విరసుఁడ, కలుషకము,
ఉన్మత్త కోకిల గానము సల్పెడి
నుద్యాన వాటిక మధురముగ.
పొడవాటి లొద్దుగ కొమ్మల నూఁగెడిఁ
బున్నమ చందురుఁ డుయ్యెలలు.

ఆమని మత్తునఁ జైతన్యలోకము
ఆనంద పరవశమై సాగియు;
సరిచేయు మో సఖి, భగ్న విపంచిక
సంధ్యలు పాటలఁ బుచ్చెదము!
సౌఖ్యనదీ రసపూరముఁ సందంచ
జంట విధంబున నీఁదుదము!

---

# * లూఠీ.

---

ఎవరురా నావీణా తంత్రుల
నిట్టుల సళ్ళించి పెట్టిరి?
ఎవరురా నా గంగా తీర్థము
నిట్టులఁ గలయంపి చల్లిరి?
ఎవరురా నాపూజామాలిక
నిట్టులఁ దెగద్రెంపి వేసిరి?
ఎవరురా నాగీతాపుస్తక
మిట్టులఁ బుటలెల్లఁ జింపిరి?
ఎవరురా నా యర్చ్య వేదిక
నిట్టుల దీపము నార్పిరి?
ఎవరురా నా హారతి పళ్ళెర
మిట్టుల బోరల దోసిరి?
చోరుఁ డెవ్వడో యతిథి వేషమునఁ
జొచ్చెను నా పర్ణశాలను?
నామూల ధనమెల్ల లూఠీగొట్టి
నన్ను బికారినిఁ జేసెను!

---

# పూర్వజన్మస్మృతి.

---

శారద చంద్రికా మధుర శర్వరులన్ భవదీయ వేణు గీ
తారవ మాలకించి యెడఁదల్ నిలుపోపక మోహమాధురీ
ప్రేరిత చిత్తలై యభిసరించిన గోపిక లొందినట్టి గం
భీర మనోవ్యథల్ కలఁతవెట్టెడి నన్ను యశోద నందనా!

ఏకాలంబున నేయుగంబుననొ యింకేపూర్వ జన్మంబునన్
నీ కల్యాణ మనోహరాకృతిని నే నిత్యంబు దర్శించిన
ట్లే కన్పట్టెడిఁ గృష్ణ! కానియెడ నిట్లేలా మనోవీథి నీ
యాకారంబు సువర్ణ ముద్రితముగా నానందముం గొల్పెడిన్?

పోతన లేఖినీ మహిమ పూర్ణ సుధారస ధార నాని, నా
చేతము నందు నీస్మృతి విచిత్ర గతిం జివురించెనేమొ! లే
దా తనివార నీచరణ తామరసంబులఁ జింతసేయ నా
కీ తలపోఁతగల్గెనొ గ్రహింప నసాధ్యము లోకమోహనా!

తెలుగుంగైత యొయారిపోకడలలోఁ దీపుల్ పిసాళింప ని
శ్చలభక్తిన్ రచియించెఁ బోతన భవచ్చారిత్రముల్; తత్క
థాకలితానేక విశేషముల్ మనసుఁజక్కన్ రేఁప నాపూర్వజ
న్మలచర్యల్ పొడకట్టు భావమున బింబం బద్దమంచుం బలెన్.

పూతన పాలు ద్రావి విసపు న్నురువుల్ వెలిజాఱ, ముగ్ధశో
ణాతరళాక్షులన్ నగవుపట్టఁగలేక యొకింతమోడ్పుచున్
వ్రేతల గుండియల్ వగులఁ వేడ్కఁ జరించెడు నిన్నుఁగాంచి నే
భీతిలి తల్లి జానువులఁ బెట్టునఁ గౌఁగిలినట్లు దోఁచెడిన్.

తరువులు పెల్లగిల్ల, గిరితండము కొమ్ములు వ్రీల, దిద్దిరం
దిరుగుచు నిండ్లు నిండ్లుగనె నింగి సుడింపఁగ రేఁగి వీచు నా
మరుతమునందు నిన్ గగనమధ్యమునం గనుగొన్న నాఁటి యా
వెఱపిపుడైనఁగాని ననువీడదు; నిద్దుర నులుకఁగొల్పెడిన్.

చీటికి మాటికిం దులిపిచేఁతలు చేసెడి నిన్నుఁగాంచి యిం
కాటలు మానరా తనయ, యంచు యశోద వచించి త్రాటితో
ఱోటికి నిన్నుఁగట్ట నెగరొప్పుచు మద్దుల సందుకీడ్చి యు
ద్ఘాటనముంబొనర్చు నిను గన్గొని కాలికి బుద్ధిసెప్పితిన్.

మఱచితి ముద్దుకృష్ణ, యొకమాపటివేళ యశోద మందలోఁ
దిరుగుటఁగాంచి మీఁగడలు దెచ్చి, సకుల్ మన వెంటరాఁగ నం
దఱమును నారగింప, నది తల్లి కనుంగొన, లేచి, మీఁగడే
మెఱుఁగ మటంచు నమ్మయొడియెక్కిన నీచెయిదంబుదోఁచెడిన్

కన్నీటిధారలం గరఁగిన కాటుక
మఱకలు బుగ్గల మెఱయుచుండ,
గ్రీఁగంటిచూపుతోఁ గేల్దోయిఁ గోపీన
మును మెలివెట్టుచు, ముద్దులొలుక—

వినయంబు మూర్తీభవించిన తెలుఁగునఁ
దలవంచి నిలఁబడి: 'తల్లి, నేను
ఏమిచేసితినంచు' నేమియెఱుంగని
పసిపాప యట్టులఁ బలికి, విశ్వ
మోహనాలోకనంబుల మోసపుచ్చి,
తప్పులెల్లను మఱపించి, దండనంబుఁ
జేయనుంకించు తల్లి యాశీస్సుఁబడసి
మురిపెముం జిల్కు నిన్ను నే మఱవఁగలనె?

సిగలోని పించెంబు చిన్ని తెమ్మెరలకు
రతనాలవింటి వర్ణముల నీన;
నీలిమబ్బులవంటి నెమ్మేని నిగ్గులు
చల్లని శాంతరసంబు గురియ;
మొలత్రాటఁ జెక్కిన మురళి కొండలగాలి
కొకవింత రాగంబు నూఁదుచుండ;
సగము మెక్కినవెన్క వెగటు గొట్టిన వెన్న
ముద్ద మొండెఁ గరంగి బొట్లుగాఱ;
నలువ దాచినయావులఁ జెలులవెదుక
నేఁటిపచ్చిక గట్టుల నేఁగుచున్న
నిన్నుఁ గనుగొన్నదృష్టి నా కున్నదోయి,
యెన్నిజన్మంబులకు నైనఁ జిన్నికృష్ణ!

మటమట మొండలం బసుల మావులక్రిందఁ బరుండఁదోలి చి
క్కటి పెరుగన్నమున్ మిరపకాయలు నంజుచు నారగించి యొ
క్కట గుమిగూడి, యాదవుల గాథలు నీవు వచింపఁగన్ నదీ
తట పవనంబు వీవఁ గడఁదాఁకిన సంజలు నేఁడుఁ గల్గునే?

కాళింది మడుగులో నా
భీల విషజ్వాల లెపుడు వెలిగ్రక్కుచు మా
బాలురఁ బెయ్యలఁ జంపిన
కాళీయఫణి కథలు దలఁపఁ గాయమువడఁకున్.

ఆ సర్పంబు భయంబునం బసులు నీరానక విలంబించి యా
కాసారంబును డాయఁబోయి వెనుకోఁగాఁజూచి నాగేంద్ర, చా
వాసన్నంబయియుంట నీ పొగరుఁబోతాటల్ విజృంభించెఁగా
నీ సైతెమ్మని హుంకరించిన నిన్ను నేఁడైన నూహించెదన్.
బరబరఁ జేలమున్ నడుముపై బిగియించి, కిశోరసింహ మ
ట్లురవడిఁజూపి, మమ్ముఁగని యోసఖులార, భయంబులేదు; నే
నురగముఁ జంపివత్తు నని యొడ్డుననున్న కుజంబునెక్కి మో
హారమునఁ బాముపై దుమికినప్పటి నీ రభసంబుదోఁచెడిన్.

బుస్సుబుస్సున గాలి భోకొట్టినట్టుల
విసపు నిట్టూర్పులు దెసలుముట్టఁ,
పాతాళగర్భంబుఁ బగిలించి శేషాహి
పైకిలేచిన రీతి ఫణములెత్తి

తోఁకజాడింపఁగఁ దోయప్రవాహంబు
అభ్రంకషోర్ములై యాకులింపఁ,
దరిఁగొండ మున్నీట గిరికొట్టి నట్టులఁ
గాళింది మడుగెల్లఁ గలదిరుగుచుఁ,
ప్రాణిభీకర విహరణ పారవశ్య
మునఁ జరించెడి కాళీయు ఘన ఫణముల
మణిగణ ద్యుతి యడఁగఁ దామరలఁ బూఁత
వెట్ట నటియింపవే కృష్ణ, విజయి వగుచు!
గోవర్ధన గిరి యెత్తి శ
చీవల్లభు గర్వశాంతిచేసి, మమ్మున్ మా
గోవుల వానలఁ జావక
కావవె శ్రీకృష్ణ, దివ్య కారుణ్యమునన్!
యమునా శ్యామల వీచికా తతుల లాస్యంబుల్, శరచ్చంద్రికా
కమనీయామల సైకతంబు, మురళీగానంబు బృందావన
ద్రుమవల్లీ కృతడోలికల్ మనమునందుందోఁపఁ బూర్వాను భూ
తములౌ కోర్కెలు మోసులెత్తెడిని రాధాకృష్ణ,యీ వెన్నెలన్
చిరవిరహంబునం బనవు స్వీయ విధంబున బృంద నేఁడు నీ
చరణ సరోజ సంగతుల సౌఖ్యముఁ బాసి కృశించెఁ; గ్రమ్మఱన్
మురళిని మర్మమూర్ఛనలు మ్రోయుచు రమ్మిఁకఁ బ్రేమరాజ్య సం
భరణ మనోహరాంగ విభవంబుల లోకము మోహపుచ్చుచున్.

---

# రాజభిక్షుకుఁడు.

---

పగలెల్ల వరిచేలఁ బనిపాటుచేసి
ప్రొద్దు గ్రుంకెడివేళఁ బొలమునువీడి
యిలుసేరి నూకల నిగిరించి, వేఁడి
సంగటిఁ గుడిచెడి సమయంబునందు,
సన్నచీఁకటి రూప సౌందర్యగరిమ
మబ్బువాఱుచునుండ, నా కుటీరంపు
ద్వారంబు కడనిల్చి ధరణీవిభుండు
ముసిముసి నవ్వుల మొగమందగింప
నందె కబళము వేఁడెఁ!— జకితనై నేను
నొడలు కంపింపంగ నొక్కమాటైనఁ
బలుకఁ జాలక మోమువంచి నిలుచుంటి;
నంతనెచ్చోటికో యరిగె రారాజు.
అవి యూఁవియని యెంచ నలవిగానట్టి
చిదురుఁ దలంపులు చీకాకువెట్టఁ
జేతిలోఁ గబళంబు చేతనేయుండ
నూరక కూర్చుండి యున్నతరుణమున
నెచ్చటినుండియో వచ్చి బిచ్చకుఁడు

జాలిపుట్టగ వేఁడె సందెకబళంబు;
కనికరంబున నేను గడియన్న మెత్తి
"యిదిగో కొమ్మని" చేత నిడితి; బికారి
యానవాలుగ దీని నర్పింతు ననుచు
నుంగరంబొక్కటి యొసఁగి తా నేఁగె;
నంత దీపపు వెల్గు నందు నే దానిఁ
గన, రాజముద్రిక యనితోఁచె; నేఁడు
రాజు భిక్షార్థియై రాఁగతంబేమొ
మాబోఁటి నిఱుపేద మాలకొంపలకు?

---

# మృత్యువు.

---

ఓ మృత్యుదేవతా, యో జగద్రాజ్ఞి,
జంటబిడ్డలపోల్కి జన్మించినారె
జీవితంబును నీవు సృష్ట్యాది యందు!
మనుజుండు నీదివ్య మహనీయమూర్తి
భయసముత్పాదక బహుళవర్ణములఁ
జిత్రించి యాత్మీయ సృష్టిని గాంచి
భీతచేతస్కుఁడై విభ్రాంతినందు!
మూఢభక్తియుఁ గాలమును బడుగుపేక
యనఁగ, భావమునాఁడె యట్టులఁ దిరుగఁ
బ్రీతిఁ బౌరాణిక విశ్వాసమనెడి
వల నేసి దైవ విపాకంబుకతనఁ
బాపము! తానందుఁబడి చిక్కుకొనియె.
తప్పించుకొనుటకు దారి గన్పడదు.

నీ కన్నుబొమ్మలు నీహారఖండ
శిశిరంబులంట! నిర్జీవధావళ్య
జలదంబు నీకన్ను జంటచుక్కలను
గబళించునంట! యో కాలస్వరూపి

ణీ! మానవునితోడ నీవు నెల్లపుడు
దాఁగిలిమూఁతల తందనాలాడి
చేయిఁ జిక్కక యొకఁ జేరఁబోయెదవా!
మూఢ చిత్తులు నీకు మున్నొసఁగినట్టి
పౌరాణిక విచిత్ర వస్త్రములఁదాల్చి
మహి విహరింతువు మాఱువేసముల!
నీకాలిచప్పుడు సోఁక దిగులొంది
కంపిల్లు మనుజులఁ గని రహస్యముగఁ
జిఱునవ్వు నవ్వెదో చిన్నారిరాణి?
నీ మోసగింపులు, నీ టక్కుఁదనముఁ
జాలింక! నెఱపుము సఖ్యంబు సకియ.
దయ్యాల ముసుఁగేల తాల్చి త్రిమ్మరెదు?
నీ దొంగవేసంబు నే లాగివైతు;
ఎటువంటి నగుమోము, ఎట్టియందంపు
ముసుఁగుఁజీఁకటిలోన మునిఁగియున్నదిర!
కవితల్లజుండగు కాళిదాసైన
నీమోహనాకృతి నీదివ్యమూర్తి
నభినుతింపగలేక హతమనోరథుఁడు
కావలెనని చెప్పఁగా నన్నుబోఁటి
కర్షక కవియెట్లు కడతేరఁ గలఁడు?
అందంబులకు నెల్ల నందంబ వీవు;

నీవు నీవేసాటి నిఖిల లోకమున!
గారడికొలనులోఁ గలకల నగుచు
నిప్పుడిప్పుడె విచ్చు నిందీవరముల
సరిపోలు మురిపాల చక్కనికనులు
సౌందర్యరాజ్య విజయ లాంఛనములు.
చెమరించు నీలేఁత చెక్కుటద్దముల
పన్నీరుపువ్వుల పస వెల్లివిరియు;
పచ్చిద్రాక్షా రసానఁ బలుమాఱునాన
వైవ మెత్తగనైన పవడంబుచేత
రచియింపఁబడెనో యోరమణి, రసార్ద్ర
మైన నీవాతెఱ! యానందదాయ
కంబైన వాసంత కల్యవో నీవు!
జీవరత్నకలాప చిత్రమకుటంబు
ఖద్యోతకాంతులఁ గనుబొమలపైనఁ
గురిపించు నోపెండ్లికూఁతురా, మనము
ఆశ్చర్య పారవశ్యంబున నీవు
చంద్రశిలా రమ్యశాల, రహస్య
లీల నన్యోన్యముఁ గేలఁగేలూని
విడిపోని మమతల విహరింపలేదె?
ప్రతినిశ గాఢనిద్రావేశ నీవు

సుఖకర నిశ్శబ్ద చుంబన స్పర్శ
ననుభవించుచు నుండు నలసటదీఱ.
జీవనాంభోధి వీచీమార్గ మందుఁ
బ్రాణికోటులఁ బరపారంబుఁ జేర్పు
నుడుపంబు నేర్పుతో నడుపంగఁ, బ్రకృతి
నియమించెనిన్ను; నో నిశ్చలకర్ణ
ధారిణీ! నవమూర్తి ధరియింపు మింక.
విపులపౌరాణిక విపిన సంచారి
ణీ! రుద్రమృత్యువా! నీకు వీడ్కొలుపు.

---

# బిడ్డ : బాటసారి.

---

బిడ్డ

పై బాటలం బోవు నో బాటసారి,
నిసుగులకును నోట నీరూరునట్లు
దోరగిల్లి పసిండి తీరులొలికించు
పండ్లగుత్తులు వీఁపు పైన వ్రేలాడ
నలసట సోలుచు నరుగుదెంచెదవు.
నీపయనం బింక రేపుమాపులను
ముగియదా యేమి యోముసలి తాతయ్య?

బాటసారి

నీవలె నొకనాఁడు, నిండారఁ బూచి
పచ్చితావులు చల్లు పన్నీరుపువ్వు
పోల్కి నవ్వుచు నేనుబుట్టితిఁ; గాని
పుడమి సంతను నాదు పొలుపునెత్తావి
వెదచల్లి, కారాకు విధమున నొంటి
నేఁగుచున్నాఁడ మాయింటికి నేఁడు
యుగయుగంబులనాఁటి సొగసైన పసిఁడి

పండ్లబరువులు వీఁపు పై మోచికొనుచు.
పలు గృహంబులకును బయనంబు చేసి
భవపిపాస హరించు పండ్లుఫలాలు
అలమట పడియైన నార్జించుకొందు.
ఎనలేని యైశ్వర్య మెపుడు గడించి
విశ్వసామ్రాజ్యంబు విలుతునో గాని
యంతదనుకను నేను నఱికాళు లరగఁ
దిరుగుచుండెద నోయి మురిపాల బిడ్డ!

బిడ్డ

అల్లైన నింకెప్పుడలసట కోర్చి
పండ్లగుత్తులు వీఁపు పైనూఁగులాడ
నీవలెఁ జరియింతు నేను నీబాట.

బాటసారి.

చరియించుచున్నావు చక్కనికూన!

బిడ్డ

నీవలె నేనెపుడు నిఖిలవిశ్వంబు
విత్తంబుఁ గడియించి విలుతునో చెపుమ?

బాటసారి

గడియించుచున్నావు; కడకొక్కనాఁడు
నేను బోయినదారి నీవు రాఁగలవు!

# మేలుకొలుపు.

---

ప్రత్యూషశ్శాంత నిర్మలాంబరమునందు
నరుణరక్తిమ వ్రాసె జయాంకములను;
జిమ్మచీఁకటి తెరలను జింపి వైచి
మేలుకొనుమమ్మ! యింకనైన మేలుకొనుము!

పవలు రేయు నతీంద్రియ స్వప్నములను
గనుచు నవియెల్ల సత్యమంచని తలంతె?
కలఁకను వీడుకోలుగాఁ బులుఁగు లిపుడు
గానములు సేయుచున్నవి; కనవో? వినవో?

నిద్రయే జీవనంబని నీకు మున్ను
నూరిపోసిరి మాయలమారు లెవరో!
మచ్చు మందుల మత్తకమ్మ విచ్చిపోవఁ
గడపఁ గాల్మెట్టి లేయెండఁ గ్రాఁగుమమ్మ!

అపయశః పంకిలంబైన యాత్మకన్న
చచ్చుటే కొంత మానరక్షణము సుమ్మ;
పారతంత్ర్యభరంబున బడలి సడలి
యదవ త్రొవ్వుడు త్రొవ్వెదో యమ్మ, నీవు?

కాలగర్భంబునఁ దాఁగి కానరాని
భావిదృశ్యంబు కన్నులఁ బడినయట్లు
నలుదెసలఁ బ్రొద్దువొడుపు నిగ్గులు రచించె
నభినవ జగంబు; ముసుఁగెత్తి యరయు మమ్మ.

కర్మ, విధిచేష్ట, దైవ నిగ్రహమటన్న
పిచ్చివేదాంతములఁ బోయెఁ బెద్దప్రొద్దు;
ఆత్మవిశ్వాస సూర్యోదయంబు కెలన
నిద్దుర తమంబు కాలొడ్డి నిలువఁగలదె?

---

# వసంతోదయము.

ఏలొకొ మావులం జివురులెత్తుగఁ, గావ్యరమా కరంబులన్
మేలన మాడునట్లు నునునీడలు దేలుచు నందగించు? నే
మూలలనునైనఁ జాల సుభోగ్యముగా ననిలంబు విచ్చుక్రొం
బూల యనుంగుఁదావి తడిపుప్పొడి తాఁకుల నామతించెడిన్.

ఎవరికి నెఱుంగరాక యే యింద్రజాలి
కుండు వీచెనొక్క నెమ్మికుంచె నిపుడు!
చెట్లు చేమలు విలసిల్లెఁ జిత్రగతినిఁ
బువ్వు లాకులఁ బిందెలఁ బుష్కలముగ.

కోకిలాగంతుకులు మావికొమ్మ లెక్కి
యాలపించెద రిష్ట డయాచితముగ
హృదయ సంస్పర్శి రాగంబు! నే నియంత
వారి కాహ్వానపత్రికఁ బంపినాఁడు?

గణిక మొదలుగఁ దారకాగణము వఱకుఁ
గలుగుసృష్టి నీరవభాషఁ దెలుపుచుండె
నవ నవోజ్జ్వల సుఖజీవనప్రభాత
దివ్యసందేశమును నేఁడు! తెలిసెఁ! దెలిసె!!

ప్రభువసంతుఁడు నందన వనమునుండి
యాత్రసేయఁగ భూమిపై కరుగుదెంచె;
నతఁడు విడిసిన తలము లల్లవిగొ! పచ్చ
నాకుల గుడారముల పట్నమనఁ జెలంగు.

# పండితప్రతిజ్ఞ.

---

మొన్నటి పుష్యపంచమికిముప్పదియేండ్లవయస్సు చెల్లె, నిం
కెన్నిదినంబు లీగురువునింట వసింతు? సమస్తశాస్త్రముల్
తిన్నగ నేర్చుకొంటి 'మన తిమ్మయశాస్త్రి కుమారుఁ డెంతలో
నున్నతి కెక్కె' నంచు నను నూరిజనుల్ వినుతింతు రెప్పుడున్.

సగము ప్రాయంబు విద్యావిచార మందె
కడచె; సంసారసౌఖ్యంబుఁ బడయ నైతి;
గొప్పవారింటఁ బెండ్లాడఁ గోర్కె గలదు,
కాని, దారిద్ర్యదోషంబు కంటకంబు.

ఎవరి నడిగినఁ గాని 'మీ కెంతయాస్తి?
పెండ్లికూఁతురి కేనగ పెట్టఁ గలరు?
ఇంటిమర్యాద లెఱిఁగి మా హెచ్చు నెంచి
పెండ్లివేడుక నడుపంగఁ బ్రీతి గలదె?'

అని, మఱి యేమొయేమొ మరియాదలుగీదలు దెల్ప నోర్పుతో
వినివిని, చీదరించుకొని, పెండ్లిపెడాకులు మానుకొంటి; నై
నను జెలికాఁడు నామనమునం దొక కోరికవిత్తు నాఁటి తి
య్యని నుడికారపుం దడిని నంకురమెత్తఁగఁ జేసి యిట్లనెన్:

'జను లనుకోఁగ వింప; నెలజవ్వని, తాఁకినఁ గందిపోవు మెత్తని చివురాకు మేను, కనుదమ్ముల లోకము మోహపుచ్చు మోహనమగు నింద్రజాల మెదో యాడుచునుండు, వివిక్త కాననంబున నెలయేళ్ళకూలములఁ బూఁబొదరిండ్ల వసించునొంటిగన్.

' పేరు కవిత యంట, పెద్దలుం బిన్నలు
గారవింపఁ బెంపు గాంచునంట;
ఇష్టమున్నఁ, గోర్కె లీడేర్పఁ దనకుఁ దా
వరుని సరసహృదయు వలచు నంట!

'కులముం జూడదు, డబ్బు గోరదు, మనఃకూలంకష ప్రేమతో వలచుం దాను గురూపినైన; నెటు నిర్బంధించి కామింప భూవలయాధీశునకైనఁ గానిపని; నీ పాండిత్యముం జూపి యాపొలఁతిన్ లోఁగొనుమన్న మాటలుమదిం బూరించెఁ బేరాసలన్

అఖిలశాస్త్రపురాణేతిహాసములను
సంస్కృతాంధ్ర కావ్యకలాప సంపుటముల
మూటముల్లెలుగాఁ గట్టి మోసికొంచుఁ
దరలితిని గవితా స్వయంవరమునకును.

జనకుఁ డొసఁగిన దేవతార్చనపుఁ బెట్టె
నంచు చినిఁగిన మడిపట్టుపంచఁ జుట్టి,
చంకఁదగిలించి, వెలిబూది సంచిగూడఁ
బదిలముగ దాఁచికొని దారిఁ బట్టినాఁడ.

తలయూఁచినపుడెల్లఁ దళతళద్యుతి నింపు
మకరకుండలములు మాకు లేవు;
పాండిత్యమున కనివార్యలాంఛనమైన
కాశ్మీరశాలువఁ గప్ప లేదు;
లలితంపుఁ గవులగుండెలు ఝల్లుఝల్లన
గండపెండారంబుఁ గాలఁ దొడుగ;
మునుకొని తనకన్న ముందు బారెడు పోవు
బిరుదు పేర్లెన్నరైనఁ బెట్టరయ్యె!
ఐనఁ గానిమ్ము, నా కున్నయంతవట్టు
కేమి లోపంబు లే దెవ రేమి యన్నఁ
గంచుగంటపు వ్రాయసకాఁడఁ గానె?
మిగత భారంబు దైవముమీఁద నిడితి.

అని తలపోయుచుం, దుదకు నా కవితాలలితాంగిఁ బెండ్లి యా
డినగతి మోర శీవి, నడచెక్కు సుమాళము సందడింప లోఁ
దొనికెడి భావి భోగ పరితోషపు భావన తెప్పలార్చుచున్
వనమున కేఁగుచుండె మనపండితశాస్త్రి జయాభిలాషతోన్.

చనిచని కొన్నినాళులు, వసంత శుభోదయవేళఁ గొండదా
పున దిగఁబాఱువాఁక కిరు పుంతలఁ బూఁబొద లందగించు చ
క్కనివనిఁ జొచ్చి, దప్పి నడగాసియుఁ దీఱ జలంబుఁ గ్రోలి, చ
ల్లని పొదరింటినీడఁ బడిలంబుగఁ గూర్కె సుఖంబు చేకుఱన్.

అంతలోన నెండ యారాట మొక్కింత
దొలఁగఁ బూలగాలి తోడ వీచె;
కొండసెలల సడులు, కోయిలపాటలు
మిళితమయ్యె నొడలు పులకరింప.

చివురాకుల్ దెగమేసి పోతరమునం జెంగించుచున్ దాఁటుచున్ దవుదవ్వేఁగుచుఁ గొమ్ము పుట్టుతఱిఁ బంతాలాడి కండూతి వోవ నడిన్ ముస్దల డీలుచున్ హరిణశాబంబుల్ వినోదించుఁ గేళి విహారంబుల నిర్భయంబుగను, వల్లిచ్ఛాయ లాసించుచున్.

అట్టి నవమోహనారణ్యమందు నొక్క
మావికొమ్మకు నల్లిన పూవుఁదీవ
తూఁగుటుయ్యెలఁ గూర్చుండి, తునిఁగి రాలు
విరుల జడిగొట్ట నొక వన్యతరుణి యూఁగు.

ఆ వలపించుతొయ్యలి కొయ్యారము నేర్పుఁ గలాపి ప్రేమ సంభావనతోడఁ గుత్తుకను బయ్యెదమీఁదుగ మూఁపుఁజేర్చి పూఁదావులఁ జల్లు క్రొవ్వెద తలాపిని మో మరమోపి, మెత్తగం జేవిరిచెక్కపై నిమురఁ జెల్వ ఱెయొడింగను మోడ్చి హాయిగన్.

కోయిలపాటకత్తె తనకూఁతల తప్పొటులుంగు దిద్దికోఁ
జాలక యభ్యసించుఁ జెలి షడ్జన పాఠము; గోరువంక క
త్యాయతశిక్ష నైన దొసఁగంతయుఁ బోదు; సమర్థుఁడౌ గురుం
డైయును జక్కఁజేయఁగలఁడా ప్రతిభా పరిహీన శిష్యులన్?

అపుడే నిద్దుర లేచి పండితుఁడు, నుయ్యాలూఁగు నాలేమ యందపుఁజందంబునుచూపు రేక వెఱఁగొందంగాంచి యూహించుఁబోణి పదాబ్జంబుల మ్రొక్కినం దొలఁగవే నిర్మూలమై పాపముల్! అపురూపంబిటువంటిమూర్తియని వెయ్యాఱుల్ విలోకించుచున్

పలుకరింప నెంచి, పలికిన నేమేని
బెడఁద వచ్చు నన్న బెంగతోడ
నీళ్ళు నములుకొంచు నెత్తిగోఁకుచు నిల్వఁ,
జూచి చూడనట్లు చూచి చెలువ;

ఉయ్యెల డిగ్గి, పయ్యెదను నోర ముసుంగిడి, జవ్వనంపు లాగియ్యది యన్న పోల్కఁ గను లెత్తియు నర్ధనిమీలితంబుగా న య్యలినీలవేణి నడయందము దోఁపఁగఁ జెట్టుచాటుకుం జయ్యనఁబోయి తేనియలుజాల్కొనఁబల్కెఁదెనుంగుమాటలన్.

సిగ్గు పైకొని చెక్కిళ్ళు జేవురింప
సగముసగముగఁ బల్కె నా సొగసులాడి:
'అతిథులరు, మీకు స్వాగతం ' బన్ననుడులూ
పడెను జెవిలోన విని వినఁబడని యటులు.

ముగుద మాట సూదిమొన మోపునంతటి
సందుఁ జేయ నతుకు జాఱవిడిచి,
పండితుండు పల్కెఁ: 'వనిత, నీవెవతెవు?
ఒంటికత్తె విచట నుండనేల?'

అన విని, కాంత: 'నేఁ గవిత నయ్య, వనాంతరసీమలందు నే
యును బవలెప్పుడుం బ్రకృతియుత్సవముం దిలకించుచుం, బికాం
గనలు మయూరముల్ సఖులుగాఁ బరిచర్యలుసల్ప నొంటిగన్
దినములఁ బుచ్చు జవ్వనముఁ దీరును దివ్యము శాశ్వతంబుగన్.

'కలికీ, యెంతటివింత! నీవె కవితా కళ్యాణివా? బాపురే!
తెలియం జాలకయుంటి, నీకొఱకు నే దేశాలు పట్నాలు కో
టలు పేఁటల్ గిరు లేళ్ళు దాఁటుకొని మూఁటాముల్లెభారంబునన్
దల చెప్పట్టగ బట్టగట్టి విసుగెత్తన్ వచ్చితిం గానమున్.

'నిన్నుఁ గూడి ధర్మనియతులఁ బాల్గొనఁ
దలఁచి వచ్చినాఁడ, వలచినాఁడ;
నన్నుఁ ద్రోసిపుచ్చ న్యాయంబె? వైదిక
విధిహితంబుగాఁగఁ బెండ్లియాడు.

'అన్నవేళకు నతిథు లభ్యాగతులును
నింటికరుదెంచి కూర్చుండ, వంట గింటఁ
జేయ నిల్లాలు లే దని చెప్పలేక
తెగఁబడితిఁ గాంత, యాకొఱ దీర్ప మింక.

'హేమంతమున నైన నేటిసీట మునింగి,
మడిదోవతులు పాఁతమైల లుదికి,
యిలు నూడ్పుటాదిగాఁ గల పాఁచిపనులెల్ల
విసుఁగు వేసట లేక వెళ్ళఁబుచ్చి,

దేవతార్చనవేది దీపంబు వెలిఁగించి
బానసంబున వంటపనులఁ దీర్చి,
యిరుగుపొరుగు నిండ్ల కేఁగక తనయిల్లు
కనిపెట్టుకొని, దూది పెనఁచి దివ్వె
వత్తులను జేయుటో, లేక వలయు విస్త
రంట్లు గుట్టుటో, తడిబట్ట లార్చుటయునో
గాక యిల్లాలి కింకొక్క కార్యమున్నె?
యట్టి గృహిణీపదంబు నీ కౌను చాన!

'వేద వేదాంగముల్ వివిధ పురాణేతి
హాసముల్ నాబుద్ధి నరగిపోయె;
పంచకావ్యాల నేపట్టున నేశ్లోక
మడిగిన వల్లింతు నప్పుడపుడె;
ఆఱేండ్లు పాణినీయము పీల్చి పిప్పిఁ జే
సితి, నది నాయందె జీర్ణమయ్యె;
వసుచరిత్రంబున వ్యాఖ్యాన యుతముగ
శ్లేషభంగుల విమర్శించినాఁడ;
కడకుఁ జిన్నయసూరి వ్యాకరణ మెల్లఁ
బుటలు మలినంబుగాఁగ నెప్పుడును జదివి
సిద్ధివడిసితి; నమరంబుఁ జిత్తశుద్ధి
తో నుపాసించి పొందితి దొడ్డఫలము.

'శాకుంతలములోన శతసహస్రములుగ
వ్యాకృతిదోషముల్ బయలుపఱతు;
భవభూతిసాహిత్య భాండార మెల్లను
గాసుకుఁ గాకుండఁ గడిగి వైతు;
బాణుని శ్రీహర్షు భారవి ఝాడింపఁ
దోలిదెబ్బకైనను నిలువఁ గలరె?
తిక్కయజ్వకుఁ దలతిక్క మాన్పెద నన్నఁ
దెరపిగా నొకనాఁడు తీఱలేదు;

ఇంకఁ దక్కినవార లదేమి లెక్క?
ముక్కుఁ బట్టినఁ బ్రాణంబు మొదలె పోవు;
కాంత, నాకన్న నేర్పరుల్ గలరె చెపుమ?
నేను ననుఁగూర్చి పొగడుట నియతిగాదు.

'సత్కవి, ప్రబంధవేంకటేశ్వర విజయ వి
లాసకర్త నామది కెక్కలాగు వ్రాసెఁ
గాని, కొందఱు పాండిత్య గణ్యతా వి
హీనతను దాఁచ, రస మని యేడ్చినారు.'

అని తనమూటముల్లెలు రయంబున విప్పి: 'నెలఁత, పొత్తముల్ గనుమ, యధీతమయ్యెనివి; గ్రంథములెన్నియొమోయలేక యింటను బదిలంబు చేసితిని; నా శ్రమ లెల్లను జింతచేసి సరగ్గనుమ కృపాకటాక్షములఁ గామిని, నీ మన సేమి చెప్పుమా!'

తనకుఁ బరమశత్రుఁ డైనలేనిఛాందసుం
డింత కెటులొ దొరకె; నింతతోడ
విడువరాదటంచు వెలఁది సంతోషించి,
హాస్య మనుభవింప నభిలషించి:

'ధర్మశాస్త్ర మెల్లఁ దనువున జీర్ణించె
నిగమవిధులయందు నిధులు మీరు;
అట్టి లోట దలఁప కెట్టుల నీనాఁడు
కులటతోడ పొందు గోరినారు?'

అనిన విని, ఛాందసుం డపు డదరి లేచి:
'వెలఁది యేమంటి? వీ వెట్లు కులట వైతి?
బహుపతిత్వము స్త్రీలకు భావ్యమగునె?
ధర్మవైరుధ్య మక్కటా! దాపురించె.

'ఇందుకా నేను బలుపాటు లెల్ల నైఁచి
యింత దూరమ్ము వచ్చుట యెమ్మెలాఁడి?
బ్రహ్మచారిని, బ్రాహ్మణపండితుఁడను
కులటసాంగత్య మేరీతిఁ గోరుకొందు?'

అని కపటంబులేని వెత లానసనీనుచు దేలియాడఁ: 'గా
మిని, కులటత్వ మెట్టు లను మేయము నీయెడ' నన్నఁ గాంతయుక్
మనమున నుబ్బుహాస్యరసమాధురి కన్నులఁ జిప్పిలంగ లోఁ
గొని మొగమందు మాయవగఁ గూర్చి వచించెఁ జరిత్రమంతయుక్

'వాల్మీకి ముసలితాపసి యయ్యు ననుఁ గూడి
　　రమణీయ కళలఁ గరంచి యేలెఁ;
గాళిదాసుఁడు బిగ్గఁగౌఁగిట లాలింప
　　శృంగార భోగ నిర్వృతిని గంటి;
భవభూతి పాండిత్యపటిమతో శాస్త్రరస
　　మ్మృతముగ ననుఁ గూడిమాడినాఁడు;
భట్టబాణ మయూర భారవి ప్రముఖులు
　　దివ్యభూషాశేష దీర్చినారు;
నన్నపార్యుఁడుఁ దిక్కన మున్నుగాఁగఁ
దెలుఁగుఁగవు లెల్ల నాముద్దు సలిపినారు;
ప్రాఁతవారల యనుభోగ్యపటిమ సడలఁ
గ్రొత్తగోవాళ్ళ నాసించి కూడుచుందు.'

అన విని పండితుం డనును: 'సందఱు ముంచిన ప్రాఁతలంజ వయ్యును బడుచుందనంబుఁ గనులోరలఁజూచెడి ముద్దరాలిసొంపును, దనుసౌష్ఠవంబు, వలపుంబస, లెట్టులుగాచి యుంచితో వనిత? శరీర రమ్యతకు బ్రహ్మ వినీతిని గూర్పఁ డేలొకో?'

　　అనుచు గ్రంథంబు లెల్లను నట్టె జవిరి
　　మూటముల్లెగ సవరించి: 'పోలఁతి, నేను
　　బోయి వచ్చెద, మన పొందు పొసఁగ' దనినఁ,
　　జెలియ చిఱునవ్వు నవ్వుచుఁ జెంతఁ జేరి:

ప్రేముడితోడ నాయురము బిట్టుగ నీ 'కవుఁగింటఁ జేర్చకే
యోమనుధర్మశాస్త్రరత, యూరక పోయెదె' యంచుఁ దెచ్చికో
ల్దీమస మూని కౌఁగిలిడఁ దేరకుఁ దత్తఱమంది చూచు చే
మేమొ వచించుచుం గనుల నెత్తక చేతుల నూడఁబీఁకినన్.

ముద్దుమాటలు వల్క మోము చిట్లించుచు
శబ్దసంస్కారంబు చాలదనును;
అడవిపూఁదొడవులఁ దొడిగియుండుటఁ గాంచి
యీ యలంకృతి లోప మెసఁగె ననును;
మురిపంబు దళుకొత్త మోవి యానఁగఁ బోవ
నెంగిలి రస మంచు నీసడించు;
బలిమిమై గిలిగింప నులికి బారెఁడుదాఁటి
జిలిబిలి నడలెల్లఁ జెల్లవనును;
పెట్టరానట్టి సిలుగులఁ బెట్టి చెలువ
యాటపట్టించి చెర్లాట మాడుచుండఁ,
గాననంబున నేడనో కానరాక
మురళిరావంబు వినవచ్చె మోహనముగ.

పూలగుత్తులఁ గాంచి పునికి ముద్దాడును,
పికమనోహరగీతి విన్న మెచ్చు,
సెలయేళ్ళపాటలఁ జెవియొగ్గి యాలించు,
రాలుఁబువ్వుల నేరి మాల గుచ్చు,

పొదరిండ్లలోఁ దూఱి పొదలయల్లికఁ జూచు,
　　నడవిజింకల తోడ నాటలాడు,
సాంధ్యారుణాంకిత జలద ఖండముఁ గాంచు,
　　వనరామణీయకమును దలంచు,
మధుర రసము తనదు మనమునఁ దొలఁకాడ
లోకమెల్లఁ దేనెపాక మనును;
నిట్టి మృదులహృదయుఁ డెచ్చోటనుండియో
పిచ్చివానిపోల్కి వచ్చుచుండె.

ఆతనిఁ జూచి కాంత, తన యంతు నెఱింగిన చెల్మికాఁడు, సాంధ్యాతపకాంతులం బ్రకృతియందముఁ గాంచఁగ నేఁగుదెంచెఁ; దానా తరుణుం డొకళ్లొకరి యంసమునం జేయివైచి ముగ్ధసంగీతములన్ రసంబు లొలికింపఁ దలంపులు దీవరింపఁగన్;

వచ్చి రాక మున్నె వరునిఁ గౌఁగిటఁ జేర్చె
మూఁతపడ్డ కనుల ముత్తెసరుల
గతినిఁ బ్రేమద బాష్పకణములు చిప్పిల్ల
నొడలఁ బులకనారు లుప్పతిల్ల.
రెండుకీలలు నేకమౌరీతి నిరువు
రొక రొకరి కౌఁగిళులోన నుండి రపుడు;
వసుధఁ బ్రీతిడియుఁ బ్రణయ పిపాసతోడ
నొకటినొకటి నాశ్లేషించు నొప్పు దోఁచె!

అనిమిషత్వము నొంది యాయమృతంబు
నరయుచుండెను శాస్త్రి నోరంత దెఱచి;
యంతఁ గౌఁగిలి వీడి యీ యబ్జనేత్రి
పిన్ననవ్వులు మోమునఁ జిన్నెలొలుక:

'చాలిఁక! శాస్త్రిగారు, శ్రమ చాల సహించితి; దర్భమయ్యయో
కాలుకుఁ గాలు గొట్టుకొనఁ గానసీమకు వచ్చి, యింత కే
మేలునుబొందకే తిరిగి మీపురిఁ జేరుటఁ జూడ నాకునున్
జాలిజనించె; దైవము ప్రసన్నముగా, దీక్షఁ బొందు' నావుడున్;

ఈర్ష్య యొకవంకఁ, బరిభవ మింకనొక్క—
కడను, జిత్తమ్ముఁ జుఱచుఱఁ గాల్చుచుండఁ
గటము లదరఁగఁ గనుబొమల్ నటనసేయఁ
బండితుఁడు పళ్ళు బిగఁబట్టి ప్రతినచేసె:

'నేనే తిమ్మయశాస్త్రిపుత్రుఁ డయినన్ నిత్యమ్ముఁ గాత్యాయనీ
ధ్యానారూఢహృదబ్జతన్ విధుల సద్ధర్మంబులం బ్రత్యుష
స్స్నానంబుం బొనరింతు నేసిఁ గవితా, సత్యంబుగా నీ జిగుల్
సీనాటంబు నొయారి యంచనడలున్ నిర్మూలముం జేసెదన్.'

అని కోపంబున మాటముల్లె గొని సంధ్యావందనాపేక్షచే
వనమార్గంబునుబట్టి యేటిదరికిన్ బాండిత్యవాహుండు పో
యిన, నా యిద్దఱు నెచ్చెలుల్ వనవిహారేచ్ఛన్ నదీసైకతం
బునకుం బోయిరి జంటఁ బాయకమనంబుల్ దేహముల్ వర్తిలన్.

సందెచీఁకటిలో నెదో చాయనుండి
వీనులం బడె నశరీరగాన మొండు;
ప్రకృతి నిదురించె నాజోలపాటలోని
తియ్యదేనియ లక్కఱ దీఱ నాని.

29-12-1923

---

# అనార్కలి.

---

అతిలోకసుందరీ, యవనకుమారి,
ఓ మోహమాధురీ, ఓ యనార్కాలి,
ఏలోకో యీవేళ నిహలోక రంభ
వేషంబు ధరియించి వీక్షణంబులకు
నవ్యక్త మధుర దివ్యానంద లాభ
మొనగూర్చెదవు నర్తనోన్మత్త గతుల?
అగ్బరు పాదుషా హర్మ్య మంటపము
అప్సరః పాద యావాంక పల్లవిత
సురనాథ సభపోల్కి వఱలె నీకతన;
అనుభూత పూర్వంబులౌ కోర్కెలెల్ల
మరల మోసెత్తె నా మధుమాస నిశల!
విరఁబూయు రోజాల విఁతనెత్తావి
నాసవ పరిమళ మైక్యంబు నొంది
సంయమి మతినైన సడలించు నిపుడు;
అర్ధ నగ్నాంగియా యచ్చరవోలె
నయన నిర్వృతిఁ గూర్ప నటియించె దార!

ఏ భావనస్పర్శ, మే రసావేశ,
మీ యపూర్వపు రాగ మీమూర్ఛనంబు
రేఁపెనోగాని నీ హృదయ విపంచి
నానంద మదిరాబ్ధి యపర పారమునఁ
గనక సైకతమునఁ గాలు మెట్టెదవు;
గాలిలోఁ దేలిన లీల భూతలము
నడుగు లంటీ యంట కమర నాట్యంబు
నొనరింతు వర రే! నీపూర్వేడు నపుడు
పైకిఁ గ్రిందికిఁ బోవు పాలిండ్లతోడ
సభ్యుల భావంబు స్వర్గమర్త్యముల
నడుమఁ ద్రిమ్మరుచుండు నాడె విధాన;
మంజీర కింకిణీ మధుర రావముల
జంగమ వీణలై చరణముల్ మ్రోసె;
అను నిమేష నవంబులై యంగ భంగు
లలరెఁ గన్నులపండువౌచు నాట్యమున;
సంభ్రమించె మనంబు, చక్కందనాల
పడుచుదానా, నీవు ప్రణయనాట్యంబుఁ
జాలింపుమింక! నాస్వర్గమునఁ దక్క
నింత సంతసమున కిలఁ దావు లేదు;
చానైనఁ దీపె యీసమయంబునందు!

ఓ యనార్కాలి, రాగోజ్జ్వలపాద
పల్లవంబుల నేల మెల్లగా నిడుము,
మాచిత్త చంపకమాల లచ్చోట
స్పర్శ సుఖాపేక్షఁ బడియున్న వవిగో!
ఈ విలాసంబున కింకేది హద్దు?
ఈ నాట్య లహరికి నేది కూలంబు?
ఈ రసోన్మత్తత కేది యంతంబు?
ఈ రాగవీచుల కేది మూర్ఛనము?
మగరూపు దిద్దిన మగజాతి కైనఁ
బ్రేమ రసంబులు పిచ్చిల్లె నన్న
సకల భోగంబులు చవిగొన్న రసికుఁ
డా జహంగీరుని యాత్మ యింకెట్లు
పరవశంబాయెనో భావింపఁ దరమె?
ఆ యనార్కాలి మోహన మూర్తిఁగాంచి,
ఆ కన్య యంగవిన్యాసంబుఁ జూచి,
పాప! మా యువరాజు వ్యంగ్యగర్భముగ
దరహాస మొనరించె; దానికి మాఱు
పేఁతగా ముద్దియ చిఱునవ్వు నవ్వె;
ఆ నవ్వు దర్పణంబందు బింబించి
ప్రక్కన నేఁగు నగ్బరు కంటఁబడియె.

కనుబొమల్ ముడివడెఁ; గను లెఱ్ఱనాయె;
నిరయ ధూమంబట్లు నిట్టూర్పు వెడలె;
ఒడలెల్లఁ గంపించె; నోర్పు నశించె;
నక్బరు పాదుషా యసురయై నిలిచె!
అయ్యయో! చల్లని యంబుద చ్ఛాయ
నటియించు నెమలిపైఁ బెటిలెరా పిడుగు:
నర్తకి పదములు నాట్యంబు మానె;
వీణా నినాదంబు విశ్రాంతి గొనియె;
బానిస లెల్లరు భ్రాంతులై చనిరి;
చంచలా లతిక నిశ్చలత మ్రాన్పడియె;
నందఱి మోముల నడలు గన్పట్టె;
మధుపాన పాత్రికా మర్మరధ్వనులు
శమియించె, సభ్యులు క్షణములో నెటకొ
జాఱిపోయిరి, జహంగీరు నర్తకియు
నక్బరు దప్ప నింకచట లేరెవరు.
కనుఱెప్పపాటులోఁ గమనీయ దృశ్య
మాభీల మరుదేశ మట్లు మార్పడియె.
కుపితుఁడై యక్బరు కొడుకును గాంచి:
'ఓరోరి దుశ్శీల, యో నీతిహీన,
ఆభిజాత్యం బేడ? ఆలోత్తు కూఁతు

పైని మోహం బేడ? బానిస నైతె?
ఎవరురా లష్కరు? ఈ యనార్కాలిఁ
గొంపోయి యిప్పుడే గోరిపెట్టుండు.'
అని యాజ్ఞ పెట్టి రాజరిగె లోపలికి.
విగత చైతన్యుఁడై వెలవెలవాఱి,
యొక్కక్షణంబులో యుగములు గడపి,
రాజాజ్ఞ త్రిప్పనేరక వ్రేలుకఱచి
శోక దావాగ్నిచే శోషిల్లి, మాట
లాడఁ జాలని యా జహాంగీరుఁ గాంచి:
'ఓ జీవితేశ్వరా, యుమ్మలంబేల?
నాప్రాణ మూల్యంబునం గొంటి నీదు
ప్రణయ బంధంబగు బాహు బంధనము;
అద్దాని నామెడయందుఁ గీలింపు'
మనఁగ, జహాంగీరు ఆముద్దులాఁడిఁ
గౌఁగిటిలోఁ జేర్చి కన్నీరు దుడిచి,
నను గులాబీపూల కెనయౌ కపోల
ములు వేఁడియూర్పుల వెలవెలవాఱఁ
గడసారి ముద్దిడి కన్నీరు నించె.
'ఇంకఁ జావైన నా కిష్టమౌఁ బ్రియుఁడ,
సెలవిమ్ము స్వర్గానఁ గలిసికోవచ్చు.'

అని యారడించుచు నా యనార్కలి
విడరాని కౌఁగిలి విడిపించులోన,
'రమ్ము, తడయంబోకు, రాజాజ్ఞ యయ్యె'
నను చొక్క భటుఁడు ప్రేమసి వెంటనడిచె;
యువరాజు హృదయంబు, యువతి దేహంబు
నొక్క గోరీయందె యునికి గైకొనియె.

ఏమి యీగారడి! ఏమి యీమాయ!
ఏమి సుఖస్వప్న! మేమి మేల్కొలుపు!
పెదవి పాత్రలమధ్య విశ్వ విప్లవము
జరుగు నవకాశంబు! సంసారమింక
గటికయుం బట్టని కాటిచాడేన?
సన్న్యసి, నీకొక్క క్షణము జయంబు!

ఓయి యగ్బరుషాహి, ఓకఠోరాత్మ,
ప్రణయంబునకుఁ జావె ప్రతిఫలంబేని
అవనియెల్ల శ్మశానమట్లు మార్పడదె?
నీతికిఁ జిహ్నంబు నిర్దయత్వంబె?
మానవ తత్వంబు మఱచిపోయితివా?

ఓ యనార్కలి, మాయుల్లంబునందు
నీకాలి గుర్తుల రేక లగపట్టు;
ఈర్ష్యామయంబైన యీలోకమందు

నిలువ నీడైనను నీకు లేదమ్మ!
కల్పసుమంబవై గంగాతరంగ
శీతల శీకరాసేచనం బొంది
చల్లగా బ్రతుకు నీ సౌఖ్యంబుమాన్పి
ఏ పాడుగాలి నిన్నీ వల్లకాటి
దుమ్ములోఁ బడవైచె? తుద కెండవాడి
ధారుణీ గర్భగంధంబు సొంపెక్క-
నీదు నెత్తావులు నింపుచున్నావె!
నీ రమ్యలాస్యంబు, నీ సోయగంబు
గాంచ మర్త్యులకు యోగ్యతయుండఁ బోదు;
నక్షత్రమండల నాట్యరంగములఁ
జంచలా లతికల సాహచర్యమునఁ
గాన్పించుమా నీ యగణ్య సత్తనము!
పన్నీరు పూఁబోదల్ ప్రక్కల బలిసి
నీ గోరిపైఁ జల్లు నిత్యమ్ముఁబూలు;
కవులు కన్నీటిబిందువుల నీ గోరిఁ
దరతరంబులనుండి తడుపు చున్నారు.
ఎంద ఱెందఱో పాంథు లెన్నెన్నిమార్లో
నిట్టూర్పు సెగల నెండిన పూలుచల్లి
గౌరవించిరి నీదు గోరీని సకియ!

ఓ తెల్గు యాత్రికా, యొక్కమాత్రైనఁ
పాంచాల భూమికిఁ బయనింతువేని,
లాహోరు నగరవిలాసంబుఁ గాంచ
నరిగెదవేని, నీ వా యనార్కలి
ధన్యసమాధిని దర్శించి రమ్మ! ౧౪౧

---

# వానాకాలపు పల్లీజీవితము.

---

శ్రావణనీలమేఘముల చల్లనినీడలఁ బెంపు నొంది, క్రొం
దావులఁ జల్లుచుం బొలముదాపునఁ బూచెను గేతకంబు; లే
తావులనైన యౌవనముఁ దాల్చె వసుంధర పైరుపచ్చలన్;
ఆవులు కండపట్టెఁ దనివారఁగఁ బచ్చిక మేసి బీళులన్.

కాలుమెయిళ్ళపైన హరికార్ముక రేఖలు స్వర్గపట్టణ
ద్వారపుఁ దోరణంబు సరిదాఁక, బలాకలు మాలగట్టి యా
దారినె సంచరింప, నిశితత్వముఁ బాసిన సూర్యరశ్మి లేఁ
బైరుల సేవఁజేయఁ గనుపండువుఁ గొల్పు దినంబు లయ్యెడన్.

ప్రకృతి లీలావిలాస కావ్యంబునందు
రసవదధ్యాయమేమొ వర్షంపు ఋతువు!
కానిచోఁ దదధ్యేతలౌ కర్షకులకు
నెటులఁ బరనిర్వృతిం గూర్చ నింపెలర్చు?

పనిపాటుల్ ముగిసెం గదా, యిఁకను లేఁబ్రాయంపు టిల్లాలితో
దనపైఁ బ్రక్కలఁ ద్రొక్కిమూఁగు పసిసంతానంబుతో వర్షపుల్
దివముల్ తిన్నగఁ బుచ్చవచ్చునను నుద్దేశమ్మునం గాఁపు గ
న్గొనుచుండుం దన పైరుచేల శ్రీమకున్జోడైన సంతృప్తితోన్.

కలకల నవ్వుచుం గలుపు గంటలు దీయుచుఁ బాట పాడుచుం
బొలములఁ జుక్క గుంపటులఁ బోడిమిఁ జూపెడి పల్లెటూరితో
య్యాలుల నిసర్గ రమ్య దరహాస విలోకన చేష్టలందు ని
ష్కలుషపు గ్రామ్యజీవనపుఁగమ్మఁదనంబు బళే! గుబుల్ కొనున్

ఎన్ని యిక్కటులుండిన, నేమియైనఁ,
గుడువఁ గట్టను నొకవేళఁ గొదవయైనఁ
బ్రకృతి సామీప్య జీవన భాగ్యమొకటె
యున్న కడగండ్ల మఱపించు నూఱడింపు.

అక్టోబరు 1924

---

# కవిసంశయావస్థ.

---

కవితా, వింతయానవచ్చె నీదగు నుపేక్షాభావముం జూడ, హే
తువు లేవేనియు లేక నాపయి నసంతుష్టిం బ్రదర్శించి క
న్గవకుం గన్పడనైనఁ గన్పడవు; సఖ్యం బిట్లు మూన్నాళ్ళ భా
గవతంబయ్యెనె? తెచ్చికోలలక వేడ్కల్ మీకు సామాన్యముల్

వలపుఁ బరీక్ష సేయ నిటువంటి విరాగముఁబూనినావొ? నీ
చెలిమియె సన్నగిల్లెనొ? విశేషత నాయెడ నంతరించెనో?
పిలువని పేరఁటంబునకు వేమఱుఁబోఁ గడుఁ జుల్కనంచు నో
చెలియ, బిగింపుఁజూపెదవు? చెల్లెను వత్సర మింతమట్టుకున్.

నిమిషములోన నీమొగము నీడగఁ గన్నులఁగట్టి 'ఏమిది?' యం
చమితపుటాస నే దెసలనారయ, మాయలమారివౌచు వే
గమె కనుచూపు దాఁటెదవు! క్రౌర్యము నీకు వినోదమేని నా
కమలిన సున్నితంపుటెదఁ గమ్మగ విందొనరింపు మంగనా.

వరిచేలం గడసంజలందుఁ దిరుగన్ వాంఛింతు నేగాని, నా
సరసన్ నీవును లేమి, మున్నటుల నచ్చంబైన యానందముం
బొరయంజాలకపోతి, జీవితమె దుర్భాగ్యంబుగాఁ దోఁచె; బం
గరు స్వప్నంబు తటాలునన్ మఱిఁగె; రెక్కల్ భారమై క్రుంగెడిన్

ఇట్టి దాఁగిలిమూఁతల నెంత దనుక
నన్ను వంచింప నెంచెదో చిన్నదాన?
రసపిపాసల నడఁచు నీరమ్యమూర్తి
మెఱుపువలెనైనఁ జూపించి మఱఁగి పొమ్మ.

జలదపథంబునం దిరుగు చక్కని చుక్కవె యయ్యు నాపయిం
గల ప్రణయంబునం బసిఁడిగద్దియ డిగ్గి పొలానఁ బచ్చ కం
చెలకడఁ గూరుచుంటివి కృషీవలబాలిక యట్లు; గడ్డిపూఁ
దలిరుల కానుకతోఁ బ్రథమదర్శన ముత్సవమయ్యెఁ దొయ్యలీ.

ఆ దినం బాది యిరువురి యాత్మలందు
వలపుఁదీవియ లల్లెఁ; బూవులును బూచె;
ఫలము లట్టుల సంతానభాగ్య మబ్బె;
నింతకాలాని కేల నీ కిట్టి యలుక?
నీవు రాణివె యౌదువు; నేను బిచ్చ
మెత్తు పిచ్చిబికారినె; యిద్దఱకును
దారతమ్యంబు కొండంత; తరుణి యింత
పోల్పలేనైతి; నిను నమ్మి మోసపోతి.

'కడకటి వీడుకోలె' మన కౌఁగిలిమొత్తుల ముద్దులాటకుం
గడకటి వీడుకో లగుటకాదు గదా! యదియేమొ నీవు నన్
విడుతువటన్న సంశయము వేముఱు జీవిత వీణయందు కీ
ల్సడలిన తంత్రియట్లు వికలంబుగఁ బల్కు నపస్వరంబులన్.

## క వి త

ఓయీ పచ్చపొలాల కాఁప, యిఁక నీయుల్లంబె శోధింపుమా,
హేయంబౌ యపరాధకల్మషము నాకే గట్టయత్నింతు వో
హో! యీ నైపుణిచాలుఁజాలు! నట నీయుత్సంగ సౌఖ్యంబు నెం
తో యాసించెడి చిత్రలేఖ విడి నాతోఁ డేల నీకిప్పుడున్?

నేఁటికైనను నాయునికి నీకుఁ దలఁపు
వచ్చె, నది కొంతభాగ్యంబు మెచ్చుకొఁడ,
బహుళ సంతానవతియైన భార్యవలపు
సాటిగాదయ్యెఁ గ్రొం దగులాటమునకు!

ప్రేమసూత్రాలఁ ద్రెంపెడి బిగివి సడలి,
బిచ్చకత్తియపోల్కి నీ పిలుపులేక
వచ్చి నిలిచితి ముంగిట, నిచ్చకాల
కైనఁ దలయెత్తిచూడవు; వానినైతె?

చిత్రలేఖకు నీ కెడసేయలేక
యర్హశిక్షను గొంటి స్వయంకృతాప
రాధమున, కింక నాగుండె రాయిఁజేసి
వెడలిపోయెదఁ, గడపటి వీడుకోలు!

క వి

నిలునిలు మోసఖీ, మనసు నీఅయిపోయె; నవజ్ఞగాదు; నీ
వలె నను జేరవచ్చె బహువర్ణ సుశోభిత చిత్రలేఖ; నే
వలదనఁ జాలనైతి; నెలప్రాయము మోసముఁ జేసె; నిక్కముం
దెలసిన నీవునుం జెలినిఁ దియ్యనికౌఁగిటఁ జేర్తు వింతకున్.

దేని నకార్యమంచుఁ గడుదీనత వాకొనుచుంటివో యదే
చానరో, సంతసంబునకు సాధనమౌను; సపత్నియందు లోఁ
బూనకు మచ్చరంబు; నదెపో నిను గొల్చెడి తోడఁబుట్టు; వా
మానిని సాహచర్యమున మంజుల వౌదువు నీవు నింకన్.

ఇద్దఱును సీటికాలువ యొద్ద నిలిచి
మొగముపోలిక లెల్లను బోల్చుకొందు;
అక్కసెల్లియ లొకటైన యపుడు నన్ను
నొక్కకంటైనఁ గనిపెట్టి యుందురు గద!

అతివ, పొరపాట్ల ప్రహసనం బాడినాము,
భరతవాక్యంబుగాఁ బెట్టు వలపుముద్దు;
మిమ్ము నిరువురిఁ గూడి సుఖమ్ముగాఁగఁ
గడచు జీవితశేషమ్ము కల విధాన.

చాలకాలమయ్యె సఖియ, నీ కెంగేల
నాసవంబుఁ బెదవులానఁ బెట్టి;
పానపాత్రమందు భవవిషాదంబును
ముంచి కొంతసేపు ముక్తిగందు.

15-10-1924





# భగ్న
# హృదయము.

1925—30.

I some times hold it half a sin
    To put in words the grief I feel;
    For words, like Nature, half reveal
    And half conceal the Soul within.

But, for the unquiet heart and brain,
    A use in measured language lies:
    The sad mechanic exercise,
    Like dull narcotics, numbing pain.

In words like deeds, I'll wrap me o'er,
    Like coarsest clothes against the cold;
    But the large grief which these enfold
    Is given in outline, and no more.

—*In memorium.*



# భగ్నహృదయము.



## ప్రియావియోగము.



జలధరమాలికా మలినశయ్యను మిత్త్రుఁడు గూలె; నేడ్పులా
ర్పులఁ బులుఁగుల్ కులాయముల పొంతల కేఁగక కొమ్మలెక్కి ము
క్కులఁ దడిలేకయూర్చు; వడఁగూరినపోలికఁ బూలతీఁగలుం
దలలనువాంచు; గాలి వెతతాఁకున మూల్గు సహానుభూతితోన్.

మును గనుపండువై తనరు మోహనవస్తువులెల్ల వెల్లఁబో
యినగతి బాష్పముల్ దొరఁగ నేడ్చుచు నీరవభాషఁ బల్కెడిన్
'గనుఁగొన, మాకునున్ నెగులుగల్గెడి నీకు ప్రియావియోగ సం
జనిత దురంతతాపమున, శాంతిలుమోయి' యటన్నమాటలన్.

ఇరువురి చిత్తఖండముల నేకముచేసిన ప్రాణకాంత యం
తర విరహాబ్ధిపంకమున నాటుకొనన్ నను ముంచిపోయెఁ; గ్రొ
మ్మెఱ ధరఁ జేరరా దనెడుమాట నెఱింగియు నేమొకాని, నా
తరుణ మనంబు స్వాప్నికపథంబునఁ బోవును ప్రేమవాసనన్.

కన్నులువిప్పి చూచితిని గాంతశవంబును, జేతితోడ నే
యన్నులమిన్న కాష్ఠమున కగ్గి రగిల్చితి, నింతచేసియుం,
జన్న తెఱంగెఱింగియును సంశయమొందును బాడుబుద్ధి! యా
పన్నుల చిత్తవిభ్రమపుఁబాటులు నిట్టివియేమొ యెల్లెడన్!

కలలోనైనఁ దలంపలేదుగద యో కల్యాణి, నీ కింతలో
పల నూఱేఁడులు నిండుసంచు, విధి దుర్వారప్రభావంబు మ
ర్త్యులయత్నంబు నధఃకరించుగద! వైద్యుల్ దివ్యసంజీవిఁ జెం
బులఁ ద్రావించియుఁ బూర్వదుష్కృతఫలంబుల్ మార్పలేరైరిగా!

ఇరువదియేనువత్సరము లేఁగకపూర్వమె, యౌవనంపు బం
గరు చషకంబులో నురుగుగ్రమ్మెడి యాసవ మింకకుండఁగన్,
సరస మనోనురాగ తృష శాంతిలకుండనె, జీవితంపు మా
ధురిఁ దనివార నానకయె తొయ్యలి, పోయితె కాలదుర్గతిన్!

పది పదునొండు వర్షములపాటు నిరంతర దుగ్ధకుల్యయై
హృదయతటంబు లొత్తి ప్రవహించిన ప్రేమరసంబు లింక, నీ
యెదనున సార్థవాహము జలాశయహీన మరుప్రదేశ దు
ష్పథమున నెట్లు నే నడుపఁజాలుదు నిర్దయ దీర్ఘయామినిన్.

దర్పణంబున బింబంబు దనరినట్లు,
నీసురూపంబు మదిలోన నిలిచియుండు!
ఇదిగో! నెచ్చెలి, యని చేతు లెదురుచాఁప,
గఠినసత్యంబు నామోముఁగాంచి నవ్వు!
గాజులును మెట్టె లెవరివో ఘల్లుమనఁగఁ,
దెలియకుండనె కన్నులు తిరిగిచూచు;
నంతదారుణ యాథార్థ్య మాత్మ మెఱవ,
గుండె జల్లను, నిట్టూర్పు మెండుకొనును.
ఇరువురకుఁ దప్ప నితరుల కెఱుఁగరాని,
మన రహస్యంబు లెవరితో ననుదు నింక?
హృదయము మంజూష నాచేత నిడి యదేల
తాళపుంజెవి నీయొడి దాఁచినావు?

మఱి పెటుగల్లు నీ నగవు మాటలు నీ దరహాస చంద్రికాంకురములు,వచ్చిరాని మృదుకోపము,చామనచాయరూపముల్, సరసత, మన్మనోనుసరణత్వము, నిర్భరమైన ప్రేమయున్, మురిపెపుఁజూపుఁగావ్యములు, ముద్దులపేటికలౌ కపోలముల్. పరలోకంబున కేఁగువేళఁ బ్రణయవ్యామోహ మొక్కండె నీ పరమై పోయె నటంచు నుంటిఁ; దెలిసెం బ్రచ్ఛన్నసత్యంబు; నీ కరముల్ నాహృదయంబుఁ, గోరికల,సౌఖ్యంబున్,భవిష్యన్మనోహర గార్హస్థ్య సుజీవితం బడుగుబాయన్ లాగి కొంపోయెఁగా

పరలోకంపుఁ గవాటముల్ దెఱచి నాపై నొక్కమాఱైన నీ
సరసాలోల కటాక్షముల్ నెఱపుమా, సర్వంబు నీ కాత్మగో
చరమా; నన్ గురుతింపఁజాలుదువె యో చానా, నిరంతంబు నీ
కొఱకుం బిచ్చిబికారినై తిరిగెదన్ ఘూర్ణిల్లు చిత్తంబుతోన్.
తెలివి నశించినప్పు డొక తేప నినుం గను కోర్కెతోడ నే
వెలుపల కేఁగి, కాఁటిదరి వెచ్చగనూర్చుచుఁ గూరుచుండి నీ
లలిత మనోహరాకృతి నిలాతలమందునఁ బాఱ జూడ బో
గ్గుల మసి భగ్నశల్యములు గోచరమయ్యె నిఁకేమి చెప్పుదున్!
స్థిర మిహాలోక, మీతనువు జీర్ణముగాదు, సమస్తసౌఖ్యముల్
మఱగవటంచు యౌవనపుమత్తున నుండిన నాకు నెంతలోఁ
గఱపితి వీవు: 'సర్వమును గాలవశంబున నంతరించు, న
శ్వర మగు నీప్రపంచకము స్వప్నమయం' బనుసత్య మంగనా!
కవితా కల్పిత లోకమందు మురళీగానంబు గావించుచున్
బవలున్ రేయు సుఖంబుగా నెగురు నాపక్షంబులం దుంచి న
న్నవలీలన్ ధరణీతలంబునకుఁ ద్రోయన్ మేలఁటే కాంత? క
న్గవమోడ్తుం, దిలకింపఁజాల నిలలోఁ గన్పట్టు యాథార్థ్యమున్!

హృదయమును దొంగిలించిన రీతిగా నె
స్మృతిని సైతంబు నీవు హరింపు మతివ,
అంత సుఖదుఃఖములు భేద మరయరాక,
భావశూన్యత లీనమై పట్టువిడచు!

చేతఁ జాఱిన గాజుగిన్నె మరలం జేఁజిక్కునే? వ్యర్థ చిం
తా తాపంబున లాభమేమని ప్రబోధజ్ఞాత తత్త్వుండ నై
చేతఁ గ్రంథముఁ బూని యక్షరములం జిత్తంబు లంకింతు; నా
చేతం గాదొకవాక్యమైనఁ జదువం, జిత్రంబుపో తత్కథల్!

అనివార్యంబగు దైవనిర్ణయము; దేహం బొక్కఁడే పంచభూ
త విలీనంబగు; నాత్మకుఁ మరణబాధల్ లేవు; లోకంబునఁ
జననంబుఁ మృతి నైజమంచు నెటులో స్వాంతంబుఁజిక్కించుకో
ననయంబుఁ యతినింతుఁ గాల గురుపాదాబ్జంబులే దిక్కగఁ

వేఁగు మాంసంబురీతి నావిఘ్నవాఱు
నుల్లమునఁ దత్త్వబోధ కాలూనఁ గలదె?
యూరడింపులు పుండుపై నుప్పుగల్లు;
ఇంక నేకాంతమే నాకు నేడుగడయ!

12-7-1925

---

# స్మృతి కణము.

---

కనులు మూసినఁ దెఱచినఁ గానుపింతు
వింట నడయాడినట్టులె యిందువదన!
సంతత ధ్యానలీనమౌ స్వాంతమునకు
వెలుఁగు జీఁకట్ల భేదంబు దొలఁగునేమొ!

తెల్లవాఱినఁ బూదండఁ దీసివైవఁ
దరుణి వేణిక నిలుచు నెత్తావి పోల్కి,
మర్త్యమౌ నీస్వరూపము మాటువడియు
సార వర్ణాంకిత స్మృతి సమసిపోదు.

చావు బ్రతుకులమధ్య విశాలమైన
కలలవంతెన గట్టితి తలిరుఁబోఁణి,
కార్యలంపట దినమునకన్నఁ బ్రకృతి
ముసుఁగుఁ దీసెడి రాత్రి నాకొసఁగుఁ బ్రియము.

పవలు రేయికిఁగల భేదబాంధవములె,
యిహపరంబులయందు నూహింపఁగలము;
రెంటి కూడలియగు సంజ, మింటికొనల
విమలరాగంబు వెదజల్లు, వెఱపునిడదు.

మే 1926.

# శిశువియోగము.

---

కాలచక్రంబు మును శీఘ్రగామివోలె
నంచు జాడలు గనరాక యరుగుచుండె,
నేఁడు ప్రియురాలి పోకకు గోడుగుడుచు
కతన, నిమిషంబు యుగముగాఁ గడచు నాకు.

పూవురాలిన జిఱుపిందె పూపయైన
నంటుకొనియుండు నన్న పేరాస నుంటి;
మృత్యునిశ్వాస పవనంబు రేఁగిసుడిసి
భావిఫలమును గసుగందఁ బైకివిసరె.

చెట్టువోయిన విత్తైనఁ జిక్కె నన్న
యాసయుంగూడ నేఁటితో నంతరించె;
నకట! నా పూపుదోఁటకాడాయె నోయి
తోఁటమాలి వసంతుఁడా, తొలఁగిపొమ్ము!

పూవుంగిన్నెల దేనెలాని, లతికాపుంజంబు లుయ్యాలలకుం
దావుల్ గాఁగ, నిరంతరంబు సుఖయాత్రల్ సేయు తేఁటుల్ ననుఁ
భావాభ్రింకషపక్షుఁగాంచి మదిలో భావించు నాత్మీయ లీ
లా వాల్లభ్యముఁ గ్రిందుసేయు నితఁడేలా వచ్చెనం చెప్పుడుఁ.

ఇపుడన్నన్ విధి వేఁటకాని వలలో నేకాకినై చిక్కి, పూ
ర్వపుటుత్సాహముగోలుపోయి, గఱులున్ భగ్నంబులై చిందఁగం
గృపతో వీడిన, నీడ సంస్థితుఁడనై రేయుంబవల్ చీఁకటిన్
అపనోదించు తలంపుతో బ్రదుకు నాయాధిక్య మింకేటికిన్?

చిత్తతాపంబుఁ బాపుకోఁ జేలగట్ల
కరిగి కూర్చుండ, మూక సహానుభూతిఁ
బైరు తలవంచు భారంబుఁ బాచికొన్న
ప్రాణసఖులట్లు; కవులకు బ్రకృతితోడు!

అపర దిక్కాంత సైతము నస్తమించు
నరుణ బింబంబుతోఁ గన్ను లవియఁజేయుఁ,
దనదు పూజారి యిక్కట్లు తలఁచి కుంద
నెఱ్ఱ పుండాయెనో యేమొ హృదయమనఁగ.

ఈ యలుకన్ ననుం బెనచు నే గుదిబందము లేదు; ప్రేమ యా
దాయము సన్నగిల్లె; నది దాఁటుట కింకఁ దయారు; రేవునం
బాయక వేచి యుండు నుడుపంబులు వచ్చెడిదారిఁ జూచుచుం
జేయునదేమి? యా పడవ శీఘ్రమువచ్చునో! యాలసించునో!

మునుపటిరీతిఁ బ్రత్యుషము మోహనవేషము దాల్చి శయ్యపైఁ
గనుగవమోడ్చియున్ననుగాంచి 'సఖా' యని మేలుకొల్పు; మో
మునఁ దన మోము నాన్చి సుఖముం జిలికించెడి ముద్దువెట్టు; నై
నను బరిదగ్ధసారము మనంబు ముదం బెటు లాశ్రయించెడిన్?

ఎంతకాలంబు చీఁకటియింటియందుఁ
గోపురం బుంట? యడుగంటఁ గాలిపోయి
స్నేహహీనంబుగా వట్టి శెమ్మె నిలిచె,
నెవరు వెలిఁగింతురో? తైల మేదదింక!

యౌవన నవ్య సౌరభ విహంగ మనాది కులాయవీథికిం
బోవ నుపక్రమించెఁ జెలిపోయిన దారి, శరీర వల్లికిన్
రావిఁక రెండుమాఱులు, తిరంబు, వసంత శుభోదయంబు; లిం
కా వివరంబులేల? గతమయ్యె సుఖంబు, శ్రమంబె దక్కెడిన్!

పొలములనుండి రాఁగనె పరిపూర్ణ కళా శశిబింబమట్లు వా
కిలి కడనిల్చి, సిగ్గుమెయిఁ గ్రీగనులం దిలకించుచున్ మనో
విలసన మానసంబున స్రవించెడినోయన నవ్వు స్వాగతం
బుల నుపచర్యసల్పు చెలి వోవ మశంబుగ మాఱె గేహమున్.

పూవులఁ బిందెలన్ లతలఁ బుప్పొడితావులఁ నందమైన నా
యౌవన నందనంబిటు ప్రియార్ద్రవియోగ దురంత తాప చిం
తావిల కీలలందు నుసియయ్యెను; ఆ మసి ప్రేమదేవతా
జీవ విహీన మూర్తిపయిఁ జల్లెముగల్లె సమాధి పోలికన్.

ఉష్మ లోపింప మిగతవి యుండిగూడఁ
జవియు సారంబు కోఱవడు సాదకమున;
మనసుగలసిన యిల్లాలు మఱఁగిపోవ
నన్ని యుండియు లేనట్టులయ్యె నాకు!

హృదయపు వల్లకాటి రసహీనత దేహమునందె గాక నా
మృదుల కవిత్వపుఁ లతల మీఁదికి సైతము నల్లునంచు నా
కొదవెడి సంశయంబు; కృతియుఁ సతియట్టుల జంటవాసినఁ
బ్రిదిమికి నువ్వునీళ్ళువుచుఁ బాద పరాగము రాల్చిపోయెదఁ.

విరహపు దుమ్ములోఁ బొరలి వెఱ్ఱిదనాల బికారినై వ్యథా
భర కబళంబులఁ హృదయపాత్ర భుజించుచు ప్రేమవాకిటఁ
జిరముగ వేచి యీ కఠిన జీవితముఁ గడుపంగనేల? యం
బరచర కామినీ ప్రణయ మందిరముల్ కఱవాయె నేమొకో!

ఆసవ మింకి క్రొన్నురుఁగు లారిన కొంచెపు మట్టిపాత్రలో
నాసలు నింపి, క్రొత్తఁదన మంటుకొనం బునరుద్ధరించు నా
యాస మదేల నీకు; ప్రభువా? యిఁక నన్నొక భగ్న పాత్రలఁ
వేసెడి మూలలో విసరివేయుము భుక్తము సంస్మరింపఁగన్.

24-9-1926.

# కవితాచితి.

---

నాలుక త్రుప్పుపట్టె; నొకనాఁడయినం జెవి కింపుగొల్పు కా
వ్యాలపనం బొనర్చు తల పంకుర మెత్తదు; వ్రాయఁబూనినం
దేలిక కాలిగుఱ్ఱపు గతిన్ మఱపించెడు భావ మిప్పు డ
బ్బె! లివసచ్చి ముందడుగు పెట్టదు చాకలియెల్లి బేపినాన్.

రమణీయంబగు నాట్యరంగము నటీరాజ్యంబుగా మాఱె యం
దము నానందముఁ గూర్పఁ, బందిరి హఠాద్దగ్ధంబుగాఁ జూచి ని
ష్క్రమణద్వారముఁ గాంచలేక పొగలో గగ్గోలుగాఁ బర్వ పి
చ్చిమనుష్యుల్ గతి భావముల్ దిరుగు నాచిత్తంబునన్ మొత్తమై.

ఇదివఱకెన్నఁడైన నుదయించిన యంతనె భావపంక్తులన్
బదుఁడని పంపుచుంటిని బ్రపంచపు సంతకు; నిప్పుడన్న నా
చిదగోద కాఱుచీఁకటులఁ జీఁకగు నాశ్రియ లుబ్ధభావముల్
మెదలవు నీరుకొండలఁ; దమిస్రమె స్వర్గము భుక్తిసారతన్.

కలమును కాగితంబు తనఖాపడె! 'గుడ్బయి!' రామిరెడ్డి, నీ
పలుకులు వీనులార విని వత్సరముల్ సనె; నంత చెల్లె! చి
ట్టెలుక విధాన దాఁగికొని యేమొనరించెదవోయి యంచు నన్
బలుమఱు హెచ్చరించు హితవర్యుల కేమని విన్నవించెదన్.

కలకల ముగ్ధమంజుల వికస్వర సుస్వర గీతికాగతిన్
దోలఁకు కవిత్వనిర్ఝరము నూత్న పథంబులఁ ద్రొక్కఁగాని, శీ
తల హిమరాశి పేరి జలధారలు నిర్గతిమాని గడ్డలై
యలమటవేచియుండుఁ దరుణార్క- కరాంకుర హాసరోచికిన్.

కమనీయంబగు వింతవస్తువులతోఁ గాంతిల్లు నా గేహరా
జము మధ్యన్ వెలుఁగొందు దివ్వెగనువై సర్వంబు పెంజీఁకటిన్
సమసెన్; నే నిఁకఁ గొన్నినా ళ్ళతిథిపూజాసేవకుం జాలనం
చు మదిందోఁచెడి; దీపమెప్పు డనర్చన్ శోభిల్లునో క్రిమ్మఱన్

పలుకగు కెంపురాల పరిపాటి నగందగు నాసవంబు నం
చులు పొరలంగ నింపి సరసుల్ చవిచూడఁగఁ బానశాలలో
నిలుపుదుఁ గాచపాత్రికల; నేఁ డయొ! యన్నియు బాష్పవారిబిం
దులఁ బరిపూర్ణమై రుచికి దూరమునై వెతఁగూర్ప వేరికిన్?
కనఁగ మనోహరంబులగు కల్యకు సంధ్యకుమధ్యఁ బొల్పు మో
హన భువనంబు నాదు హృదయమూర్తి మలీమస వర్ణవర్ణికన్
బెనమటు పూసిపూసి కడునెక్కసముం బొనరింపఁగోర; నన్
బెనఁగొని పిప్పిసేయు పరివేదనతోఁ బనియే మొకళ్ళకున్?

శిరము నిశీథ తారకల శీతలకాంతి సుఖంబుఁ గోరి యం
బర చరవాసనన్ మరలఁ బైకెగ నిక్కునుగానిఁ, పాదముల్
మరగొని కర్దమహ్రద నిమగ్నములౌట వృథాప్రయత్న ము
ష్కరతఁ గలంచుచున్ మకరసంభృతమౌ కలభంబు పోలికన్.

కడచెను మూఁడువర్షములు కాంతవియోగము సంభవించి; యా
పిడుగు కండిది తాఁకులకు బీటలు వ్రయ్యంబ వాఱినట్టి నా
యెడఁదను బూర్వరూపమున నేరిచి కూరుచు మంత్రికర్త యె
ప్పుడు పొడకట్టునో యమృతపూర్ణ కళోజ్జ్వల పాత్రహస్తయై.

రూపములేని సంస్కృతికి రూఢిగ నల్లుకొనంగలేక దా
దాపుగఁ బ్రేమవల్లి కృశతంగని దగ్గఱనున్న కొమ్మనే
ప్రాపుగఁ జేసికోఁ దలఁచి ప్రాకెడినారా! గతానుభూతముల్
తీపులె యయ్యు మానవహృదిన్ సతతంబును బాదిసేయునే?

భావము మాఱినంతనె ప్రపంచము మాఱును; బూర్వమున్న సం
ధ్యా వివిధాభ్రవర్ణముల తట్టుకుఁ బోవదు బుద్ధి; కోకిలా
రావము లింపు నింపవు; నిరర్థక దాస్యములయ్యె యామినీ
సేవలు; రమ్యమా ప్రకృతి ఛీ! యనిపించు విరక్తి పెంపునన్.

ఇట్టి మాటల నింకెట్టు లించుకైన
నవురు వెన్నెల కవిత మనంగ నేర్చు?
నదియుఁ గాలావధింగాంచి యరిగెనేని
దాని చితిపైన నిర్మింతుఁ దాజమహాలు!

మే 1927

# మనోవిప్లవము.

సృష్టి చిత్రంబునకు మూలజీవమైన
జనన మరణ క్రమంబుఁ జింతన మొనర్చి
యంతుగనలేక యత్నంబునాఁపుకొంటి;
దేవ, పరమేశ, యున్నావా? లేవా? చెపుమ!

చాల ప్రసిద్ధ శిల్పివని చాటుచునుండును బంశితాళి; నీ
లీల లనంతిముల్; దెలియ లేము రహస్య; మదేలొకో సమూ
నాలను వ్రాసి వ్రాసి కరుణంబును దృష్టియులేక చింపె; దీ
కీ తెలుఁగంగ రాని కృతికిఁ లభియించున దేమి దెల్పుమా?

కొందఱు సృష్టి నీదయని కొందఱు కర్మఫలంబటంచు నెం
దెందఱో వ్రాసినార లది యెట్లగు? కర్తవు నీవయేని నీ
చందము దూష్యమౌను; మఱి సర్వము కర్మఫలంబటన్న నీ
వెందు కజాగళ స్తనము వీ యపదూఱు వహింప దైవమా?

తీవలునాటి, పాదులకుఁ దీయక నీరముపోసి, యామని
బూవులు పూవనున్న తఱి మూలములం దెకలించివైచు నీ
భావ మదేమి? యీముడిని బండితులైన సడల్ప లేరు; కా
లావధి డగ్గఱించు! వృథ యయ్యెను జీవిత ముత్తచర్చలన్.

మనమున కందరాని యను మానపుఁ జిక్కునువిప్పఁయత్నముల్
దినదినముం బొనర్చి కడతీరము గానక బమ్మరింపఁజా
లను; నెటులైన రాఁగల ఫలంబులు, కాఁగల మంచిచెడ్డలున్
బెనఁగొని వచ్చు నొక్కటిగ, వీడుఁ దమంత నయాచితంబుగన్.

కర్మఫలమైన దైవాధికార మైన
నింక నేమైనఁ గానిమ్ము; సంకటములు
పోకమానవు, సుఖములు రాకపోవు;
వానియెడల తాటస్థ్యంబు నూనియుండు.

---

# కవియలౌకికత.

---

ఓయి కవీశ, భావ రుచిరోజ్జ్వల దృశ్యములన్ సృజించి త
చ్ఛాయలు లౌకికంబులగు సత్యములంచు భ్రమించి, నమ్మి, నీ
ప్రాయము జీవితంబు నిటుపాడొనరించెద; వొక్కనాఁడు నిన్
బాయక మేలుకొల్పు విధి భగ్నమనోరథ తోదనంబునన్.

భావన నీకుశత్రువు; విభావరి దాఁటకె మున్నె, సూక్ష్మతా
రావళి కాంతిఁ గాంచి గగనాంచలమందు మనోజ్ఞ వర్ణ రే
ఖా వలితేంద్రచాపమును గల్పనసేతువు; గుడ్లగూబ ఘూ
ఘూవనికాయ, నుల్కపడి కాంతువు నిక్కపు టంధకారమున్.

కావ్యరచనలందుఁ గవివి కావచ్చును;
దివ్యలోకమందుఁ దిరుగ వచ్చుఁ;
గ్రామ్య వస్తువులను గవిదృష్టిఁ జూడకు;
గట్టినేలఁ దడవి కాలు మెట్టు.
కంటి కందని యాదర్శకంబుఁ గోరి
యకట! దుఃఖాంతనాటక మాడెదీవు!
వెనుక ఫలమేమి?—మానవద్వేషవహ్ని!
రక్తసిక్త హస్తముల నిష్కృతి నీకు!

21-2-1928.

---

# నిస్సహాయత.

---

చెలిచనినంత నాయెడఁద చిక్కము, లుబ్ధుని ముష్టిరూకలన్
బలముగఁ బట్టియుంచుగతిఁ బల్లవకోమలమైన ప్రేమఁ జి
క్కులనిడె; నిచ్చిపుచ్చుకొనఁ గూడని యీదురవస్థ కెన్ని నా
ళ్ళులు నెల లేడులోర్చుకొని లోఁగుదు, మ్రింగుదులోనదుఃఖమున్!

కోలఁదికి మించు భారమగు గోనెను గాడిదమీఁద వైచి దో
త్రిలఁ బడి కాలుపూనుకొలఁదిన్ గొరడా మొదలించు నిర్దయున్
దలఁపున కీడ్చె దైవకృతి; తన్నును గార్దభమేని నోర్చుకో
నలవి దొలంగ; మానవునకా తుదిమార్గము గూడ లేదుగా!

2-7-1928

---

# ప్రణయ బలి.

---

బచ్చెన పండుఁ గీర మటు భ్రాంతిమెయిం గని పెట్టుకొన్న నా
పిచ్చితనంబు కొందఱకు వేడ్కయు, నా కనవాప్తిలజ్జయుం,
బచ్చని కోర్కెకుం దెవులు, బంధుహితాళికి జాలిఁ గూర్చి పై
పెచ్చుగఁ దీఱరాని వెతవెట్టెనో జీవితశేష మంతయున్.

రాజరాజ హృద్దేశ విభ్రాజమాన
కమ్రముక్తాఫలము శుక్తి గనును గాని
మూల్య మెఱుఁగ ద దెంతటి మూఢమతమొ;
వింత యొనగూర్చెఁ బ్రారబ్ధ విలసనంబు.

ఈఁక లెదిగినఁ గనుదాఁటి యెగురు నంచు
ఱెక్కలను ద్రుంచెఁ బిల్లకు నొక్క పులుఁగు;
ఇదియె వాత్సల్య దృష్టాంతమేని యింక
స్వార్థపరతకు ముద్దుపేర రబ్బినట్లు!

అతివ, యవివేక దూషితంబైన బంధు
జన సదుద్దేశమే భావి సనయ భోగ
భాగ్యములకు నిరోధక బంధమయ్యెఁ;
దల్లి విషపాత్రి నందీయఁ ద్రావ వలెనొ?

సదనురాగంబు పరిభవక్షతి నొగిలియు
ద్వేషముగ మాఱఁబోదు పవిత్ర మగుట;
నే ఱొకని జీవితంబు నీప్రేమ కతన
సౌఖ్యపడునేని యదియె కొంత సంతసంబె.

మగనాలి వౌట, నాకుం
దగ దీక్షఁ దలపోయ నిన్నుఁ దరుణీమణి, నే
నగపడను దెరల మాటున;
విగతాశుని వీడుకోలు వేడకు మింకన్.

కాని, యొకకోర్కె గలదు; నీ మానసమునఁ
బ్రణయ బలిరక్త ధార లార్ద్రముగ నున్న
మఱవఁ బోకు మత్ప్రేమసమాధిమీఁదఁ
గనికరంబున నొక బాష్పకణము రాల్పు.

నెలఁతా, భగ్నమనోరథుం డగుట నేనే కాని వాంఛింపకే
కలిగెన్ నీ కమృతత్వసిద్ధి, కవితా కల్యాణ సౌధంబునన్
నెలకొంటం; గవియాత్మ ముజ్జ్వలవయ్యెన్ నీతోడి సామాన్యతా
చెలులల్లో నివసింతువేమొ యిల నక్షయ్యంబుగం జీకటిన్.

అన్నిదినాలు భావపటమందున నే లిఖయించికొన్న య
భ్యున్నత భావిచిత్రము లోకొక్కటిఁ జింపి, నిరాశ మంటలం
దిన్నగ వైచి, పై కెగసి తేలెడు ధూమముఁ జూచి చూచి, మే
లోఁకన్నటు క్రిమ్మలం బడయుఁ గోరుదుఁ గీలల రూపరేఖలన్.

అమలంబైన ప్రభాతరాగరసవిన్యాసంబునం బ్రేమ చి। త్రము
లన్ వ్రాసియు వ్రాసియిప్పటికివర్ణంబంతయుం,గుంచెయుం [హూ
హిమికాస్వచ్ఛమనోంబరంబువ్యయమాయెం; దచ్ఛ్రమప్రాప్త
కమనీయం బగుసృష్టి నాయెదుట దగ్ధంబౌట కెట్లోర్తునో!

కవితలు వ్రాసి చింపునటు గాదు! హృదంతరలగ్నమైన యా
యువతి మనోహరప్రతిమ నూడఁ బెకల్చెడునప్డు జీవిత
ప్రవిమలరక్తపూరములు పైఁ కెగఁజిమ్మెడు బాధ నోర్చుకో
నవునెవిధాత, నీకయిన; నారునె గాయము; మచ్చమాయునే!

ఆశాభంగ కఠోరశస్త్రికల నన్నంతంబు గావించి యా
వేశోన్మత్తతఁ ద్రొక్కినన్ సరియ! దుర్వ్యత్యంబు కోటీన సం
కాశ ప్రాభవ దివ్యతేజము మనఃకంజంబునన్ వెల్గెఁ; ద
ద్రాశీభూత పవిత్రశక్తియెటులన్ దర్పింతువే దుర్విధీ?

తలవంపులు ఘటియించితె
పలువంతల సన్నగిలినవానికి; విధి, నీ
బల మెంతో దెలిసికొందును;
కలకాలము నీకు నాకుఁ గలహము సుమ్మీ!

కాలన్ రాచి విదల్ప నేఁ బురుగునే, కాలానలజ్యోతి యం
చేలా నీ వెఱుఁగంగ లేవు? నిను నీసృష్టిం దుటారించి భా
హాలంబంబున దివ్యలోకములు రమ్యం బౌనటుల్ సల్పి నీ
యాలిన్ దొంగిలిపోయి మత్ప్రణయరాజ్యశ్రీ నొనర్తున్ విధీ!

తలఁపులయందె నా వెతను దాఁచఁదొడంగితిఁ గాని, వాతసం
చలిత పయోధి వీచికల చాడ్పున రేఁగు విషాద మేఁచి, యా
కులమయి, గాఢసంయమనకూలముఁ ద్రెంపి క్రమించెనాలుకం;
దలఁగెను దానఁ గొంతపరితాపము; నర్థవిముక్తి చేకుఱన్.

కరుణను నా కయాచితముగా వరిషించిన నీ వరంబులన్
మరలఁ బరిగ్రహింపుము రమాధవ, రమ్యకళావిభూతి, యం
బరచర భావలోలతయుఁ, బల్లవకోమలమా మనంబు దు
ర్భర రుజలొంచు నైహిక నివాస మసహ్య మొనర్చు నెంతయున్.

గఱులను ద్రుంచి, నేలకును గాలికి బంధము వైచియుం, బయో
ధర రథచక్రముల్ పగులఁ దాఁచి, తటిల్లత జాటిఁ ద్రెంపి, క
ర్బుర రమణీయతా కిరణ రోధకమా కవచం బొసంగి, ప్ర
స్తర కఠినాత్ముఁ జేసి నను సంసరణార్హు నొనర్పు మీశ్వరా.

కవితానిర్ఝరి, క్రూరమా విధి తిరస్కారంబునన్ నీకు సం
భవమయ్యెన్ హృదయాంతక వ్యథలు కావ్యాలల్లి పాండగఁ; జా
లు విషాదాంకిత గీతికావళి! చాలున్ నిల్పు మాక్రోశ గా
న విషజ్వాలలు! పూనుమీ యచల మౌనన్యాసదీక్షాధృతిన్.

## ఆ శీ ర్వా ద ము .

చెలియా, నిత్యశుభోదయంబు, సకల శ్రేయంబులున్, భోగముల్
విలసత్ ప్రేమ సదాభివృద్ధియుఁ, గళా విద్యాభిలాషంబు, ని
శ్చల మాంగల్యము, పుత్రపౌత్రులును బ్రజ్ఞాతారతమ్యజ్ఞతల్
వెలయన్ జీవిత యాత్ర మీ కిఁక సుఖాన్వితంబుగా సాఁగుతన్!

21-2-1929

---

# అధ్యాయాంతము.

---

"I made another garden, yea!
For my new love:
I left the dead rose where it lay
And set the new above."

---

చివురులకెంపుపెంపెసఁగఁజేయువసంతమువచ్చె; నెన్నఁడో
కవటలుమాని శుష్క రసకాండత నున్న రసాలశాఖ పూ
ర్వ విధమునం గిసాల విసరంబులఁ బూతల దర్శనీయమై
కవగొనె మాధవీలతను; గష్టములుం గడఁదాఁక కుండునే!

చీఁకటియింటి కాఁపురపుఁ జీకుదొలంగెను; జల్లవెన్నెలల్
ప్రాఁకి కుటీరకుడ్యముల రాత్రి దినంబుగమార్చె; స్నేహధా
రా కలితంబు సెమ్మె; కసరావిఁక భావ పిశాచ రూపముల్
చేకుఱెఁ జిత్తశాంతి, విరచించెడి నూహలు భావిచిత్రముల్.

'గతము గతంబె యెన్నటికిఁ గన్నులఁ గట్టను; వర్తమానమే
సతత మవశ్య భోగ్యమగు సంపద' యన్న ఖయాముసూక్తులన్
మతి నిడి, మల్లికా లతిక నాటితి దగ్ధ గతస్మృతిన్, సుమ
ప్రతతుల సౌరభంబు పరిపాకము నొందఁగఁ బండు వెన్నెలన్.

అనునిమిషంబు జీవితమునందు నవీన దిగంచలంబులే
కనఁబడు; దుఃఖముల్ సుఖమగాధత విస్మృతిఁ జూపు; రెండునున్
మనుజుని జ్ఞానవృద్ధికి సమానమె; యైన, నగాధతన్ వరిం
పను వెనుదీయుఁగా యుపరిమంథనలోల మనం బధీరతన్!

అంతంబొందె మదీయమా కృతి వియోగాధ్యాయ మీనాఁడు; చి
త్తాంత స్సంయమి తానురాగ రసముల్ వ్యాపించె సేతుచ్యుతిం;
జింతాక్రాంతత యౌవనంబు వ్యయముం జేయంగ నేమాయె? సాఁ
గింతున్ జీవిత నందనంబున లతాంగీ దోహదక్రీడలన్.

చతురంబౌఁ గద దైవకల్పనము! లాశాభంగముల్ గూర్చి, దు
స్థితులం దేలిచి, లోఁతుపాఁతులఁ బరీక్షింపన్ వెతల్ గొల్పి, పై
ధృతిహీనుండగు మానవుం గని దయార్ద్రీభూతుఁడై సంసృతి
క్రతుకర్తం బొనరించు దేవుఁడు సుఖప్రాబల్య మేపారఁగన్!

7-9-1929.





# పరిశిష్టము.



## పంటకారు – సాయంకాలము.



దినమెల్లన్ గృహ కార్యనిర్వహణ బంధీ భూత చిత్తుండనై
యినుఁడస్తాద్రి నలంకరింపఁగ విహారేచ్ఛల్ తలల్ సూపఁబా
వనమై పండినపైరు చేలనడుమన్ బంగారు స్వప్నాల కో
నను దేలాడినయట్లు పోయితి మహానందంబు చేకూరఁగన్.

గూళులకువచ్చు పక్షుల కూజితములు
సంజకెంజాయ గారడి చక్కఁదనము
పరుల వినవచ్చు కీటకావ్యక్తగీతి
కాఁపువానిని సైతము కవినొనర్చు !

ఆ పొలంబొక దేవాలయంబొ యనఁగ
హృదయము ప్రశాంతమై చింతలెల్లఁ బాసెఁ;
ప్రకృతి సౌందర్య గరిమ నన్ బందిసేయ
నోరులేని పూజారినై యూరకుంటి.

చిలుకలదండు క్రేంకృతులు సేయుచు మామిడియాకు తోరణంబుల చదలెల్లఁ గట్టినటుమ్రోఁగి, చివుక్కనవ్రాలి, దోర కంకులఁ గమ నోటఁబెట్టికొని గాళులనుం గొనిపోవుచుండె; సంచలనములేని సామనము సందశి చప్పటి కుల్కి మేల్కనెన్.

ఫలనష్టం బగుచున్నదన్న తలఁపుల్ బాధింపఁజిత్తమ్ముఁ; జిలుకలసౌందర్యము, వాని స్వేచ్ఛ మదవాక్కర్ణప్రియత్వంబునుం బలుకన్ శక్యముగాని సమ్మదముగూర్పన్, రెంటికింజిక్కియాకులమై చిత్తము తోఁచితోఁపక యటం గూర్చుంటిముగ్ధండనై.

కాఁపువానికిఁ గవికి సంగ్రామ భూమి
యయ్యె హృదయంబు; కొంతసేఁపైన వెనుక
కవియె మీఁదయ్యెఁ, గ్రిందయ్యెఁ గర్షకుండు!
తారలుదయింప నింటికిఁదరలిపోతి.

మే:2-1927

---

# జాతీయత.

ఓసి జాతీయతా, నీబలో జ్వలత్వ
మెంత! నీశక్తి సామర్థ్యమెంత! నీదు
శంఖరవమునఁగల యింద్రజాల మెంత!
అస్థిపంజరములు సైత మాడు నౌర!

నీయాజ్ఞచేఁగదా నిఖిల భారతభూమి
గాంధీ మహాత్ముని కట్టఁ బడియె;
నీ కోర్కెచేఁగదా నెఱలోభి యైనను
దాఁచి యుంచిన నిధుల్ త్రవ్వియిచ్చె;
నీ ధర్మమునఁగదా నెఱజాణయైనను
మోటు ఖద్దరు మేన మోయఁ దొడఁగె;
నీ పిల్పుచేఁగదా నిర్నిద్ర కీర్తులు
చెఱసాలలం జిక్కి చీకువడిరి;

ఒక్కపెట్టున నీ భారతోర్వి నెల్ల
నూఁపి, కెరలించి, వేమాఱు ప్రోత్సహించి
త్యాగ సామ్రాజ్య పట్టభద్రతను గూర్చి
వడిగ స్వాతంత్ర్య రథమును నడిపె దరరె!

పూర్వకీర్తి ప్రతాపంబుఁ బొగడినావు;
భావి భాగ్యోదయం బగపఱచినావు;
వర్తమాన దాస్యంబును వదలఁజేయ
నే యుపాయంబు వెదకెదో యింకమీఁద!

17-2-1928.

---

# మంచు కాలపుఁ బ్రొద్దు పొడుపు

---

పిటికివాఁ డొక సింహపంజరముఁ దెఱచు
నట్లు, కిటికీని దెఱచితి నల్లనల్లఁ;
జలికిఁ గప్పిన బూర్నీసు సడలనీక
తొంగిచూచితిఁ; గనుక్రొత్త దోఁచె నాకు!

ఆకసం బడ్డముగ వ్రాలె నసఁగ మంచు
దట్టముగ వ్రేలి సర్వంబుఁ దానె యయ్యె;
భావ దుర్బిణీ యంత్రంబుఁ బట్టి చూడఁ
ప్రళయకాల సూక్ష్మాకృతి ప్రతిఫలించె.

బాలభానుండు మంచులోపల వెలుంగఁ
గ్రమముగా బహులత్వము చుట్టుఁ గాన నయ్యె;
బాల్యమున విన్న "దయ్యాల బైని" కథకుఁ
దగిన యస్ఫుటచిత్రమై తనరె జగతి!

వలికిం జెమ్మలువోయి కుత్తుక మెదల్పక లేక లేయొండ రా
కలకుల జెక్కలువిచ్చి యార్చు ఖగసంఘాతంబు ప్రాభాత మం
జులగీతల్ వినిపింప నోపవు; హిమాంశుండయ్యె సూర్యుండు; ప్రా
చి లవంబేనియుఁ జిత్రికారునకు సంసేవ్యంబు గా దిప్పుడున్.

---

ఇనకరతాప చండిమము హెచ్చుకొలందిని మాచుకోఁత కో
యను వరిమళ్ళకుం బఱచు హాలికపాళి సువర్ణరోచులన్
మునిఁగి యథార్థరూప పరిపూర్ణత నొందిరి; తద్వసుంధరా
తనయ లవిత్రిపూజ సరిదాఁకునె విగ్రహపూజ లెన్నఁగన్.

నా కిటికీకి నేరుగఁ గనంబడి రిద్దఱు యౌవనంపు లేఁ
శాకపుఁ దీపులన్ మెఱుఁగు వాఱిన యాలుమగల్; నెలంతయుం
బోక సగంబుగం గొఱికి ముందుగ భర్తకుఁ బెట్టె; నాతఁడున్
ఆకుఁ బాగాకుఁ దుంచుకొని యాలిపయంటను గట్టె శేషము

పెండ్లికొత్తఁదనము వీడని దాంపత్య
లజ్జ, యళుకువారు లాలనంబు,
మొదటి ప్రేమ దుడుకుపోకల మురిపెంబు
వారి చేఁతలం దవార్య మయ్యె.

పనులు పాటులు నంతగాఁ బట్టువడని
తరుణి మునుమును మున్నుగాఁ దానె కోయు;
శ్రమకుఁ దాళని చెలిపైన జాలి పుట్టి
దప్పి గొనె నీరు దెమ్మని తడయఁ బంపు.

ఆఁడుబిడ్డల యత్తల యాడికలకుఁ
బొంచుచూపుల కెడనైన పొలముపనియె
క్రొత్త మిథునంబునకు స్వేచ్ఛఁ గూర్చునేమొ!
తోడి పనిపాటు ప్రేమకు దోహదంబు.

వా రటు పంటచేలఁ బని పాటొనరింపఁగఁ గాంచి నేను సోమారితనంబునఁ గిలకమంచము డిగ్గక, యున్నిశాలు వేమాఱక పొర్లుచుంటఁ గని మాటికి నాపయి రోఁత పుట్టి సంసారి వ్రతంబుఁ బూనుటకు సల్పితి గొప్పప్రతిజ్ఞ ధీరతన్.

17-2-1929

# గాంధి.

ధర్మసంస్థాపనార్థంబు దైవశక్తి
యుగయుగంబున జన్మించుచుండునన్న
యార్యసూక్తికిఁ దార్కాణమైనయట్లు
లవతరించితె గాంధిమహాత్మ, నీవు?

భీష్మదీక్షయుఁ జైతన్య ప్రేమరసము,
బుద్ధుని యహింస, ప్రహ్లాదు పూతభక్తి,
యల హరిశ్చంద్రు సత్యవ్రతాఢ్యతయును
గలసి మూర్తీభవించితే కార్యశూర?

కురుభూమిన్ స్వవిపక్ష శోణితపు వాఁగుల్ పార్లిపారన్ వసుం
ధరభారంబును డించి ధర్మనియతిన్ దక్కించె శ్రీకృష్ణుఁ; డి
త్తఱి నీవన్న నహింససూత్రమును సంస్థాపించి, వర్తించి, దు
ర్భర దార్జన్యపు మూలబంధము సడల్పంజాలితో ధీనిధీ!

ముప్పదిమూడుకోట్లప్రజ ముక్తపథంబున నీ యనుజ్ఞలా
దప్పక యాచరింతురు; మృతి దంష్ట్రలఁజిక్కఁగనైన జంకరో
యప్ప! చిరప్రసుప్త శిథిలాస్థి కళేబరమైన నీవు చేఁ
ద్రిప్పఁ బునః ప్రబుద్ధమయి తేజరిలున్ మహిమేంద్రజాలతన్.

కడపల్ దాఁటని కోమలుల్ విజయశంఖంబెత్తి పూరించి న
ల్గడ సత్యాగ్రహమంత్రబోధనలు సల్పంజల్ప, గ్రామీణులన్
నడుముల్ గట్టి స్వదేశ సేవలకుఁబూనన్, జైళ్ళునిండార నె
క్కడఁనూహించితివీమహోద్యమమమోఘశ్రేయముల్ గాంధిజీ

మొనలో మేటిఫిరంగిదెబ్బలకు రొమ్ముల్ సాఁపి పోరాడఁగం
జను నాంగ్లేయుల వజ్రముష్టియుతమౌ సామ్రాజ్యగర్వంబు, త
ర్జన, ధిక్కారము, నీదు నాత్మబలముల్ రాకొట్టి డీకొట్టి పొం
దెనుగండూతి చికిత్స; ప్రాకృతులకున్ దివ్యప్రభల్ లొంగునే?

అరకట్టుపుట్టంపు నిఱుపేదవయ్యును
 సమ్రాట్టుతో సరి సమతగనుట;
మఱునాఁటి కర్చుకై చిఱుపైసయును లేక
 కోటిరూప్యంబులఁ గూర్పఁగనుట;
శమదమక్షమ నిత్యశాంతికి నెలవయ్యు
 సత్యాగ్రహంబును సల్పుచుంట;
కంటికిం దాళని కాయంబుగల్గియు
 దేశ దేశంబులఁ దేజరిలుట;

ఇట్టి యన్యోన్యవైరుధ్య మెసఁగునట్టి
నీ మహత్తర జీవిత నియతిలోని
గుప్తభావంబులెవ్వరి కొలతకందు
నందు వైదేశికుల కెట్టు లంతుచిక్కు?

హేళనపాత్రమై మొదట, నింతగనంతగ మోసులెత్తి, వే
వేలకు వేలుసాచు జనవిశ్వసనీయముగాఁ జెలంగి, యు
ద్వేల పయోధి వీచికల తీరున రేఁగి సమస్తదేశమున్
మూలము ముట్టనూచెఁగద మున్ లవణోద్యమతత్త్వ మెట్టిదో!

భోగము సౌఖ్యసంపదలు బొందుటకుందగు మార్గముండియున్
వేగమ తత్పంథబువిడి విశ్వజనీన కుటుంబివై మహా
త్యాగముఁజూపి జీవితమునంత స్వరాజ్యపు యజ్ఞవహ్ని నీ
రాగత వ్రేల్చినాఁడవు ధరంబరశక్తి వినాశమొందగన్.

అరరే! నేఁడు వినంగనయ్యె భవదీయంబైన భీష్మప్రతి
జ్ఞ, రవంతేని స్వచింతలేక ప్రజకై సర్వంబు వోనాడియున్
మఱలంబ్రాణముఁగూడ వీడ నసమానంబైన యత్నంబు! నీ
మరణజ్వాలలు కోటిసూర్యులటులన్ మండింపవే లోకమున్.

కలవరమయ్యె దేశమున గాంధిమహాత్మ, నిరన్నదీక్ష నే
వలదని చెప్పునంతటి ప్రపన్నుఁడగా; నెటులైనఁగాని నీ
తలపయిమోపియున్న జనదాస్యవిమోచన కార్యభారమే
తల వహింపనోపు; నవతారపుఁబర్యవసానమిద్ది యే?

అతుల పరోపకార యుతమైన మహాత్ముని జీవితంబు సం
తతము నిరామయంబయి జనంబుల పాలిటి కల్పవృక్షమై
శతసమలుండు గాత యని సంతస మొప్ప జయంతి సల్పఁగా
మతిఁదలపోయ నీ పిడుగు మాటలు దూకె నుపాయనంబుగన్.

చావుం బ్రతుకులు రెంటికి
నావలిమార్గంబుఁ ద్రొక్కు నచలుఁడవగుటన్
మావలెఁ దలఁపం గోరవు;
దేవుఁడు గలఁడింక మీఁది దేశస్థితికిన్.

22-9-1932.

# కళాప్రపూర్ణుఁడు.

---

తీరుగఁ దిక్కయజ్వ తరితీపు తెనుంగు కవిత్వ సారపుఁ
ధారల నాంధ్ర సాహితి సుధామధురం బొనరించెఁబూర్వ;మా
కీర్తి పొల్లువోక పలికించెడు సింహపురాన నేఁటికిఁ
శారద కావ్యనాటక విశారద మంజువిపంచి నాదముల్.

నాఁటిని నేఁటినిం గలుప నాణెపు వంతెనయౌచుఁ బాండితీ
పాటవమందు విద్వదభివంద్య కవిత్వ విమర్శనంబులఁ
బోటియు సాటిలేని కవిపూజ్యుఁడు వేంకటరాయశాస్త్రి యా
మేటరి సంస్కృతి ప్రతిమ నించు హృదంతర పద్మపీఠికఁ.

శ్రీనాథకవివర్యు శేముషీ విభవంబు
కావ్యార్థ కల్పనా గౌరవంబు;
కృష్ణరాయ నృపేంద్రు కృత విష్ణుచిత్తీయ
కేరళ ఘన నారికేళరుచులు;
ప్రకృతి సౌందర్యంబు ప్రతిపదంబున నించు
కాళిదాస కవీశు కావ్యరసము;

భవభూతి సాహిత్య భాండార పేటిక
దాఁగిన యాణి ముత్యాలసరులు;

శ్రమలకోర్చి, యేరిచి, సంతరించి,
యాంధ్ర వాఙ్మయ దర్శన హర్మ్యమందు
సంతపెట్టిన వ్యాఖ్యాతృ చక్రవర్తి
పేరు స్వర్ణాక్షరంబుల వెలుఁగుటరుదె!

కల్పించినాఁడు యుగంధరామాత్యుని
కైతవోన్మాదంబుఁ, గార్యదీక్ష;
చిత్రించినాఁడు కృశించిన యాంధ్ర శౌ
ర్యము రేఁగ బొబ్బిలి యాహవంబు;
పరగించినాఁడు మా భావన బాణ పు
త్రిక పెండ్లి చలువపందిళ్ళ నీడ;
దక్కించినాఁడు కథాసరిత్సాగర
కథలఁ దెల్గున గద్య గౌరవంబు;

'ఆంధ్ర భాషాభిమాని' సమాదరించి
దిద్ది యభినయాభిరుచులు దీర్చినాఁడు;
అంతటి కళాప్రపూర్ణున కంకితముగ
స్మరణ చిహ్నంబు నిల్పుట సార్థకంబు!

ఈ వొనర్చిన సేవకు నీకుజోడు
ప్రతికృతి యొనర్పలేము విద్వద్వరేణ్య;
యెవరి యుపకృతియును లేక యీ యనంత
కాలమున నీదునామ మమరత గాంచు!

[వర్ధంతినాఁడు చదువఁబడినవి.]

24-12-1932





# ప్రథమ కవిత్వము

1916—1918

# విన్నపము.



1915 వ సంవత్సరాంతమున నాయందు కవిత్వ మంకురించినది. 1916 మొదలు 1917 వఱకు నాకవితాభ్యాసకాలము. ఈరెండు సంవత్సరములోపల వ్రాయుటయు చదువుటయు చాలతీవ్రముగ కొనసాగినది. రసికజనానందము, స్వప్నాశ్లేషము, అహల్యానురాగము, కృష్ణుని రాయబారము, అను ప్రబంధములను రచించితిని. ఋతుసంహారమును పుష్పబాణవిలాసమును ఆంధ్రీకరించితిని. అప్పుడప్పుడు ఖండకావ్యములుగూడ వ్రాయుచుంటిని. ఇవియన్నియుఁగలసి వేయి పద్యములకంటె నెక్కుడుగనుండును. కాని, ఆకావ్యములు, వ్రాతనెరవడి కుదురుటకు వ్రాయఁబడు కాపీపుస్తకములవలె నున్నవనియు ప్రకటనార్హములుకావనియు భావించి మూటకట్టి మూలపెట్టితిని. ఎవరైనను “పద్యములు బాగుగానేయున్నవి” అని చెప్పినప్పుడు వారు మోమోటతో చెప్పుచున్నారని భావించితిని. “బలవదపిశిక్షితానామాత్మన్యప్రత్యయంచేతః” అను అనుభవపూర్వకమైన కాళిదాసుని సూక్తియుండగా నాబోటి యశిక్షితునకు ఆత్మవిశ్వాసము కొఱవడుట యొక వింతగాదు.

1927 నవంబరు నెలలో వీచిన పెనుతుఫానుగాలికి కిటికీ తలుపులుపగిలి ప్రక్కనున్న పుస్తకములబీరువా వాన జల్లున తడిసి లోనికి నీరు ప్రవేశించి పుస్తకములు నానిపోయినవి. వ్రాతప్రతుల దస్త్రముకూడ నానిపోయెను. ఆనోటు

బుక్కులనుతీసి యెండఁబెట్టితినిగాని, కాగితములు అట్టలు కట్టుకొని పోయి సిరాతో నలికివేసినట్లు అక్షరములు అగోచరములైనవి. వస్తువు నశించిన వెనుక దానిపై ప్రీతిహెచ్చుట నైజమేమొ! భగ్నావశిష్టములైన యీకావ్యములను ఖండకావ్యములను గుర్తింపసాధ్యమైనంతవఱకు ఎత్తివ్రాసి "ప్రథమకవిత్వ" మనుపేర ఈఖండకావ్య సంపుటమున చేర్చితిని. "స్వప్నాశ్లేషము" మాత్రము బొత్తిగా చీకిపోయినది.

"నలజారమ్మ"కు ననంతరమును "వనకుమారి"కి పూర్వమును అనగా 1917వ సంవత్సరమున వ్రాయఁబడిన "మాతృశతకము" ప్రతికూడ తడిసిపోయికొన్ని పద్యములు గుర్తించుటకు వీలులేక అర్ధానర్ధరూపములతో బయటపడినది. దానిని కూడ నిందుచేర్చితిని. ఈశతకము కావ్యసంపుటమున నలజారమ్మ వనకుమారీకావ్యముల మధ్యగాని లేక ఖండకావ్య సంపుటమున మొదటగాని చేర్పఁబడియుండిన రచనాకాల క్రమమునకు భంగమువాటిల్లకుండెడిది.

ప్రథమకవిత్వమువిూఁది ప్రేమచాపల్యముచేత ఈకావ్యఖండములను ప్రకటించుచున్నాను. నాకవిత్వ పరిణామమును దెలిసికొనుట కీకావ్యములుకొంత తోడ్పడగలవు. సహృదయులు నాచాపల్యమును మన్నింతురుగాక.

ప్రెమ్మారెడ్డిపాళెము
9-5-1935

ఇట్లు,
దువ్వూరి రామిరెడ్డి.



# రసికజనానందము.

---

శ్రీమహిళామణీ కుచపరిస్ఫుట కుంకుమ చందనాంకమున్
భామినిరాధ దా వరుని వక్షమునంగని మోముఁద్రిప్ప "నా
కేమి శరణ్యమింకసుదతీ," యనిపాదసరోజ పాళికిన్
వేమఱుమ్రొక్కు కృష్ణుఁడు వివేకరమా విభవంబు మాకిడున్

* * *

"క్రీడికినోడి, కంఠమున క్ష్వేళమునుంచియుఁ, బుఱ్ఱదాల్పునై
పాడి రవంతలేక పరభామను గంగనుబొంది, బూచులం
గూడి నటించునీకు ననుగూర్చె గిరీశుఁడ"టంచు మేలసం
బాడెడుపార్వతిన్ నగి ప్రియంబులఁ దన్పు మహేశుఁగొల్చెదన్

* * *

పలుకున్ జోటి విపంచికానవరసవ్యాబద్ధగీతంబులన్
వలపింపన్ నిలుపోపలేనితమిఁ జేరంజీరి కర్ణోత్పలా
విలసద్గండము నొక్కినొక్కి యధరావిర్భూత సౌరభ్యసం
కుల మాధ్వీరసమత్తుఁడై విధియుమాకుంగూర్చు దీర్ఘాయువుల్.

* * *

ఒక్కరిశిక్ష లేదు; కవినొక్కనినేనియుఁ గాంచలేదు; పే
రెక్కిన పండితాఢ్యు లిదమిత్థమటంచొక కావ్యమేనియున్
నిక్కము, సెప్పలేద! యిఁకనీదగు సొంపురహించు కైత వే
ఱెక్కడనుండి యుప్పతిలె? హృత్సరసీజమునుండియే కదా!

కావునఁ బట్టిలాగినటుగాఁ దిలపిష్టపు శైలిఁ గూర్చి ము
మ్మాఱు విమర్శ చేసినను మాధురి సుంతయు లేక యొంతయున్
నీరసమౌ కవిత్వమును నేర్వక యుండిన నేమిలోటు? సొం
పారెడు భావబంధముల కాశ్రియముల్ గద సత్ప్రబంధముల్.

భావరసప్రసంగములు పాయఁగరాదు; సుధామయోక్తులం
బోవిడరాదు; మార్దవమువో శ్రుతికంటకమైన పల్కు సం
భావన సేయరాదు; మదిభారము తోఁపఁగరాదు; శైలిసొం
పేవగఁజూడ నిక్షురసమీనెడు నట్లు రచింపు కావ్యమున్.

బాలురు సైత మొక్కరిని పద్యగతార్థము వేడగాదు! వా
చాలురు బాపురే కవిత! సారససారమరందలుబ్ధతన్
మాలలుగట్టి మ్రోఁగు నళిమండల గీతములంచుఁ బేర్కొనన్
మోలిన ముద్దుమాటలను మూటలు గట్టును తీపుజొత్తిలన్.

రసికులు మెచ్చుకోవలె; విరాజితకుండల గండపాళి సొం
పొసఁగవలెన్; మరందరసమూటలు గట్టవలెన్; మిటారి మే
ల్పసిమి వలందగుబ్బలను బయ్యెదజాఱినఁ బొల్చుక్రొంబసల్
పొసఁగవలెం గడింది; యటుపొల్పెసఁగన్ రచియింతు వేకృతిన్.

అనియిటు మత్సఖుఁడర్మిలి
వనిఁబూని వచించినట్టి పల్కులనెల్లన్
మనమునఁ జింతన చేసియు
ననుమానముతోడ నిట్టు లంటిని మిత్రా.

చిన్నయసూరి వ్యాకరణసింధువు నీఁదను; సంస్కృతాంధ్రశ
బ్దోన్నతపారముంగనను; నొప్పులు తప్పులెఱుంగుబుద్ధిసం
పన్నత లేదు, కాని యలవాణి యథోచితరీతి నన్నుఁగై
కొన్న తెలుంగుగాక, కృతిఁగూర్పఁగ శక్యమె నన్నుబోఁటికిన్.
దోసఁగులు గల్గునంచుఁ, బరితుష్టియొసంగదటంచు, నెవ్వరో
కసరుదురంచు, మత్సరులుగాంచి హసించెదరంచు, భావముల్
రసములు గూడవంచును జిరంబుగ వేచిన నేమివచ్చు, నా
పొసఁగిన కైతయుం జివికిపోవును బాండిలి దిబ్బగుంటలోన్.

కృతులురచించి యందఱి మతులనొకట
తుష్టిపఱుపంగ నౌనె యాస్రష్టకైన?
"జిహ్వకొకరుచి" యంచును జెప్పనుడిని
సాహితీపరు లెఱుఁగరే సరసులాట?

* * *

అంగజ సంగర క్లిశిత హల్లకపాణుల చెక్కుఁజెమ్మటల్
రంగుగ జోపునేర్పున నిరంతరమున్ మృదుమందవాయువుల్
గాంగతరంగ సంచలిత కాంచనవారిజ సౌరభార్ద్రితన్
బంగరుమేడ సౌరణలబాటఁ జరించు సుశీతలంబులై.

నీవిసడల్పకుండ, రమణీయకుచంబులఁ బైటఁ దీయకే
దాఁగనీక యోష్ఠరసపానము మోసపుటక్కసల్పచుఁ
జేవయొకింతలేని విటశేఖరులన్ గిలిగింతలార్పియే
భావజుకేళిఁదన్పకయె పంపుదు రర్థమునాఁచి రోఁచెలుల్

* * *

అట్టిపురోత్తమంబున.

కలఁడొక పంటకాఁపు కలకాలముఁ దాతలనాఁటి యాస్తులై
వెలయు మణీకలాపములు వేసవినేఁ వరిపండు నైదువం
దల యకరాలమళ్ళు, దగుధాన్యపుగాదులు పాడియావులుం
గలిగి సమస్తసంపదలఁ గ్రాలుచునుండెను బెద్దకాఁపునాఁ.

[ఈపెద్దకాఁపున కొకపుత్రుఁడుద్భవించి క్రమముగ
బాల్యంబు గడపి విద్యలనభ్యసించి యౌవనప్రారంభసమయా
మున కామాయత్తచిత్తుఁ డాయెను.]

కన్నులువాల్చూపు కడలొత్తె; వక్షము
కాంక్షించె ఘనసార కర్దమంబు;
బాహువుల్ ప్రియురాలి పరిరంభమాశించె,
ముద్దు సౌఖ్యముఁగోరె మోవిచివురు;
చన్నుగుబ్బలిపైకిఁ జననుబ్బె నఖశశి;
రదనముల్ జిలగొనెఁ బెదవినొక్క;
కర్ణయుగ్మముగోరెఁ గంతు కయ్యపుఁబలుక;
నాస యపేక్షించె శ్వాసతావి;

అంగమంతయుఁ గైసేత నభిలషించెఁ;
జెలువలబొమవింట వాల్చూపు ములికిదొడిగి
మరుఁడుగాఱించ గోవాడి మనమునొచ్చె
లలిత యౌవన సౌభాగ్య లక్ష్మిరాఁగ.

[ఆమెమ్మెకాని సదనంబునకు కతిపయదూరంబున రోవెలందుల వాడగలదు. అందు కనకాంగియను కన్యసౌందర్య రాశియై యొప్పారుచుండెను.]

అంతనా కలహంసీయానకు.

కన్నులండలఁ జేరఁగావలెననుకొన్న
నరచూపు చూచె నీ యన్నుమిన్న;
యురమున సుఖసుప్తి మఱిఁగియుండెదనన్న
నిక్కుగుబ్బలరాపు లుక్కుమీఱె;
కౌను పేదఱికంబుఁగాంచి యాశ్రియలాభ
మేమి యటంచట కేఁగ నైతి;
నాభిషజ్జనునుండ నాభీల కూపమై
వెలపు నబ్బురమును గలపె మిగుల;
కన్నెపుట్టిన దాదిగాఁ గన్నుతెప్ప
మైత్రి గల్గిన యాయేణనేత్రఁబాసి
యెట్లు సైచెదనని బాల్య మెంతొవనరి
యరిగె నెట్టన యౌవనం బడుగువెట్ట.

కనకాంగి మోవికి నెనగాక కాఁబోలు
పల్లవంబౌక సుపరివాళ మయ్యె;
పూఁబోఁణి నాసతోఁబోల్పఁ జెందకయేమొ
కలికి సంపెగ మేలి కనకమయ్యె;
నుత్పలేక్షణ కౌను కుద్దిగాకనో యేమొ
యంతరిక్షము శూన్యమై రహించె;
పాటలాధర కటి సాటికి నిల్వక
వసుధ వెలసెను కువలయమనఁగ;

కన్నులకు నోడి లేళులు కానఁదిరిగె;
పాదములకోడి జలజముల్ పడెనునీట;
మాఱుపేరులతోనైన మఱిఁగిరైనఁ
బడఁతి సౌందర్యమునకోడి బ్రతికెనవియు.

తేఁటిదాఁటు నీటుఁబాటి సేయవు కురుల్;
మీల నేలఁజాలు వాలుఁ గనులు;
కెంపు పెంపుఁజంపు సొంపు నింపెడుమోవి;
మించు మించు నొంచు మేనిసంచు.

పున్నాగము రోమావళి;
పున్నాగము నాభి; చనులుఁ బున్నాగములే;
తన్నాగంబుల గెలువఁగఁ
బెన్నాగంబగుచుఁ దనరె వేణి సుదతికిఁ.

శ్రోణియందముదాచఁ బ్రసూనశరుఁడు
మిండ తుమ్మెద ఱెక్కలకాండపటము
గట్టెనోయనఁ జికురాళి కలికి పిఱుఁదు
లంటిజీరాడుఁ జీఁకటులావరింప.

వక్షమనుకాంతిసరసి యౌవనమదేభ
మీఁద, హారిమధ్యమేఖల హేతుకలన
బిట్టుగర్జింపఁ గుంభముల్ భీతినెత్తె
ననఁగఁ జనుదోయి రాజిలు నబ్జముఖికి.

* * *

ఇట్లు సకలజనానురంజకంబై యొప్పువసంతంబున నొక్కనాఁటి సాయంసమయమున కాపుఁకోడెగాఁడు ఉద్యానవనంబునఁ దీవచప్పరంబునఁ గూరుచుండి మన్మథార్తుఁడై వారకాంతాయత్తచిత్తంబున నిట్లుచింతించె:

* * *

మత్తమతంగయాన మధు మత్తతఁ గన్నరమోడ్చి యుబ్బిపై
కొత్తెడుపూపచన్మొనల నోరగఁబయ్యెద జాఱఁదీసి మే
ల్పుత్తడి కీలుబొమ్మవలెఁ బొల్చునొయారముగాంచనామరుం
డెత్తడె మీనకేతనము, నేడెత్తెఱగుప్పడె పూవుటమ్ములన్?
అరయఁగ లేదె మాకొలపుటంగనలం బదివేలసారు; లె
త్తఱిఁ దలదువ్వి క్రొవ్వదను దండిగఁ బూవులువెట్టిపట్టుటం
బరములుగట్టి వల్లభులభావములన్ హరియింపఁబోరు; రో
తెఱవలయట్లు నాణెమును తీరును ప్రోదియొనర్పరీసతుల్.

మనకులకాంతలా చెలులమాదిరిగా; రదియెట్లులన్న నే
వినయము లేదు, మన్మథవివేకము శూన్య, మటుండ గానముం
బనుపడఁబోదు; పల్కరొకపాటిరసోక్తు; లవెట్టులుండినం
గనఁబడఁబోవుగా వెదకి కాంచినఁ జేఁతకుమాఱు సేఁతలుక్.

సొగసులు చేసికొన్నఁదలుచుం దలదువ్వినఁ బాటపాడినన్
మగల మనంబులాఁకగొను మాదిరి సల్ప సతీత్వధర్మముల్
విగళితమౌనటంచు విలపింతు రికులాంగన లేమిసెప్పు; నా
మగువలు పేడతట్టలటు మాఱఁ బతివ్రతలౌదు రేమొకో!

ప్రాజ్ఞులాడిన "శయ సేషు రంభ" యనెడు
సూక్తి కులసతి యెఱుగని సుద్దిసూవె!
అట్టి నైపుణి వెలయాలి నాశ్రయించె;

* * *

నిగనిగల్ నగఁజాలు తొగటాల పోగులు
నిద్దంపుఁ జెక్కుల ముద్దుగురియ;
మగఱాలు పగడాలు నగపాలు జిగులారు
తారహారము లెదఁ దళుకులీన;
పాలడాలును జాల నేలఁజాలిన మేలు
వింత దువ్వలువ పై వెల్లివిరియ;
జిలుగు కస్తురికొత్త కలపములవ్వలపుల
వాయుపోతములకు వడ్డికీయ;

అంగుళుల ఞాల యుంగరాల్ రంగు మీఱి
కుండలంబుల కాంతితోఁ గూర్మిసలుప;
వెల వెలందుల వాడకు వెడలె నంత
రామకృష్ణుండు రెండవ కాముఁడనఁగ.

వినని యట్టుల వినువారి వింత నుడులు;
చూడనట్టులఁ జూచునా సుందరులను;
నడచి నట్టుల నడచును గడవఁ డొక్క
బాఱఁడైనను దన్మయ భావమంది.

అప్పుడా పల్లవుండుల్లము పల్లవింపఁ బల్లవపాణులంగని యిట్లు చింతించు:

కన్నుసన్నల నాయింతి కన్నువిల్తుఁ
బిలిచి ననుజూపి చిత్తము బిట్టునొవ్వ
వేగఁ జనుదెంచె నొకవంక వీధిదాఁటి
గబ్బిగుబ్బల వ్రేగునఁ గాను వడఁక.

వలపు గుల్కెడు క్రొత్త కలపమలఁదెనేమొ
కమ్మ కస్తురితావి గ్రమ్ముకొనియె;
విటుని పుక్కిటనున్న విడెమందుకొనెనేమొ
ఘనసార గంధంబు గడలుకొనియె;

పటుబాధ నిపుణత విటులఁ దేల్చినదేమొ
భామయూరులు తోట్రుటుఁబాటునొందె;
సురతాంత తాంతయై సొక్కిపోల్చినదేమొ
చెక్కులమకరికల్ చెదరిపోయె;
క్రమముదప్పిన చుంగులు గదలియాడఁ
జైట సవరించు నెపమునఁ బట్టిడేసి
చనులు చూపియుఁ జూపక సగము మూసి
కాంత ననుగాంచె నెవతెయో సంతసమున.

ఇప్పుడె వత్తునంచుఁ దన యిక్కకుఁగాంతుఁడు సేరకుంటవాఁ
డెప్పుడువచ్చునో యనుచు నెవ్వరుపోయినఁ బుల్కపుల్కనం
దప్పక పైగవాక్షమున దామరసేక్షణ తొంగిచూచె; నే
నిప్పుడెదాని బారిఁబడియేఁగెద నన్ను వరించిరమ్మనన్.
జవ్వని యెవ్వతో తెలియఁజాలనుగాని తదీయవేణితీ
రెవ్వనికైనఁ దెల్పెదె మృగేక్షణ భోగినియంచు; మించుక్రొం
బువ్వుల సెజ్జపై స్మరవిభూతికిఁ బట్టముగట్టుకొన్న నే
జవ్వను పుట్టువైన భువి సంతతసార్థకమాట వింతయే!

*　　　*　　　*

ఈతని నడక యొయారము,
ఈతని తెలివాలుచూపు, లీతనియందం
బీతని వెడఁద యురంబును
బ్రీతిగనే యువతిచూడ వీడునె మరుఁడున్.

సిబ్బిగుబ్బలు గలుపాటు చెందివడఁక
జాఱుపయ్యెదను సవరించకయ మఱచి
కాఁపు బాజుగును గాంచుచుఁ గదలకుండె
నతను పడుకింట వ్రాసిన ప్రతిమవోలె.

*　　*　　*

దైవవశమ్మున నప్పుడు
పూవులు గోయంగ నేఁగు పూఁబోఁడి వనిం
దోవకు నడ్డంబల్లిన
తీవనుసరియొత్తి మరలఁ దిరిగెడునపుడున్.

*　　*　　*

కులుకు మిటారి గబ్బిచనుగుబ్బలఁ జేసి తదీయభారముం
దెలిసి, లతాంగికౌను గడతేరదటంచుఁబిఱుందు భాగమున్
బలితపుమూలబంధనము భాతినొనర్చియు నారుకమ్మనిన్
వళులనుత్రాఁటితోనడుము పైబిగియించెనొయే మొబ్రహ్మయున్.
ఎచ్చటనైనఁగాంచితినె యిట్టిమనోహరరూపు? కాంచినన్
మెచ్చుగడించు క్రొందళుకు మీలకనుంగవయున్నె; యుండినన్
బొచ్చెములేని చంద్రికళఁబోలెడి నెన్నుదురున్నె; యుండెఁబో
యచ్చపలాయతాక్షి దరహాసము చాలదె గెల్వనంతయున్.

*　　*　　*

ఎయ్యదియూరు, మీరిచటికేగుటకుం గత మెద్దియయ్య యిం
కెయ్యెడనుందురే సతము; నెవ్వరుబంధులు, సమ్మదప్రదం
బయ్యెనె వాడసొంపు; పనులన్నియుఁ దీరెనె; యెప్పుడేగుటల్;

*　　*　　*

గానాలాపము వింటిరే, నటనముల్ గాన్పించెనే, హార్మొనీ
వీణానాదము మోదముం గొలిపెనే, వీక్షించితే మాడుకుల్,
కానంగల్గితె వారకామినుల నాకస్త్రీసమానాంగులన్
దేనన్ మీాకిటుఁ దృష్టిగల్గె మదికిం దెల్పంగరాదే ప్రియా.

* * *

వార కాంత మాత వచ్చి దగ్గఱ నిల్చి
యింపు కానిఁ జూచి యిట్టులనియె;
నెప్పుడైన మీార లీవాడ కేగరు
వెలవెలంను లంత వెకలివారొ?

* * *

కాలము చెల్లెకొంత; యలకమ్ముల వెల్లిచిగిర్చె; మున్ను నే
జాల విటాగ్రగణ్యులను జాతురిమైఁగవగూడి యుంటి; నే
వేళను నెట్టివారు వెలబిత్తరి భాహ్యము సేయ; రింతకున్
మూలకమింగిలీషు; మురుమున్నిటువంటి కలాఢ్యులుండరే.
ఎట్టో విద్యల నభ్యసించి తుద బి. య్యే. ప్యాసుగావించి, తా
రెట్టో ప్లీడరులయ్యు వేదికలపై నింగ్లీషుభాషించి మా
పొట్టల్ మాడ్చెడు సంఘసంస్కరణముల్ బోధింత్రు లోకంబునన్
గట్టా! గోప్యముగాను వారు గణికం గామింపకేనుందురే,
తహసీలుదారుఁడు దంపూరు శివరావు
మీనాక్షితోఁ గూడి మెలఁగలేదె;
అగ్రహారీకుఁడు హరిహరశాస్త్రిలు
ఇందిరమ్మకు ధన మీయలేదె;

పించెను కలకటేర్ పెద్దిచిన్నయసెట్టి
　　నన్నుఁజేవీడనే మొఁన్న దనుక;
ప్లీడరు వినుకొండ పిచ్చి మాధవరావు
　　విజయలక్ష్మి గృహాన విడియలేదె;
చక్కనయ్యలు వేదిక లెక్కనిక్క
చేయిత్రిప్పుచు లెక్చరుల్ చెప్పనవియు
నేతిబీరకాయలుగావె! సేఁతలేవి?
పలుకవచ్చును నోటికిఁదలఁపు గలదె?

* * *

గురువునైనఁగాని కుంభినీ ధవునైన
గణికనైనఁ బేర్మిఁ గాంచునపుడు
రిక్తకరములఁ జన యుక్తముకాదండ్రు
ధర్మవిదులు; గాన, ధనమునిపుడు,
తెచ్చితి; నూటపదారులు
పొచ్చెములేకుండ గూర్మి బోటికి; నిదిగో
యిచ్చెదఁగొనుమా, విను, నీ
వెచ్చట ననఁబోకు గోప్యమిది యన వినియున్.

* * *

వినుమొకమాటఁ జెప్పెదను వీరలవారలరీతి మమ్ములన్
మనమున నెంచఁబోకుఁ; డతిమాన్యతనొందెను నామతల్లి; మే
మనయముబూజ్యులలో విటులకాతతసౌఖ్యముగూర్చు టొండె;
యా! ధనమతిముఖ్యమా, రసికతల్ సుగుణాలు ప్రధానమౌసఖా

ఇటుసుతపలికిన వినియా
మటుమాయల వేశ్యమాత "మనసిరియెల్లన్
విటునిదికాదే, యిరువుర
కిటుభేదములున్న జెలవీవుమృగాక్షీ.

తీసిపెట్టుధనము తిరిగి యాయనమెప్పు
వలసి యడుగ నీయవచ్చుమనము;
అనిన రొక్కమంది యానంద కలితయై
యినుప పెట్టెయందు నిడియెఁ జెడిప.

* * *

ఇటులొక సంవత్సరకాలము సంతోష తరంగితాంత రంగులై నెలవెలందియు కాఁపుకోడెగాఁడును కాలము పుచ్చుచుండ నొక్కనాఁడు వేశ్యమాత ధనాకర్షణ యంత్రమోయన ఆతని సమీపమున నిలుచుండి యారోపిత వినయావనత వదనయై యిటులవిన్నవించె:

దాదాశబ్దంబయ్యెను
నిదాపునఁజేరి తనయ, నీవెఱుఁగవొకో,
నాదాఁచిన ధనమంతయు
నీదినమున కడుగుముట్టె నీకమీఁదెటులో.

నీవిటుఁ జేరిన దాదిగ
నే విటులును నెంత విత్తమిచ్చినఁగానీ

నా వాకిలిఁ జొరనియ్యను;
నీ వెఱుఁగవె దాని ప్రేమయు నిశ్చలవృత్తిన్.

* * *

కోకలు పాఁతవై చినిఁగెఁ గోరిన పట్టుగులాబిఱైకలం
జాకలి పాఱవేసె; నిఁకఁ జాయమఱఁగిన చీఁకిగాగరా
రేకులు చీనువట్టెను సరే, ఘనసార మృగీమదంబులున్
లేకగదా నెలంతయు విలేపము మేదుట లేదు రొమ్మునన్.
దినమును జెప్పనెంచి నిను ధీరతఁ జేరుటె కాని చెల్లరే,
మనమెటు ఱాయిచేసినను మాటలు రావుగ! జంకిగొంకి నిన్
గనుఁగొని యెట్టకేలకును గష్టములన్నియుఁ దెల్పికొంటి; దీ
నిని మనకన్యకుం దెలియనీకుఁడు; చూడుడు కార్యపద్ధతిన్.

* * *

అంతట నొక్కనాఁడు తల్లి రామకృష్ణారెడ్డిని జేరఁబిలిచి యిట్లనియె.

జనకుఁడు వృద్ధుఁడయ్యె; వ్యవసాయము భారము; కూలివారలన్
దినమును బిల్చి సేద్యము నుదీర్ణతఁ జేయఁగలేఁడు; తోడు నీ
వనిమది నమ్మియుంటిఁ గొడుకా, ముదిప్రాయపుఁదండ్రి కూఁతవై
పనుల నొనర్పుకున్న నిలవారలు పుత్రులఁ గోరు టేలొకో.
ఎన్నోనోములునోచి తుట్టతుద కెంతే ప్రీతి నిన్ గాంచి నా
నన్నా, పుట్టిననాఁటఁగోలె ధరపై నాస్వంగ సేమానో యం
చెన్నోదృష్టులు దీయుచున్ దినము నీదే చింతగాఁ జూచుచుం
గన్నారం గనుచుంటినయ్య తనయా, గారాము తోరంబుగన్

పుట్టునో యొక్కబిడ్డ యటుపోవుట వచ్చుటఁ జూచు భాగ్యముల్
గట్టునో యంచు నాకడుపు గల్గినదాదిగ నెంచికొందు; నీ
యట్టిడు పుట్టి చందనకుజాళికి నల్లిన ముండ్లతీవెనాఁ
గట్టడి బిడ్డవైతివిగ కాఁపుకులానకు మచ్చవెట్టఁగన్.

తనయుఁడు గల్గునా, కులముధన్యతనొందునా, పేరునిల్పునా,
యని మది నెంచి యుంటి నవురా, యిదియేమిర, చేటుగాల మీ
వనయము వారకాంతల గృహంబునఁ బొద్దులుపుచ్చి పెద్దవా
రిని రవసడ్డసేయక చరించెదు సోమరిపోతువై యిసీ!

కులమును శీలముం గలుగు కోడలు నా కుపచర్యసేయరాఁ
గిలిచెడు భాగ్యమబ్బునని ప్రీతిమెయిం దలపోయుచుంటి; నేఁ
దెలియక పోతి నీ కసటుఁ దెక్కలి చెయ్వులు; మాన వేర యా
కలికి పిసాళి పచ్చిపలగాకులఁ గూళల రో నెలంతలన్.

కంటివి నీవు చైదములు, కంటివి నీకయి డబ్బుపోకడల్;
తుంటరివారిఁ జేరి వెలతొయ్యలి నెయ్యము దెచ్చికొంటె; వా
ల్గంటులు లేరె కాఁపుల కొలంబునఁ బెండిలి చేసికోఁగ; పా
ల్వంటి కులంబు నీటఁగలుపన్ గమకించితె మోటమూర్ఖుఁడా.

* * *

[శ్రీ తిరుపతి వేంకట కవుల శ్రవణానందమును చదివిన వెనుక అటువంటి కథనే కల్పించి కావ్యము వ్రాయవలయునని దీనిని వ్రాసితిని. ఇది నాలుగాశ్వాసముల ప్రబంధము. 550 పద్యములు.]

# ఋతుసంహారము.

---

వేసవిరాత్రులందు నలివేణుల యూర్పులకుం జలించు న
వ్యాసవముం గరంబు కుసుమాస్త్రక దీపనమౌ విపంచి గీ
తాసదుపాయముం గలిగి దర్పక బాధితులంత ధూప స
ద్వాసిత రమ్యహర్మ్యముల పైతలమందు సుఖింతు రర్మిలిన్.

సారసుగంధ సమ్మిళిత చందన లిప్త పయోధరంబులన్
హారి తుషార గౌర సముదంచిత హారములన్ ఘటించి యిం
పారు నితంబసీమను సువర్ణపుఁగాంచి నలంకరించు శృం
గారవతీలలామఁ గనఁగాఁ బ్రియమార దె నెట్టివానికిన్.

కరము నసహ్యమౌ పవనకాండము రేణుక మండలంబు స
త్వరగతి రేఁప, భూమి ఖరభాను కరావళి సంతపింప దు
ర్భర వనితా వియోగశిఖ ప్రజ్వలియింప హృదంతరంబులం
దిరుగు ప్రవాసులిద్ధరణిఁ దేటి కనంగ నశక్యమయ్యెడున్.

మలమలఁగాయు నెండలకు మ్రగ్గుచు జింకలు కానయందు దా
డలు వసివాడ నత్యధిక దాహమునం జరియించి భిన్న క
జ్జల నిభమౌ నభంబు పలుసారులు నీరను భ్రాంతి నాతురన్
బలు పరుగెత్తుచున్నయవి పైఁబయి నబ్బుల నెత్తిచూచుచున్.

మిక్కుటమైన యెండలకు మిక్కిలి తాపమునొంది విక్రమం
బెక్కుడలేక వక్త్రము మఱింతగ విప్పుచు వ్రేలు కేసరాల్
నిక్కవిదిల్చి నాల్కఁగదలించుచుఁ బెట్టిదగ సింహపుచ్ఛటం
బ్రక్కలనేఁగుచుండెడు నిభంబును సైతముఁ జూపకుద్ధతిన్.
నురుగులు మాటిమాటికిని నూల్కొన నాల్కలుసాఁపినోళులం
దెఱచుచు మోరలెత్తుచును ద్రిప్పుచు దాహముపుట్ట నీటికిన్
దెరువులు సూచుచున్ బడలి నెట్టన భూధరగహ్వరంబులన్
బరువిడె బత్త్రితండములు బారులు గట్టి తదగ్రిభూమికిన్.
చిటపటదావదాహమునఁ జెట్టులు చేమలు గాలిపోవ, ను
త్కట పవమానవేగ పరికంపిత శుష్క పలాశ సంచయం
బటునిటు పైకి రేఁగఁ; గమలాప్తవితప్తజలంబులోట నా
యటవులు భీతిదంబులుగ నయ్యెను నెత్తుననుండి చూడఁగన్
అనిల వివృద్ధ వహ్ని నికటాద్రి గుహాంతర సీమమందుచున్
ఘన నినదంబునన్ విరియఁ గాననఁ గాలిన శుష్కవంశముల్,
కనులటు మూసియెత్తఁదృణకాండమునంజొరి వృద్ధినొందుచున్
వనమృగ వర్గముం గడు వనారిలఁ జేయును భ్రాంతలగ్నమై.
జ్వలనము శాల్మలీమహిజ సంతతులం బ్రభవించి ధాత్రిజం
బుల పెనుకోటరంబులఁ బ్రభూత శిఖాజిత హేమవర్ణమై
తళతళ మండుచున్ బరిణతచ్ఛదసంకుల వృక్షజాల శా
ఖల కెగఁబ్రాఁకుచుం బవనకంపితమై భ్రమియించు నంతటన్.

* * *

భిన్న ఖగేంద్రరత్నముల పెంపును నింపు దృణాంకురంబు, లు
త్పన్న శిలీంధ్రకందళ వితాన మనోజ్ఞత, యింద్రగోపకా
భ్యున్నతి మీఱు భూమి యసితోజ్జ్వల రత్నవిభూషితాంగియై
చెన్నలరారు కాంతవలెఁ జెల్వగు నెల్లెడఁ బాఱఁజూచినన్.
కమ్మని తేనెఁద్రావి తమకమ్మున జుమ్మనిపాటపాడి ప
త్రిమ్ములు లేని తమ్మివిరి తండము వీడి సముత్సుకమ్ములై
యిమ్మగు నల్లగల్వలని, యెమ్మెగ నెమ్ములు నృత్యమాడ భృం
గమ్ములు పింఛచక్రములఁ గ్రమ్మెడు; మూఢులెకా మలీమసుల్

* * *

ఒకయెడ శంఖపాండురత, యొక్కెడ బాలమృణాళకాంతి, వే
ఱొకయెడ వెండి నిగ్గులను నొప్పి, విముక్తజలంబులౌట వే
శకలములై లఘుత్వమున సాగు పయోదము లొప్పఁ జామర
ప్రకరము చేత వీవఁబడు రాజనఁ గ్రాలు నభంబు మిక్కిలిన్.
ఆకాశంబు విమర్దితాంజన నిభంబై కాంతి దీపింప, బం
ధూకంబుల్ వికసించి శోణరుచులన్ దోఁపింప ధాత్రిన్, నవా
స్తోకాంభోజవనావృతోర్వ్యలగుచున్ సొంపార వప్రంబులున్
లోకంబందు నిఁకెట్టి యౌవనున కేన్నాల్కొల్పవే వేడుకల్.
ఫలభారంబున వ్రాలు శాలితతులం బల్మాఱు నూఁకించి పు
ష్పలతాభారవినమ్రముల్ తరువులం బ్రాపించి యూఁగించుచున్
విలసత్ఫుల్ల నవారవింద నలినీవీథిం బ్రవేశించి గం
ధిలవాతంబు బలాత్కృతిన్ యువమనోధీరత్వమున్ దుల్పెడిన్

మదనుఁడు,నృత్యకృత్యములు మాని చరించు మయూరసంతతిన్
వదలి రసార్ద్రగీతములు పాడెడు హంసల నాశ్రయించెదున్.
హాదనని పుష్పలక్ష్మి, కుటజార్జున సర్జ కదంబ నీపముల్
వదలి సమాశ్రయించె సుమవార మనోహర సప్తపర్ణలన్.

※ ※ ※

మదిరను గ్రోలినట్టి బలుమత్తడగంగ నిశీథిఁగాంతుఁడుం
గోదనుపిసాళి గబ్బిచనుగుబ్బలఁ గౌఁగిట నొత్త వత్తలై
మెదగఁగఁ, దెల్లవాఱ నొక మేచకకుంతల కేళివాసమున్
వదలి మఱొక్కెడన్ గదికెఁ బాఱుఁ దనుంగని తానెనవ్వుచున్

※ ※ ※

వనితల తనువుల నియ్యెడ
మనసిజుఁడు విపాండురముగ, మంథరముగ, జృం
భణ తత్పరముగఁ, గృశముగ
ఘనలావణ్య విలసితముగా వర్తించున్.

ప్రేంకణపుఁ బూవు కస్తురి
కుంకుమ కస్తూరిపసుపుఁ గూర్చి మెదిపి యే
ణాంకముఖులు కలపంబును
బొంకపుఁ దెలిగుబ్బచనులఁ బూయుదురిపుడున్.

సరస రసాలసాల నవ సారకిసాల రసాసవంబునం
బరభృతరాజమొంతయును మత్తిలి రాగరసాంతరంగమై
నిరతము నాఁడుకోయిలను నిక్కము ముద్దిడుఁ; దేఁటి పద్మమం
దిరమున నర్మకృత్యములఁ దేల్చుఁ బ్రియన్ మధువానిపాడుచున్

తరుణుల చిత్తపేటికల దాఁచిన కాముకపాళి మానసాం
బురుహములన్ శుకాస్యములుఁబోలు పలాశసుమాళి చీల్పవే?
ఖరముగఁ గర్ణికార సుమకాండము కాల్పదె? యంతఃశోక బం
ధుర కలకాకలీధ్వనులఁ దూర్ణము నొంచుట యేల కోయిలల్ -

[ఈకావ్యముసంపూర్ణముగ నాంధ్రీకరింపఁబడియుండినది.]

# పుష్పబాణవిలాసము.



అనువుగ గోపకాంతలు స్వయమ్ముగఁ గౌఁగిల గబ్బిగుబ్బ పో
టున కొకయింత చందనముడుల్లియు సౌరభ మొల్కు కాయ మొ
ప్పు, నిశి నను ప్రేమెఁ గనులఁ బాటలమారఁ బ్రభాతవేళ శో
భనువహింయించిమించు విటవర్యుఁడు మిమ్మనిశమ్ముఁ బ్రోవుతన్

అన్నులవేనవేల మదిహాయి జనింపఁగఁ గూడియాడు నా
వెన్నుని చిత్రిమా చరిత విత్థములోకమునందుఁ; దత్కథా
భ్యున్నతి నాశ్రియించి సరసోజ్జ్వల కావ్యము వ్రాయనున్న నా
కెన్నఁగఁ దల్లి భారతి యహీనకృపామతిఁ బల్కుతోడగున్.

కన్నులుగొప్పవాయెఁబ్రియకాంతుఁడుదృష్టిపథమ్మునొంద; నా
కన్నియ మేన నొత్తెఁ బులకల్ విజనాలయమందుఁ గాలిడం;
బ్రిన్నని చన్నుగుత్తులను బట్టునెడం దనువల్లి కంపిలెన్;
గ్రిన్ననమూడెఁదానయయి కంఠముఁ గౌఁగిలువేళ నీవియున్.

అరవిందప్రతిమానమై నగవుతో నాస్యంబు రంజిల్ల; సుం
దరవక్షోజ తటాంతలగ్న పట మత్యంతంబు జాఱంగఁ, జె
చ్చెర నాసన్నజనప్రతారణమతిం జేచాటుగావించి బి
త్తరి దూరంబుననుండి కాంచు నను మోదంబార సాకూతమై.

మడఁతిరో చూచితే నిబిడమాధవి మధ్య నికుంజసద్మముం?
బుడమిని రాలి చల్లినటు పూవులుశోభిలు; నిందుబాళిమై
పడఁతులు కాముకేళి సలుపన్ మణితంబుల శబ్ద మేరికె
ప్పుడు వినరానియట్లు గొలుపుం బికముల్ కలకాకలీధ్వనుల్.
కీరము బింబమంచుఁ గొఱికెన్ బెదవిం; బరుగెత్త వీడె నీ
భారపుఁగొప్పు; మోముశ్రమవారి కణంబులఁదోఁగెఁ; గంటకాం
కూరము మేనఁగాటు లిడెఁ గోమలి, కంకణమార్భటింపఁగన్
బాఱెదవేల చిల్కకయి భ్రాంతి, ననందయుఁ బూలుగోసెడిన్
జాఱిన పయ్యెదం గరకిసాలముచేఁ జనుదోయిఁ జేర్చుచున్
వేఱొకముద్దుకేల ముడివీడిన క్రొవ్వెద దిద్దికొంచు నో
య్యారి సుగంధకర్దమకణాంకిత దేహముఁ బాటలోష్ఠ మొ
ప్పారఁగ వెల్వడుం బ్రియునిహర్మ్యము కంతునిజైత్రలక్ష్మినాన్
కాంతుండేఁగుఁగదా విదేశమని యోకాంతా, మదీయాత్మయం
దెంతోచింతయెసంగె; లోకహితుఁడౌ యిందీవరాప్తుండు దుః
స్వాంతుండై కలహించుఁ; గోకిలల రమ్యాలాప సంగీతముల్
వంతం గూర్చు; వనానిలంబులకటా! ప్రాణంబులందీసెడున్.
కన్నులవిల్తుకేలల వికారము పేర్చినఁ దాపశాంతికై
పన్నిన మావిలేఁ జివురుఁబాన్పునఁ దొయ్యలి చేయినాన్చినం,
గ్రొన్నన లెల్లమాఁడె; సుమకోమలగాత్రి యనంగసంజ్వరం
బెన్నఁగ నింత యంతయని నెవ్వరికేనియు శక్యమే ధరన్.

అలరు సుధామరీచి వికచాబ్జమునం బవళించె; ముత్యముల్
కలువల జంటనుండి యధికంబుగ వెల్వడె; హైమవల్లియుఁ
వెలవెలవాఱెఁ; బూసరము వింతగవాడెఁ బయోజకోరకం
బులపయి; విప్లవంబులిటుమూఁగి ప్రయాణముమాన్పెమిత్రిమా
దూతీ, నీనయనోత్పలద్వయమదో తోరంబువాడెఁ; మణి
వాత్రితశ్రీయన స్వేదబిందు గణముల్ రాజిల్లె నెమ్మోమునన్
నీతంబాయెఁగడింది నిశ్వసితముల్; నీవిట్టి రేయొండలో
యాతాయాత నితాంత తాంతవయితే హంతా! మదీయార్థమై.

జక్కవపెంటివంటి మృగశాబ విశాల విలోల నేత్రి బల్
వెక్కసమా వసంతమునఁ బ్రేయసుఁ బాసి సహింపలేమిఁ జా
వొక్కటె యాశ్రయంబనుచు నోరుపు సుంత వహింపలేక తా
నెక్కెను గీలికల్పము సహీనరసాల కిసాల తల్పముల్.

కలకంఠారవ కర్కశత్వము, నిశాకాంతోగ్ర తీక్ష్ణత్వముం
జెలయఁగ రేఁగెడు దక్షిణానిలము దాక్షిణ్యంబు లేకుంట, నీ
కలవాణీ స్మరణీయఁ జేయునకటా! గడ్డేని కంపింపఁగన్
దలఁచుఁగ నీదు సమాగమంబని; యిటే తద్విఘ్నముంగల్గెడిన్

కన్నుల నీరువెట్టకుము కజ్జలరేఖ కరంగిపోయెడుం;
గ్రొన్నన కంఠమాల రుచి గుందగ నూర్చెదవేల కోమలీ,
మిన్నక పొర్లకే పడుకమీఁద సుగంధపుఁ బూఁతచిట్లు; నీ
వెన్నకు వేఱురీతిఁ, గ్రమియింపదు కాంతుఁడు వచ్చువేళయున్

కన్నియ మిన్నయోర్తు చెలికత్తెల కూటువ మధ్యనుండి క
న్నన్నల దూతితోఁ బలికి, చయ్యనఁ గాటుకఁ గన్నుదమ్ములన్
సన్నగ దిద్ది, యుబ్బిటిలు నాణెపు గుబ్బల రత్నహారముం
జెన్నుగ మూసి పెట్టెఁ దన చేలచెఱంగున వింతదోఁపఁగన్.

ముద్దిడుబింబమోష్ఠమును; మూర్కొను నాస్యముశీతలాంశుఁడున్
దద్దయుఁ బద్మకోశములు దాఁకవరించు నురోజభారమున్;
ముద్దులుగుల్కు చెంగలువ పూసిరి యాకుఁ గరావలంబియై;
వద్దనె సేవచేయును బ్రవాళరుచుల్ పదపద్మశోభకున్.

దూతి, మదుక్తసర్వమును దోరముగా సమకూర్చితౌర! నీ
రీతిఁ బరార్థసక్తతఁ జరించెడు బోంట్లుగలారె మెచ్చుటన్?
ఆతతకాంతి పాలయితె హాంత! మదర్థము; కోమలాంగి యె
బ్భాతి ఘటిల్లు పుణ్యము లపారము నియ్యెలఁ గష్టమబ్బకే.

క్రొన్ననదండలం దఱుచు గ్రొమ్ముడిఁ బెట్టదు; తావికస్తురిన్
నెన్నుదుటన్ ధరించి రమణీయతఁ జిల్కదు; నన్నుఁ గాంచియుం
గ్రన్నన డాసి ముద్దొలుకఁగా విహరింపదు తొంటి కైవడిన్;
గన్నెమిటారి యింతకును గాంతుని నేరముఁ దెల్పదకటా!

బాలా, ధూర్తులభీతి గండతలముల్ ప్రాపించి ముద్దాడుటల్,
బాళిం జన్నులనంటి కౌఁగిలు కళాభ్యాసంబు దప్పెన్ స్మృతిన్
ఆలాపంబులు గూడఁదీఱె నిపు; డాహా! యింతకే వంత నా
కేలా పొందఁగ, నీదు దర్శనము లేదేయంచు దుఃఖించెదన్.

లలనారత్నము నవ్వుమోము విధునిన్ లజ్జాంకితుం జేయ మం
జుల కీరాలపమున్ వచః ఫణితి యస్తోకంబు నిందింపఁగన్,
జలజామోదభరానిలంబులను నిశ్వాసంబు గ్రేణింప నా
ర్తిలి యుండాకను వేచి కాంత నవి గాటించున్ వియోగంబునన్

కన్నియ పాడినన్ శ్రుతివికారము గొల్పు విపంచినాదముల్;
వెన్నెల చీఁకటట్లు గనిపించును దెల్లనినవ్వు నవ్వినన్;
గన్నులముందుఁ గ్రొత్తదగు కల్వయు వాడినయట్లుదోఁచు; మై
వన్నియ చెన్నుఁ జూడఁగ వివర్ణములౌఁ దొలుకారు మించులున్.

చిరము, నభూతపూర్వము విశేషసఖీజన దోషజంబునై పురి
గొనురోషమున్ విడిచి మోమిఁటు చూపుము, నేత్రజాడ్యముల్
కరఁగుత; కర్ణపేయమగుఁగాతఁ త్వదీయ రసార్ద్రవాక్యముల్.
తరలుత తాపబాధ వనితా, వెదఁజల్లుము చల్లచూపులన్.

కాంతుఁడు మ్రొక్కనించుకయుఁ గాంచ; దతండును గిన్నఁబోయి సం
జింత నిరంతముం బొగులుఁ; జెచ్చెర నెచ్చెలులంత వల్లభుం
జెంతకు బల్మిఁ దేమఱలఁ జెల్వయు మానముఁ బూను; గ్రమ్మఱన్
వంత నతండుఁ బోవఁ జెలి ప్రాణము కంఠము నాశ్రయించెడిన్

కన్నియ కన్నుదోయి కడఁ గన్నులమూసినమేల్ కురంగముల్;
విన్నను బల్కు, వీనులకు వేదగుఁ గోకిల కాకలీరుతుల్;
పొన్నరిమోముఁ జూచుటకుఁ బూర్వమెలోకముగోరుఁ జంద్రునిన్
మన్ననపొందు హేమలత మానినిఁ జూడని యాత కాలమున్.

# అహల్యానురాగము.

---

పూలగుత్తులు దేవె పూజార్థమని యన్నఁ
జనుకట్టు క్రిందికి జాఱనొత్తు;
జలజంబులైనను సంతరించితె యన్న
వెడఁద వాల్గన్నులు విప్పిచూచు;
కుందంబు లొకకొన్ని కోసి తేవే యన్న
దరహాస మొనరించి తలనువంచు;
పున్నాగమల్లదో పూచెఁ గైకొమ్మన
నెఱినాభి క్రిందికి నీవి దిగుచు;
యజ్ఞవేదిక సమిధలు నాజ్యపాత్ర
పెట్టవేయన్న హృదయంబు తట్టిచూపి
భావజానల ధూమంబు బయటి కూర్చు
యౌవనారంభమున నహల్యాలతాంగి.

*  *  *

అలరుల్ చల్లనితావులం జిలుక, స్విన్నాంగ శ్రమర్ వాయువుల్
దలఁగింపర్ సెలయేళ్ళు కోయిలలు పంతాలాడి పాడంగ వె
న్నెలపర్వ విలసత్సమాధి పదవీ నిష్ణాతు నాగౌతముర్
జెలి కౌఁగింటనుబట్టె నప్రతిమఁ బుంజీభూత కామార్తయై

[ఇది 110 పద్యముల కావ్యము. పుస్తకము ఎప్పుడు ఎక్కడ పోయినదో తెలియదు. ఈకావ్యమును వ్రాసిన కొన్ని దినములకు పిసుపాటి శేషాచలశాస్త్రిలవారికి కొన్ని పద్యములు చదివి వినిపించితిని. వారు పై రెండు పద్యములను మెచ్చుకొనిరి. ఆపద్యములను మరల మరల చదివి కంఠగతము చేసికొంటిని. అవి నేఁటికిని జ్ఞప్తియున్నవి.]

---

# శ్రీకృష్ణుని రాయబారము

---

శ్రీరాజిల్లెడు స్వర్గదేశమును దోర్వీర్యంబునన్ గెల్చి వృ
త్రాసురుం గానలపాలుచేసి నరకుం డత్యంత గర్వోన్నతిన్
మీఱన్ సంగరమందు నయ్యసురునిం బిల్కార్చి దేవేంద్రునిన్
స్వారాజ్యంబున నిల్పినట్టి హరి నిచ్చల్ మాకు సౌఖ్యంబిడున్.

పొలయును గ్రొత్త నెత్తురులు పొల్పెసలారి యకాలసంధ్య ది
క్తలముల నించు మత్తగజదానవచర్మము వల్లెవాటు చుం
గులు కటిసీమ జాఱ, శివుఁగూడి ముదంబునఁ దాండవించు న
వ్వలిమల యల్లువాని రిపుభంజక శూలము మమ్ముఁగాచుతన్.

బలయుతులైన దైత్యులకుఁ బ్రాభవమొంద వరంబులిచ్చి వా
రల రణశక్తి ధాటికిఁ బరాజితులైన నిలింపకోటి యు
మ్మలికముదీఱఁ గొండొక సముచిత కార్యవిధంబుఁ దెల్పు నా
జలజభవుండు మానొసటఁ జక్కని వ్రాతలు వ్రాయుగావుతన్.

* * *

భారత కావ్యరాజమున భావరసోదధి తిక్కయజ్వ శో
భారమణీయ కల్పనల వాకొనెఁ గృష్ణుని రాయబారమున్
నే రచియింతు నేఁడు, దగు నేర్పున నద్దియె కాలపద్ధతుల్
మాఱుటఁ జేసి నూత్నగతులన్ సమకాలికు లెంతొ మెచ్చఁగన్

* * *

అని యిష్టదైవ ప్రార్థనంబును, సత్కవి ప్రశంసయు విష్ణులీలా బహుళత్వంబును గణించి పఠితల కభ్యుదయ పరం పరగ నాయొనర్పంబూనిన శ్రీకృష్ణుని రాయబారంబను ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన:—

కురురాజేంద్రుని పేరుటోలగమునం గొల్వుండి శాస్త్రార్థముల్
పరతత్త్వంబులు లోకవృత్తములు నుల్లాసంబుగన్ భీష్ముఁడున్
గురుఁడున్ ద్రాణియు సంజయుండు కృపుడుంగుందేద బోధింప ని
ర్భరమోదంబున సభ్యులెల్ల శిరముల్ పంకింప నత్యంతమున్.

దరహాసోల్లసితాస్య పద్మమున కుద్యద్దంతకాంతుల్ తదం
తరజాతామల కేసరంబులన విన్నాణమ్ము గొల్పంగ భీ
కరసంగ్రామకళోక్తులం బలుకుచుంగర్ణుండు దుర్యోధనా
ది రసాకాంతుల మెప్పులంబడసి యుత్తేజంబునన్ మీఱఁగన్.

* * *

అతులమణిమయ హేమసింహాసనమున
నధివసించి యిట్లనియెను నంధనృపతి
సంజయునిఁగాంచి హృదయంబుసంచలింప
వదనబింబము దీనత వాడువాఱ.

* * *

అర్జునుఁడేల శత్రువిజయాంకము గాండివ మూననేల య
తూర్జితబాహువీర్య సమరోద్ధతుఁడా మరుదాత్మజుండె వే
కర్జముఁదీర్పఁబూని లయకాలకృతాంతుని లీలరేఁగ గ
ర్వార్జితబుద్ధిమాంద్యులగు నయ్యలుకొండొక లెక్కయేయిటన్

* * *

అనవుడు ధృతరాష్ట్రునివంక మొగంబై ద్రోణసుతుం డిట్లనియె.

పాండునృపాలసూనులు స్వభావకృపామయులౌట నీర్ష్యమై
గండుతనమ్ముఁ బూనకయ కానల కేఁగిరి; కాకయున్న, నా
ఖండలసూతిగాండివముఁ గైకొన నొక్కఁడు నిల్చువాఁడె త
ద్భండన కౌశలోద్ధతి విధానము గోగ్రహణానఁ జూడమే.

పాఱులెవారు "దేహి"యని పాండుమహీశుని రాజ్యభాగముం
గోరుట, కెమ్మెయిన్ విమతకుంజర కేసరులై రణావనిం
బోరి సమస్తసంపదలు పొందకయుందురె? యీయమన్నవా
రూరకపోదురే భుజబలోగ్రులు సంగరమన్నభీతిచే.

అనవిని యింతదనుక సభ్యుల యభిప్రాయంబు గనుంగొన నెట్టులో కోపము బిగఁబట్టి వేచియున్న దుర్యోధనుండు దండతాడిత భుజంగప్రాయుండై వీరావేశంబునఁ గనీనికలు రక్తగోళంబులై చూపఱకు వెఱపుం గఱప నిట్లనియె:

వెలితి ప్రసంగముల్ సలిపె వృద్ధమహీపతి; యంతఁ బోక పెం
జలమున సంజయుండు తనచాతురిఁ జూపెను ధర్మవేత్త నా
వలఁతుల యట్లు ద్రోణకృపవక్తలు వాకొనిరేమొ పద్ధతుల్
పలికెను ద్రోణపుత్రుఁడును పాండుతనూజుల శౌర్యగాథలన్.

కురురాజేంద్రుని సత్సభాగరిమ యెగ్గుంబొందఁగా మీఱు సి
గ్గఱి గాజుల్ధరియించు కొన్నటుల విక్రాంతిన్ విసర్జించి సం
గరమన్నన్ వెఱగొందు పందలయి పల్కన్ వింటి మీనాఁడు,
చూ। డరమమ్మైనను; మేటులంచు నిటులాడన్ బాడియే దీనతన్.

పాండుతనూజులంట! బలుపాడి చెలంగెడు వారలంట! తా
మొండన లేక ధర్మరతి నోరిమి రాజ్యమువీడి కానలన్
భండన మొల్లకే చనిన బాహుబలాఢ్యులటంట! యింతకా
ఖండలసూతి గాండివముఁ గైకొన నిల్వరటంట కౌరవుల్!

పరదోర్వీర్యము పందులల్లెపుడు గైవారంబులం జల్పుకొం
చు రణంబౌతఱి నీతిశాస్త్రముల హెచ్చుల్ మాకు బోధించి ని
ర్భర శౌర్యాత్మనకేని పందతనముం బట్టించు పాండిత్య బం
ధురతౌ పాఱులు మాకు సాయపడ నెందున్ లోటు వాటిల్లునే?

కరమున గాండివంబుగొని కవ్వడి చివ్వకుఁ గాలుదువ్వఁ బెం
పఱ వెఱఁబూని కౌరవులు పాఱులువోలె వడంకి యార్తురే?
నరుఁడననేమి యాతనికి నాయన నాకవిభుండు వచ్చినన్
గురుధరణీశు శాతశరకోటులు పాపపుబుద్ధి నెంచునే.

పెనుగదఁ దాల్పనేల, యనిఁ బేర్చఁగనేల విభీషణంబుగన్
ఘనసమరారవంబులు వికత్థనముల్ శ్రవణింపనేల మ
ద్ధనురతిముక్త హేమకలిత ప్రదరోద్ధతి కాఁగినంగదా
యనిలతనూజు సంగరవిహారపుమాటలు మున్న యేటికిన్.

కపటపు ద్యూతముం గొలిపి కన్నులు రెండును గప్పి పాండుభూ
మిప సుతులఁ వనంబులకు మేమనిపించితిమోటు? వారు ము
న్నె పణముగాఁగ భార్య ధరణీతలభాగము నొడ్డిమాఁకు నో
డి పురము వీడిపోయిరి; కడింది మగంటిమి గల్గఁ బోరరే?

బలముఁ బ్రతాపమున్నఁ దమ పాలు చలంబున నాలమందు వే
గలిచి గ్రహింపరే, వనులఁ గీడ్పడియుండురె వీరులైన నం
దుల నోడఁబాటు మై సమయపూర్వహతిఁ నటియింపనేల ని
చ్చలు నిజధర్మవృత్తియను ఛాయను డాఁగిరిగాక పాండవుల్

బలము గలిగినపుడె బవరమ్ము సలుపంగ
హక్కు గలదు; సమయహాని యనెడు
మిషయె మాటుగాఁగ మెలఁగిరి యెట్టులో
పాండుసుతులు ధర్మవర్తులటుల.

అనవిని చెవులకు ములుకులవలెసోకు దుర్యోధనుని వచఃప్రహారంబుల మనంబు గలంగి రక్తరూక్షేక్షణుండై భీష్ముఁడు మేఘనిర్ఘోషంబుల ననుకరించు పలుకుల నిట్లనియె;

ధర్మబద్ధులౌట ద్రౌపది చెఱనాఁడు
నూరకుండి రకట, యొప్పదఱిగి
కుంతిసుతులు; పోరు గూడినయపుడైన
మీ పరాక్రమంబుఁ జూపినారె?

సమరమందు వైరి సమ్ముఖంబుననిల్చి
యుద్ధురాస్త్రచయము లోర్చుకన్న
నోలగంబుననె రణోక్తులు వచియింపఁ
గొంతమెప్పుగాదె కురుకులేశ.

నిర్జరనాథపుత్రునొకనిన్ మనమందలి మాలముట్టునాఁ
దూర్జితబాహుగర్వమున నొప్పుదొలంగఁగఁ జేసినారమే?
తర్జన భర్జనాదుల నుదాత్తత సూపెదుగాని పోరునం
దర్జును నొంచినాఁడవె శరాసన పాండితి మేరమీఱఁగన్.

పందతనాన నుత్తరుఁడు పాఱఁగ సారథిగాఁగ దేరిపై
ముందలబెట్టి పార్థుఁడు సముజ్జ్వలసారశర ప్రకాండముల్
గ్రుంకుకొనంగ నేయఁగ వికత్తనముల్ దెగనాడు నేఁటివా
రందఱులేరొ, సంగర విహార మనోరథముల్ సెలంగవో!

నాఁడు నరుండు కైవడిని నాటిన తూఁపుల పోటుగంటులీ
నాఁడును గ్రొత్తనెత్తురులనానెడి; మాన్పఁగ లేద; యింతకే
పోడిమిమాలి యాలమునఁబోటరులంచుఁ దలంపనేల మీ
రాడిన పోటుమాటలు రణావనిఁబల్కినఁగాదె దీటగున్.

అబలయా ద్రౌపది యార్తయై కుయ్యిడ
నోలగంబునఁ జీర లొలిచినట్లు;
కపటపు ద్యూతంబుఁ గల్పించి పాండుపు
త్రులపాలి రాజ్యంబు గెలిచినట్లు;

లక్కయింటనుమే నలసి నిద్రవోయెడు
కుంతిపుత్రులఁ గాల్పఁగోరినటులు;
విషసంయుతాన్నంబుపెట్టి భీమన్నను
జంపుయత్నంబులు సలిపినట్లు;

అంత తేలికయే రణమందునిల్చి
పార్థబాణా సనోన్ముక్త పరకఠోర
కంఠలుంఠన లీలాప్రకార ఘోర
శరపరంపర కోర్వంగఁ గురుకులేశ.

జెట్టిదముగ గంధర్వులు
ముట్టగనిన్నపుడు పార్థభుజవీర్యం బి
ట్టిట్టిదనుచు నీమదికిం
దట్టదె రవయేని? యింతదాపటికంబే?

అనవుడు కోపంబురూపంబుదాల్చిన తెఱంగున నుగ్రుండై పలుకంబోవు, దుర్యోధనుని వారించి నటాలుంచనంబున గర్జించుపంచానన కిశోరంబువరవడి కర్ణుఁడిట్లనియె.

యుద్ధము గల్గినప్పుడు బలోన్నతి చూపక ధర్మశాస్త్రసం
బద్ధమనస్కులై పనికిమాలిన సుద్దులు పల్కుచుందు; రీ
బుద్ధులవేలొకో పరచమూ కరకంఠ మృణాలహంస చం
చూద్ధతి మీఱు క్రూరవిశిఖోత్కరముం బఱపింపలేనిచో.

నరుఁడడుగో రథంబుపయినా మనముబ్బఁగఁ జెంగలించి య
త్తఱిని నమస్కృతీషువు నతం డొకఁ డేయఁగ లోఁగిపోయి, ని
ర్భరగతివచ్చెఁ బార్థుఁడిఁక భండనమేల యతండు భర్గునిన్
దురమున గెల్చెఁగాదె యనదో కపికేతనుఁడంట లెస్సయే?

వీరుల యట్లు గోగ్రహణ విశ్రుతలీలకువచ్చి యర్జునుం
దేరిపయిం గనుంగొని యుదీర్ణపరాక్రముఁ డాతఁడంచు మీ
బీరము పారముందొలఁగ బెల్చనఁ గౌరవసేనముందఱం
గాఱులు వల్కమేలె పతిగాఁజేయవోందగ శంకపుట్టఁగన్

పరమాన్నంబులు*భక్ష్యముల్ *పులుసులుంబప్పప్ప*డంబుల్ తెరల్
వరుగుల్ గారెలుసుష్టుగామెసవుచున్ వహ్వాయటంచున్ రుచుల్
హారువుల్ పల్కుచు బ్రాహ్మణార్థములఁ బిండాసక్తివర్తించుమి
మ్మెఱుఁగం డేమొసుయోధనుండనిసహాయేచ్ఛన్ గడున్ వేడఁగన్

అనవుడు కోపసంక్షుబ్ధ చిత్తుండయి యంగంబున రోమాంచంబు లుప్పతిల్ల దిగ్గని గద్దియనుండి లేచి యశ్వత్థామ యిట్లనియె.

ఓరీకర్ణుఁడ, కండకావరము నిన్నూఁకింప మాబోఁటి స
ద్వీరశ్రేష్ఠుల వ్రేలుచూపి పలుకన్ దీక్షైతివే యార! నీ
బీరంబున్ సహియింపనోపనిఁక దోర్వీర్యంబు శూరత్వ మే
దీ రా చూతము; చాపపాండితి బలోదీర్ణత్వమున్ సత్త్వమున్

కులము కొంత యట్టులొనగూరెను బల్కులు, రాజరాజు ని
చ్చలు నిను బెద్దఁజేయఁగొనసాఁగెనుడంబు, పవిత్రవంశ పూ
జ్యుల మముబోఁటి యోధుల విశుద్ధయశంబును మాపునీవు పె
గ్గెల నటు గట్టిపెట్టి రణకేళికి రమ్మిట సూతనందనా.

అరయుండెక్కటములో, రథాంగములో పల్యాణంబులో కోలలో
తురగ శ్రేష్ఠములో కరీంద్రఘటలో తోత్రంబులో గాక భూ
వరులన్ బ్రాహ్మణయోధులున్న సభలో భాషింతువే ధీరునన్
బరరాజన్య గళాబ్జనాళ దళన ప్రావీణ్య ధుర్యుండునన్.

అని సజ్యంబును జేసి కార్ముకము నత్యాకుంచిత భ్రూకుటిన్
మునుకో, భీష్ముఁడు నాఁగుమాఁగుమని తాముం జేయి సారించి యా
తనిఁ బీఠంబునఁ బెట్టఁ జిత్తమునఁ గ్రోధజ్వాల ధూమంబు పై
కొనెనో నా గురుపుత్రుఁ డార్చెను సభాకూటంబు వేంద్రంబుగాన్

※ ※ ※

జననీ కంఠలతానికృంతన గళత్సారాస్రధారాముఖం
బునఁ గెంజాయలు చల్లుగొడ్డలి తృషన్ భూపాస్రసంతర్పణం
బునఁ జల్లార్చెడు క్షత్రియాన్వయము రూపున్ మాపి యారేణుకా
తనయుం; డాతఁడు బ్రాహ్మణుండొ పరుఁడో తథ్యంబు యోచింపుమా

కురుసభనుండు సర్హాత యకుంఠిత గౌరవమేఁగె; నింక ని
త్రైఁగున నిల్వనేల, పనిదీఱెనురండు మహీసురుల్, వృథా
భరమెక కౌరవేంద్రునకు; భండనమెల్లియ కాకమాన, దం
దొరసెడి గర్ణపార్థవిశిఖోద్ధురతం గనుఁగొందుమేగదా!

సూతసుతుండ నయ్యెదనొ సూర్యతనూజుఁడ నౌదునో రిపు
ద్యోతిత కంఠనాళ రుధిరోదధిలో జయలక్ష్మిపోత ము
ఖ్యాతలువోవ నెట్టుకొని యుద్ధతినేఁగెడువాఁడు సూతసం
జాతుఁడొ క్షత్రియాన్వయ నిశాపరిపూర్ణసుధామయూఖుఁడో
తేరకుఁ గౌరవేశ్వరునిఁ దిట్టుచుఁ దిమ్ముచు వాలుబొజ్జలన్
భేరులలీలఁ బెంచికొని పెద్దఱికంబు భరింపుడన్న నిం
కేరును నోరులెత్తనటు లెంతయు మాటకు వేయిమాటలన్
దూఱుట కబ్బసంబయిన దూబలతో సరిపల్కవచ్చునే?

అవనిసురుల కొఱకు సమవస నిలుచునా
పుంజులేక పోరిద్దువాడవకున్నె!
చూతమింక రణము చొప్పడునప్పుడు
నర్జునుండు శరము లడరునపుడు.

* * *

బలవంతులైన వైరుల
మెలకువఁ దప్పించుకొనుట మేలగు; మధురో
జ్జ్వలవాక్పూర్ణుఁడు, కార్యం
బులవిజ్ఞుఁడు సంజయుండు, పోలఁగ నతనిన్.

కుంతీపుత్రులపాలికంపి యట నెగ్గుల్ పుట్టకుండం గదుర్
శాంతోక్తుల్ నుడివించి సంధివిధముల్ చర్చింపఁజేయించి దు
ర్దాంతాభ్యాగమలీల మాన్పి ధరణీరాజ్యంబు నేలుండు మా
స్వాంతంబుల్ ముదమొందఁ బాండవకురుక్ష్మాపాలకుల్ నెమ్మిమై

లేరేపూర్వులు కీర్తిధన్యులు ధరాలేఖ ప్రభుల్ సద్గుణో
దారుల్ శూరులు వారితోడ నొకచింతాకైనఁ గొంపోయిరే,
పేరుంగీర్తి యెకాదె నిల్చినది, నీవేయెంచుమీ, దుష్టచే
ష్టారక్తిందగు రాజులం బ్రజలు విశ్వాసంబుతోఁ గొల్తురే?

సరసిజబాంధవుండు విలసత్కరపంక్తి దొలంగి రక్తవ
ర్ణ రమనుదాల్చి పశ్చిమధరాధర శృంగముపైకిఁబ్రాకఁ, ద
ద్గిరి విలసిల్లె సల్లలితదీప్తిని కాలవరుండు సంధ్యకున్
సరసతఁగూర్చు హేమకలశస్ఫురితంబు గుడారమోయనన్.

కాంతాకాంతుల సౌఖ్యవల్లరులు చక్రంబూయ నిండారు పై
కాంతుల్ నాఁగ సుధామయూఖుఁడుదయగ్రావంబునందోఁప న
త్యంతం బభ్రచరద్ధునీ సలిల భంగాభోగడిండీర ఖం
డాంతః స్వచ్ఛసితప్రభాకలితమై వ్యాపించెడిన్ వెన్నెలల్.

మారుని యుద్యోగంబిఁకఁ
దీపిక యగుననుచు ముందుఁ దెలిపెడి ధవళా
కారపు టాజ్ఞాపత్రము
నా రాజిలె నింద్రదిక్కు నలుపు వదలుచున్.

లలితానేక సుమప్రకాండ లతికాలాస్యంబులన్ మీఁటె యు
జ్జ్వల చంద్రోపల సంస్రవత్సలిల మిచ్చం గ్రుంకి యామీఁద గం
ధిల శీతామలవాతపోతములు ప్రీతింజొచ్చె శయ్యాగృహం
బులఁ గాంతామృదుగండ ఘర్మకణికాపూరంబులం ద్రావఁగన్

* * *

కులుకుంగ త్తెలు సీటిబిందెలు భుజాకూలంకషస్ఫూర్తిఁ దా
ల్చలతాంతాయుధుచిహ్నముల్ గలుగు లేఁజెక్కుల్చనుల్వ్రాతెఱ
లోనలపున్నెన్నడలుం బరస్పరము నాలోకించి హేలావచో
విలసల్ స్వాంతతఁ బోవుచుండిరి సరోవీథిన్ విహారించుచున్.

* * *

అంతధృతరాష్ట్రుండును దక్కంగల సుతహితామాత్య బంధువర్గంబులు సభామందిరమున నోలగంబుండి సంజయుని రావించుడు ఆతనిదిక్కు మొగంబై యంధభూపతి యిట్లనియె:

సుమతివి, మధురాలాప
క్రమచాతురిఁగలవు; రాజకార్యజ్ఞుఁడవీ
వు మతిఁదలంచిన యత్నము
సమకూరు నిరస్తవిఘ్నసముదాయంబై.

అవ్యయసంగరాంగణవిహారులు పాండుతనూజు లాయుప
ప్లావ్యపురంబునన్ మురవిపాటను గూడి వసించువారలీ
వేవ్యతిరేకభాషణములెత్తక యుక్తిఁ దదీయచిత్తచిం
తావ్యయముం బొనర్చి యమితక్రుధదీఱు వచోమనోజ్ఞతన్.

కనఁబఱచి వననివాసం
బునఁబొందిన ఖేదమును సమూలంబుగ నా
డ్చి నయముసెప్పి రణంబున
కనుమతిలేకుండు తెఱఁగు నరసి పల్కుమీ.

* * *

నాపూర్వపుణ్య ఫలములు
దీపించెనొ నాఁగ మిమ్ముఁ దేజోమయులన్
బాపవిదూరుల సుమతులఁ
బ్రాపించుట గల్గె నంధపతి మూలమునన్.
మీర లుపప్లావ్యంబునఁ
జేరుటవిని వృద్ధనృపతి చిత్తంబున బొం
గారెడు వాత్సల్యంబునఁ
గోరి ననుంబంపె మీదు కుశలంబడుగన్.
వనవాసాయాసంబులు
ఘనమగు నాపదల నెల్లఁ గడపి యుపాయం
బును బొరయక మీవచ్చుట
మనమున ధృతరాష్ట్రపతి ప్రమదముం బొందెన్.

* * *

అనవుడు సంజయు,గని ధ
ర్మనందనుఁడు పల్కె గూఢమతియై మేమా
జనకుని వాత్సల్య భరం
బునఁగాదే కానఁ గష్టములు పుచ్చుటయున్.
సేమమే వృద్ధనృపతికి శ్రీసమృద్ధి
యుతమె రాజ్యంబు ధృతరాష్ట్ర సుతశతంబు
జనకునాజ్ఞ నడపుచున్నె, సర్వజనులు
నాయురారోగ్య విభవంబు లందువారె?

గురుకృపభీష్మ ద్రోణులు
నిరతముసౌఖ్యంబు లంది నెగడుదు రే, యా
కురురాజువారి మతి షొం
దరసి నటించునె సగౌరవాంచితరీతిన్!

సూతసుతుఁడు కర్ణుఁడు వి
ఖ్యాతరమాపూజ్యరాజ్య కలితుఁడు కురుభూ
మీతలపతియును సౌఖ్య
స్ఫాతిఁ బరస్పరముఁ గలసి వర్తించెదరే

*　　　*　　　*

అనవిని సంజయుండించుక దైన్యము మోమునం దులకింపఁ గౌంతేయాగ్రజున కిట్లనియె:

ధార్తరాష్ట్రులు సతము మత్తద్విపేంద్ర
ముల తెఱంగున స్వాతంత్ర్యమునఁ గడంగి
కార్యభారము వహియింపఁ గలదె వృద్ధ
కురుపతికి గుండెలొక్కటఁ గుదుటవడుట.

శకునికర్ణదుశ్శాసన వికటమతులు
ధారుణీపాలనాది సందర్భములను
దోడుపడఁ గౌరవేశుఁడు దుష్టబుద్ధి
గాని తెఱఁగు కొండొకఁడు గలదె చెపుఁడ.

*　　　*　　　*

అనవిని ధర్మనందనుండిట్లనియె:

ఎపుడైనన్ గద పోరుగల్గునెడ నెంతే మోదమే పార భూ
మి పతుల్ భీముగదావిహారచణతోన్మేషంబుఁ జింతుంతురే?
కృపభీష్మాఖిల వీరయోధులు సభం గీర్తింతురే విద్విష
త్తపనాపాదకగాండివంపుఁ బస నుత్తాలత్వమున్ సంజయా.

* * *

అదుగో పాండవ కల్పశాఖి కరుణాస్వాంతుఁడు దైత్యాంతకుం,
డదుగో భీముఁడు, వాఁడె యర్జునుఁడు నల్లారే కవల్ వారి వెం
బడియున్నారదెమాఁడు బాంధవహితామాత్యుల్మహారాజులున్.
గడఁకం జెప్పుమ వార్తలున్న నిచటన్ గౌతూహలంబొత్తఁగన్.

వారు వినంగరాని యెటువంటి రహస్యము లేని మాకు బం
గారము వచ్చినన్ వినుటగాదు; సభాస్థలమందు నిమ్యోడం
జేరినవారలెల్లరును శ్రేష్ఠులు శిష్టులు మిత్రబాంధవుల్
శూరులు పండితుల్ గురుయశోధరులాట నెఱుంగుమీ మదిన్.

కావున ధృతరాష్ట్రుఁడు ని
న్నేవిధి వచియింపఁబంపె నింపు దొలఁక నీ
వావార్త లుగ్గడింపుమ
మావారలు మేము ముద మమందతఁ గాంచన్.

అని పాండుక్షితిపాలకాగ్రతనయుం డాడంగ సూతాత్మజుం
డును దద్గర్వవచోవిధానమున కొండుం బల్కకే యోలగం
బునఁ గూర్చుండిన వారికందఱికి సమ్మోదంబుగన్ మ్రొక్కియి
ట్లని యెందేని యసోనలం జిలుకు రమ్యాలాపముల్ భక్తిమై.

కాలమువచ్చెఁగృష్ణ, కలకాలముఁ బాండవకౌరవేశ్వరుల్
బాలురనాఁటినుండి యెదఁబాటిలు నీర్ష్యనడంప, బంధువుల్
పోలగ సర్వసౌఖ్యములు పొందగ, నెయ్యముభోగభాగ్యముల్
చాలఁబరిగ్రహించి పరిజనసంతసమొందఁగ శాంతిమీఱఁగన్.

శాంతాకారుఁడవీవు కృ
తాంతాత్మజుఁడును క్షమాపరాత్ముఁడు మీఱ
త్యంతముఁ జేరినయెడ నో
క్కింత జనక్షోభమెత్తునే శ్రీకృష్ణా!

శరమునకున్ ధనుస్సునకు సంధియొడంబడ దుర్నిరీక్ష్యమై
పరఁగువిధానఁ గౌరవులు పాండవులుందగఁ గూడియున్న నె
వ్వరికిని వారిఁదేటి కనవచ్చునె? శాత్రవకోటి సంగరో
ద్ధురభుజగర్వ నిష్ఠురత దొల్గదె వెల్గదె దోఃపరితాపమున్.

* * *

మారుత పుత్రుఁడొక్కఁడె యమానుషశక్తి గదాప్రహారదు
ర్వారత వైరివీరనికరంబుల నెత్తురు లొల్క మొత్తి పు
ష్పారుణవంజుళద్రుమము లట్లొనరించి జయేందిరన్ వసం
తోరువనీవిహారమున నుల్లమురంజిలఁజేయఁడే, నృపా.

సవ్యాపసవ్యకరముల
నవ్యయశరముల్ నిగుడ్చి యర్జునుఁడు రిపూ
గ్రవ్యథ యను మాల్యంబున
భవ్య విజయలక్ష్మి గొనఁడె భండనవిపణిన్.

* * *

ఐన నజాతశత్రుఁడు నయంబుఁ దితీక్షయు ధర్మరక్తియుం
బూనిన సాత్వికుండగుట బుద్ధివిహీను లొనర్చు సేఁత యొం
డేనియుఁ దప్పుగాఁదలఁచి యేయపకారము సల్పనోపఁడెం
తే నియతాత్మతం బవర మెంచు జనార్తికి మూలమౌటచే.

*　*　*

ధరణిన్ క్షత్రియఘస్మరుండయి భుజాదర్పంబునం జాప వి
ద్య, రణావేశమునం బ్రతాపగరిమన్ ధైర్యంబునం దుద్ది యె
వ్వరు లేకుండెడు జామదగ్ని సమరవ్యాపార పారీణతం
బోరినొప్పించిన భీష్ముఁడాహవమునం బోరంగ మాఱుండునే?
చాపాచార్య శరప్రయోగ విలసచ్చాతుర్య సంకీర్తనం
బేపారన్ రణమందునీల్గు పరభూమీశుల్ వచింపంగ నా
రా! పాఱుండు దలాలి మాకనుచు స్వర్గస్త్రీలు పానాత్తమం
దాపాంగంబులఁ గాంతులంగనఁగ నేనా తాదృశుం బల్కుటల్!
గురుసుతుఁడైన నేమి, తనకున్ రణమబ్బినఁ బూర్వపుణ్యమం
చనసముఁ బొందు శౌర్యనిధి; యాతఁడు దివ్యను రేఁగియాశుగో
త్కరముల నుద్ధతిం బఱపఁ దచ్ఛర ఝుంకృతి హెచ్చఁగించు ని
ర్భరకులిశాయుధాగ్రముల వాడిమి పోడిమిమాలు వైరికిన్.
కర్ణుఁడు వైరివీరలయకాలుఁడు కార్ముకమంది శౌర్య సం
పూర్ణతఁ గ్రోధమూర్తియయి పోరఁగడంగి నిశాతబాణముల్
ఘూర్ణిలు సేనసేయ రిపుకోటి శివుండో రమాధవుండో యా
కర్ణుఁడో యంచు నిర్ణయముగాక గణింతురు నాకమేగుచో.

రాధేయుండు సమస్తగర్విత రిపువ్రాత ప్రతాపోద్ధతిన్
బాధింపంగ సమర్థుఁడంచెపుడు సౌభ్రాత్రంబు పాటించు చా
యోధాగ్రేసరు గౌరవించుఁ గురుభూపోత్తంసుఁ డత్యంతమున్
మేధాయుక్తునిఁ గర్ణునిం బొగడఁగన్ నేనెంతవాఁడన్ నృపా.

అంగపతి సూత సుతుండని యుపాలంభించుటయేగాక దాననేమి శౌర్యంబునకు లోటు వాటిల్లెనే?

సూతసుతుండ యాటయది సొంపెగదా, కదనోగ్రబాహు గ
ర్వాతత సైన్య మత్స్యనిచయాంతక శాతకలంబ కల్పనా
ద్యోతిత జాలమొప్ప సమరోదధి స్యందనపోతమెక్కి ప్ర
స్ఫీతవిహారతన్ ధరకు వ్రేఁగగు ధీవరమాన్యుఁడుర్విపా!

* * *

కావునఁ దుల్యబలులైన యిరుతెగలవారు నెమ్మిమై నుంట శ్రేయంబు నావుడు కర్ణదుర్యోధన శౌర్యోత్కర్ష కథనంబు సహింపనోపక యీసడించి భీమసేనుండు వెక్కసముగ నిట్లనియె.

ఔరౌ సంజయ, కర్ణబాహుబల విఖ్యాతిం బ్రశంసించె దీ
వీపాండుక్షితిపాలసూనులకడన్ హెచ్చింపుగన్, సౌబలే
యీపుత్రుల్ నినుఁ జేరఁబట్టిన ఋణంబీగంగ వర్తించి తౌ
రా! పార్థున్ హరినైనఁ జూడవలదా రాధేయుఁ గీర్తించుచో

* * *

మీదుర్యోధను శౌర్యసాహసములన్ మేమెల్ల వీక్షింపలే
దే దెల్లమ్ముగ ఘోషయాత్ర, మఱి యింకేలా నుతింపంగ వా
గ్వాదంబుల్ బలియంగ నేమిటికి వక్కాణింపుమీ వృద్ధరా
జాదుల్ పల్కిన తేరమాటలను మాయన్నయ్య శాంతింపఁగన్.

※ ※ ※

[ఈకావ్యము అసంపూర్ణము. 215 పద్యములు వ్రాయఁబడియుండినవి.]

# సింహప్రబోధము

సమ్మోదంబున వన్యసత్వములు నిన్ సామ్రాజ్య భారమ్ముఁగై
కొమ్మంచున్ బ్రతిమాలుచుండ దినముం గుంభీంద్ర ఫాలాస్రమాం
సమ్ముం ద్రావుచు మెక్కుచుం దిరుగు నీశౌర్యమ్మదేమాయె సిం
హమ్మా, కాననరాజ్య మేలఁజనుమా యత్యంత స్వేచ్ఛారతిన్
కమ్ముల్దాపిన బోనునన్ నిలిపి సౌఖ్యమ్ముల్ దొలంగించి రా
పొమ్మంచున్ వినయంబు నేర్పి, తుదకుం బూర్వంపు రోషమ్ము శౌ
ర్యమ్మున్ లేమిని నైజముం జలిపె నాహా! కాలచక్రమ్మ, సిం
హమ్మా, కాననరాజ్యమేలఁ జనుమా యత్యంత స్వేచ్ఛారతిన్
సొమ్మల్ వాఱెడు నీ మొగంబు గనినన్ శోకంబు పెల్లుబ్బు; బీ
రమ్ముల్వ్రేల్చు వృకంబు లీవెసఁగి దుర్వారాత్మ వీర్యమ్మునన్
హుమ్మంచున్ వడిబోను వ్రచ్చి చనఁగు ద్యోయంచుబో నేమొ సిం
హమ్మా, కాననరాజ్యమేలఁ జనుమా యత్యంత స్వేచ్ఛారతిన్.
వమ్మౌనో జతనంబటంచు నిరసింపం బోకు యత్నమ్మ; నై
జమ్ముల్ మార్పులు; స్వీయమౌబలము సచ్ఛౌర్యమ్ము మేధాప్రకా
రమ్ముల్ శంకయొనర్చి దీనతఁబడన్ రంజింపె యోచింపు సిం
హమ్మా, కాననరాజ్యమేలఁ జనుమా యత్యంత స్వేచ్ఛారతిన్

చుమ్మల్ చుట్టగఁ బొట్టగట్టుకొనిహుస్సులాడుచున్ మేకఁమాం
సమ్ముం బెట్టెఁడు దిందువో, పలలమిచ్చుంగాన భక్షింతువో;
కమ్మల్ గిమ్మలు స్వప్నబంధములువీఁకన్ బోనులంఘింపు సిం
హమ్మా, కాననరాజ్యమేలఁజనుమా యత్యంతస్వేచ్ఛారతిన్.

---

# కవి

---

సరసకవీశ, నీయశము సర్వదిగంచల చంచలేక్షణా
వరకుచ చందనాంకమయి పండితచిత్త చకోర చంద్రికో
త్కరమయి, కాలపత్త్రమున గట్టిగ వ్రాసిన వర్ణపంక్తియై
ధర వెలుఁగొందుత న్జనవితానము సన్నుతియింప నిత్యము న్

నీయాశయంబులే నిఖిలలోకమునకు
　　మార్గదర్శకములై మహిమఁదాల్చు;
నీమహాసూక్తులే నిర్ణిద్ర విజ్ఞాన
　　పటిమ సంపాదించుఁ బ్రజలకెల్ల;
నీసరసోక్తులే నీరసాత్మునకైనఁ
　　గరుణాంకుర స్ఫూర్తి గలుగఁజేయు;
నీ వీరవాక్కులే నిర్బలాంగకునైనఁ
　　గరవాలు దూయించుఁ గలనుసలుప;

నీవు గలుగని సంఘంబు నిర్మనంబు;
నీవు పుట్టని దేశంబు నిష్ఫలంబు;
నీవు దలఁపని యూహాలు నీరసములు;
నిన్నుఁ బొందని వాక్తతి నిందితంబు.

సత్యమ్ము ధర్మమ్ము శౌర్యమ్ము వీర్యమ్ము
మూర్తీభవించె నీమూలముననె;
సాంఘికాచార సంచయము శాశ్వతముగ
మూర్తీభవించె నీమూలముననె;
దృగ్గోచరముగాని దివ్యభావము లెల్ల
మూర్తీభవించె నీమూలముననె;
భూతకాలైక భూభుజుల చారిత్రముల్
మూర్తీభవించె నీమూలముననె;

నీమహత్త్వము నేమని నేనుతింతు;
నీవు వచియించు నదియెల్ల నిత్యమగును;
సమయభేదావరోధంబు సమసిపోవు;
సకల సజ్జన సన్నుత సత్కవీంద్ర,

---

# సంక్రాంతిపండుగ

---

గరుడ స్తంభము చేతఁబట్టి చలికిం గాయంబు కంపింపఁగన్
స్వరముల్ గద్గద మొంద మేలుకొలుపుత్సాహంబుగం బాడుచున్
దరమున్ భోమ్మనియూఁదుచున్ ఘణఘణధ్వానంబుగన్ జాగటం
బోరివాయించుచు దాసరయ్య దిరిగెం బ్రోలెల్లడన్ వేకువన్
చలికప్పున్ సడలింపలేక ప్రణయస్పర్థన్ రహశ్శయ్యపై
నలుకంబొర్లుచుఁ బ్రత్యుషంబున గవాక్షాయాత సూర్యాంశువుల్
దళుకున్ బంగరు నిగ్గులం జిలుకఁ గాంతా, లేవెయంచ త్తయుం
బలుకన్ లేచెను గాఁపుకోడలెఱికల్ పయ్యంట బాగొత్తుచున్.

అలరు సుమావరోధమును నల్లఁ గ్రమించి కవోష్ణదీధితుల్
చిలుకుచు లోకబాంధవుఁడు శీతలతన్ హరియించి చెట్లకొ
మ్మలఁ జిగురాకు జొంపములు మాదిరి మీఱఁగ నెఱ్ఱడాలుపూఁ
తలఁ బచరించెఁ గల్యరమతాఁగయిసేసెనొ నాఁగఁ బండుగన్.

సరసిజలంబులాడి వెనుజాఱిన క్రొవ్వెద వారిబిందువుల్
దొరఁగి సువాసినీ వితతి తోయములంగొనిపోవుచుండఁగా
నరుణ మయూఖపాళి నిటలాలక సంతతులన్ మెలంగి కే
సరయుత పద్మ విభ్రమము సంధిలఁ జేసెను ముద్దుమోములన్.

పూవులు క్రొమ్ముడిం దుఱిమి భూషణరాజి మెయిన్ ధరించి శో
భావహమైన పట్టుజరీపయ్యెదలం గయిసేసి ద్వారబం
ధావళిఁగామినీమణు లుదంచితరీతి నలంకరించుచున్
హా! విలసిల్లె నెంతయు గృహాంగణముల్ నవదీప్తిశోభలన్.

---

# భారతమాతృ ప్రబోధము.

---

లెమ్మో మాతరొ యీ ప్రభాతరుచులన్ లీనమ్ములై యంధకారమ్ముల్ వీఁగె; మనః ప్రబోధక కలారావంబుగం బక్షులున్ సమ్మోదమ్మునఁ బాడె నీచరితముల్ శౌర్యమ్ముపొంగంగ; లేవమ్మా, స్వాప్నికశయ్యవీడి,కనుమా యందందస్సూర్యాంశులన్ ఫలభారంబు ధరింపనున్న మొగడల్ వాసంతమందానిలంబులకుం బూచి భవిష్యదద్భుతఫలస్ఫూర్తిం బిసాళించు చిహ్నాలసూచించెఁ, దదీయవాసనలకైనన్ లేచి యోతల్లి, నీ తళుకుంగన్నులఁ గప్పుముంగురులఁ జిత్తంబారఁ బైకొత్తవే.

మును గంగాలహరీతరంగతతులన్ భోర్కొట్ట స్వాతంత్ర్యగాన నినాదంబులు నేఁడు త్వత్ప్రియసుతానందాత్మ వీణారవమ్మున సమ్మేళనమంది నాగరకతా పూర్ణత్వసంధాన సూత్రనినాదంబయి మిన్నుముట్టె జననీ, తల్పంబు వేడిగ్గవే.

కాళిందీ సికతాప్రదేశముల మున్ గల్యాణ కృష్ణుండు సల్లీలన్ వేణురవ ప్రబోధములఁ దల్లీ నిన్ను మేల్కొల్పె నిద్రాలోకమ్ముననుండి; నేఁడును సుధాధారాభినిష్యందగీతాలోలమ్ముగనారవీంద్రకవి నిన్నగ్గించెఁ, గన్నెత్తవే.

నీపుత్రుల్ గనుచున్న స్వప్నశతముల్ నిండారు సత్యమ్ములై
దాపుం జేరెడు మూర్తిమంతములుగా ధైర్యమ్ముఁ బ్రేరించుచున్
మాపుణ్యంబు ఫలోదయంబగు నెడన్ మమ్మెల్ల దీవింప ని
ద్రా పర్యంకము వీడిరమ్ము జననీ రాగంబవార్యంబుగన్.

---

# విమర్శకుఁడు.

---

విను: కవితావిమర్శకుఁడ, పెద్దఱికంబును మానుమింక, నీ
మనము శిలామయంబొ, యభిమానమనంతమొ, కోమలాశయం
బణఁగెనొ, సత్కవిత్వపరమావధి నందితొ, శబ్దలోక జీ
వనమగు భావసృష్టి నలుపన్ గమకింతువొ, పూవుఁదేనెకున్
మునుకొని మూఁగు తేఁటి పెనుమూఁకలజుమ్మనుకమ్మగీతితో
నెనయగు శబ్దరత్నము లనేకము సుందరభావసూత్రమం
దొనరఁగఁగూర్చుచుందువొ, రసోజ్జ్వలయాకవితావధూటి మో
హాసముగ నివ్వరించునొ, యహర్ముఖమందు హసించు పూవులం
దొనుఁకు తుషార బిందువులు దోఁచిన మోదరసాంకితాశ్రు సం
జననము గల్గునో, వివిధసాంధ్యవిలాసము లంకురింప మిం
చినతమిఁ బశ్చిమాశఁగల చిత్రములం దిలకింతువో ఘనా
ఘనములు నంతరాళమున గంతులువైవఁగఁ జూచుచుందువో,
వనభృతకాకలీ కలరవంబులు వింతువొ, భూధరంబులన్
వనుల వయాళి సల్పెదొ, స్రవంతి నిపాతముఁ గాంతువో నిశీ
థినిఁజని యొంటిగా నిసుకతిన్నెల మేనరమోపి తారకా
స్వనమున గర్భితంబయిన భావరహస్యముఁ గందువో మదిన్ .
తనివి సనంగవ్యాకృతియుఁ దక్కినలక్షణ లక్ష్యముల్ మనం

బునఁ బెనుజిడ్డు గట్ట నెగఁబోసి యజీర్ణవు గాలి త్రేఁచుచుఁ
మనియెడినీకుఁ గావ్యరసమాధురి నాని యథార్థలోక సీ
మ నొకత్రుటిం గ్రమించిక్షణమాత్రముస్వర్గముచూఱగొట్టఁబో
లునె? సరసాత్మ కోమలత లోపముచేసెను నీకుబ్రహ్మ! కా
దనియెదొ? యట్టులేని మధురామృత శీకరముల్ వెలార్చుమో
హన కవితాసుమంబులను నగ్గి రగుల్తు వదేల? పుట్టు మ
చ్చను దోలఁగింపనెంచి నవసారస నేత్రి కపోలఫల్కముఁ
ఘనముగ గంధకామ్లమునఁ గాల్చినరీతిఁ బటంబునందు బొ
మ్మను దిలకించి నేత్రములమాదిరి దప్పెనటంచు దబ్బనం
బునఁ దెగదిద్ది కన్నుఁగవ పోడిమి నూడ్చెడు పోల్కి కావ్యముం
గొని వివిధావయంబులనుగోసి కసాయిబజారుఁ బెట్టెదో?
కనుఁగొనవోయి ముఁ గవియగాధ హృదంబుధి గర్భ గుప్త ర
త్ననిచయముఁ బదింబదిగఁ దత్తటమందుఁ జరించిచూచి; భా
షను నెఱసుల్ గలంచ సరసంబగు పద్ధతి దిద్దుచుందుమం
చనుటయె! యెవ్విమర్శనమునైన విమర్శన దృష్టిఁజూడ ఈ
సును వెలిగ్రక్కుచుండు; గడుసుందనమెంతయు భాష సేవ సే
యనుదగు సాధనంబొ, మదియందు నెదోయనుమానమున్న యో
చనమొయిఁ జర్చ సేయ కవిచారతఁ దప్పులటంచు దిద్దు నీ
యనుభవ మేమి సెప్పను! మహాశయులే వెడ సేఁతఁగాంచి ప
క్కున నగరే? మహాకవి నకుంఠితరీతి నడింప గౌరవం
బొనరు నటంచు నెంచెదవహో! యిదిధర్మమె? చిత్రకారుఁడుఁ

అనుదినముం బ్రయత్నమున నద్భుతచిత్రములన్ లిఖింప ఈ
సున నొకడట్టి లేఖ్యములఁజూచి మషీజల సేచనంబు చే
సిన నదియానె నైపుణి? కుశేశయపత్రవిశాలనేత్ర నొ
క్కనెలఁతఁ గూడుచెలికారము చొప్పడ నెన్నొయత్నముల్
పొనరిచియుం గృతార్థతను బొందక తత్ప్రణయంబు నీర్ష్యగా
నొనరిచి కాంతనేచు నొక యున్మమభంగిఁ బికస్వరస్ఫుట
స్వనమును హంసికాగతియు సారవచో విభవంబుముగ్ధ మో
హన తనువల్లిగల్గు కవితాంగన కౌఁగిలి గోర నాకె ఛీ
యనుచుఁ దిరస్కరింప రదనాంచలముల్ పొడిగాగ గీటి క
న్గొనలను గెంపులూర "నిదిగో కనుఁగొమ్ము విమర్శనాస్త్రముం
గొని దినపత్రికాధనువుగూరిచి నిన్నొగిలింతు" నం బ్రతి
జ్ఞను నెఱవేర్పఁబూని కడఁకం గువిమర్శనకార్యదీక్షఁ జే
కొనెదవు; పండితోత్తములకుం గవివర్యులకుం బరస్పరం
బును నెవియో విరోధములు పుట్టిన యప్డె విమర్శనంబు పు
ట్టును;నటులౌటఁ జిత్తము పటుక్రుధతోఁ జ్వలియింపనొప్పులుం
గనఁబడు తప్పులట్లు; లోకకావ్యమునందున నొప్పుదప్పులం
గని రసముల్ గణించి, మొసకమ్మగు భావములం దలంచి శో
భను గమనించి, శిల్పకళపద్ధతిఁగాంచియు నౌచితిం గనుం
గొని, కవిచిత్తమారసియు క్రోధముఁ బాసి విశేషశాంతభా
వనియతితో విమర్శనము వ్రాసిన నయ్యది మార్గసూచియై
తనరునుగాని పండితుఁడు తప్పులనే యొక కొన్నిచూపి యొ

ష్టును గమనింపకుండుట పరిపూర్ణవిమర్శన శక్తియౌనె? చిం
తన మొనరింపుమయ్య, కవితాసుమంజరి కమ్మతావులం
గొని సువిమర్శనానిలము గూర్చి మానవపాళికెల్లఁ బం
చిన నది మేలు సేతయగు; శ్రేయము కీర్తియు నీకుఁ జేకుఱున్;
మునుపటినుండి నీవచన ముద్గరసంహతి నెందఱో కవుల్
మనమెఱియంబొకారిరి; కుమారికలౌ కవితాలతాంగులే
యనలముఁ జొచ్చిరో, రసమయంబుగ నేఁటికిఁ గైత సెప్పఁజా
లిన కవులెందఱో తొలిమలిం గుఱిపెట్టు విమర్శతాఁకునన్
దినదినముం గృశించి యతిదీనత నీకవితోద్యమంబె మా
నినసుఖమంచు నెంచిరొ, వినీతి నిఁకం గవిమారకాస్త్రలీ
లను నుపసంహరింపుమి కళాపరిపూర్తికి దారిచూపుమీ.

---

# దేశమాతృస్తవము.

---

ఏధీరహృదయుకు నింపారు హిమవద్ధ
        రాధరంబు కిరీటరాజమయ్యె;
ఏపుణ్యచరిత కహీన గంగాసింధు
        వాహినుల్ తోమాలె వలె రహించె;
ఏమహాసాధ్వికిఁ గోమలతరులతా
        బృందమ్ము పులకలచందమయ్యె;
ఏవీరమాతకు దేవారిపురిలంక
        పాదపీఠంబుగఁ బరిఢవిల్లె;

అట్టితల్లిని నిన్ను జేపెట్టి యెపుడు
భక్తిసేవింతుమమ్మ నీపాదమాన;
మమ్ము నీపుత్రికులఁ గావుమమ్మ కరుణ;
దివ్యశక్తిపరిపూత యోదేశమాత.

కోఱలు ముప్పదిమూడుకోట్ల కోటీరముల్
        నక్షత్రచయములై నభము ముట్ట;
ఘోరారి మదకుంభి కుంభశోణితధార
        లేఱులై సెలవులఁ బాఱుచుండ;

వజ్రిప్రభావ నిర్భరత శాసించెదు
  శాతత్రిశూలంబు చేత మెఱయ;
నీలకంధరవర్ణ నిబిడమై దేహంబు
  భూనభోంతరములఁ బూరటిల్ల
దుర్ణిరీక్ష్యప్రతాపంబుతోడఁ దాండ
వంబు సల్పెడు నీస్వరూపంబు మాకు
దర్శనంబీయఁ గొల్తు నితాంతభక్తి
దివ్యశక్తిప్రపూత యోదేశమాత!

వేదాంతవిద్యా వివేకస్వరూపకుం
  డల వివేకానందు నాత్మ శక్తి;
ప్రకృతివిజ్ఞానశాస్త్ర ప్రవీణుఁడు జగ
  దీశచంద్రుని బుద్ధిపేశలతయు;
కవితారసాస్వాద నవనీతకంఠుండు
  కవిరవీంద్రుని కావ్యగానరక్తి;
చిత్రకళాప్రభా శేముషీ ధుర్యుండు
  రవివర్మ తూలికారత్నమహిమ
మాకుదయచేసి విద్యావివేకఘనులు
గా నొనర్పుమ వాత్సల్య గరిమ మమ్ము;
కనుమ పూర్వస్మృతిని కొంత మనమునందు
దివ్యశక్తి ప్రపూత యోదేశమాత!

దుర్వారశత్రు సందోహమ్ము మర్దింపఁ
దొడరునట్లుగ శౌర్యదోర్బలంబు;
నీమహావిఖ్యాతి నిత్యంబు వినుతించి
చెలఁగునట్లుగ మాదు జిహ్వాలతయు;
స్వాతంత్ర్యబలివేది సన్నిధిఁ గానుక
లర్పించునట్లుగ నాత్మదృఢత;
కావింపఁ దలపెట్టు కార్యాళి సాధింపఁ
గడఁగు నట్లుగ వీరకార్యదీక్ష.

అమ్మ ప్రతిపక్ష వీరసంహార ఘోర
భీకర కరాళ రూపిణీ, ప్రీతిమీఱ
మాకు దయసేయుమమ్మ తన్మహిమలెల్ల
దివ్యశక్తి ప్రపూత యోదేశమాత!

పుణ్యస్రవంతికా పులినభాగంబుల
వేద ఋక్కుల ఘోష వెలయవలయు;
హైందవ యువకుల యాత్మదర్పణముల
నీమనోహరమూర్తి నెగడవలయు;
ఆరణ్య విశ్వవిద్యాలయమ్ములయందు
విద్యార్థులను జదివింపవలయు;
భారతీయులొనర్చు ప్రతికార్యమునయందు
జాతీయతావ్యక్తి చాటవలయు;

ఎట్టు దిద్దెదో పుత్రుల నింకమీఁదఁ,
బూర్వశోకమ్ము విడనాడి పూనుకొమ్ము
గౌరవాస్పదానల్ప సత్కార్యదీక్ష
దివ్యశక్తి ప్రపూత, యోదేశమాత!

# జలజము.

సంతమసావరోధమున సన్ననిమంచు చెఱంగుఁగప్పి నీ
వెంతయు వంతలంబొగుల నింతకురాడు మయూఖమాలి తా
నెంత కఠోరచిత్తుఁడొ సహించునొకో ప్రణయప్రవాహ సం
క్రాంత మనస్కవై చెలఁగు కాంత హృదీశుఁ డుపేక్ష చేసినన్.

కడు గర్భస్థ మిళిందబృందము మిషన్ గగ్గోలుగానేడ్చి సం
దడిసేయంగ నిఁకేల వారిజమ, యుద్యద్ధాళధళ్య ప్రభం
బుడమిన్ ముంచుచువచ్చు మిత్రుఁడనుచున్ బోధింపఁ బెన్వేచు లం
బడి నిన్ జేర రథాంగదంపతులు ప్రేమన్ వచ్చె వీక్షింపుమా.

అరుణుఁడు వొల్చె శీర్ష మకుటాగ్రమణీమయకాంతి పుంజముల్
వఱలఁగ; వందిమాగధుల భాతి ఖగంబులు గూసెఁ; జీఁకటుల్
దొఱఁగెను; నింకనైన మది దుఃఖము వాసి ప్రసన్నచిత్తవై
కరుణ ననుగ్రహింపు బలుకౌఁగిటఁ గాంతుని; నల్కమానుమీ

# ఆశీర్వాదము.

---

లోకోజ్జీవన కరమయి
ప్రాకట రసభావ శిల్ప భరితంబయి నూ
త్నాకారంబుల వెలసెడు
నీకవిత చెలంగుఁగాత నిత్యము సుకవీ!

శారదచంద్రికా స్ఫురిత శర్వరులందు నదీతరంగ ఝుం
కార రవానుకారియయి కమ్ర రసాభ్యుచితప్రచారియై
సారస నిర్యదంబు ఘనసార సుశీతలతం జెలంగి సొం
పారునుగాత! నీకవిత యాంధ్రకవీ, రసికోపభోగ్యమై.

ఱాలఁ గరంచి మ్రోడుల సరాళకిసాల చయంబులొత్తి శో
భాలలితార్ద్రభావ రసభంగులకుం దలిదండ్రులైన వా
గ్జాలముగూర్చి గీతముల సత్కవిశేఖర, పాడిపాడి యాం
ధ్రాలి చిరప్రసుప్తమగు నాత్మను నిద్దురలేపు మియ్యెడన్.

---

# బంభర శుకకీట సంవాదము.

---

శుకకీటంబునుగాంచి బంభర మహో! చోద్యంబు! నీపక్షవ
ర్ణకళాచిత్రము లెట్టిపుర్వునకు నైనం గల్గునే? యింద్రచా
ప కణంబుల్ నవరత్నఖండరజముల్ పక్షంబులం జెక్క తా
నొక కీటంబు రచింపఁగోరి విధి నిన్నొప్పార నిర్మించెనో!

నిను గాంచంగనె యెట్టి జీవులకు నేనిం బ్రేమ చిప్పిల్లు; స
న్ననిపూరేకులఁ బోలు నీగఱుల సౌందర్యంబు కొల్వుండెడిన్,
అనయంబున్ బువ్వుఁదేనెలాని రమణీయంబైన నీరూపమున్
ఘనఝుంకారనిబద్ధ గీతముల నే గానంబుఁగా వించెదన్.

అనవిని సీతాకోకము
తను బొగడుచునున్న షట్పదంబును గని, నీ
వనునది యెల్ల నిజంబై
నను, సంతాపాంకితంబు నాబ్రతుకు సఖా!

నను గనినంత బాలుర మనంబున సంతస ముప్పతిల్లఁ జ
క్కని పురువియ్యదే యనుచుఁ గాలుకుఁ గాలు మెదల్పకుండ మె
ల్లన నను బట్టి ముద్దిడుచు, లాగుచు, నొండొరు చేతికిచ్చుచుం
గొనుచు గఱుల్ సడల్చి తుదకుం బడరువ్వుదు రేమిసెప్పుదున్ !

అర్భకుల కాటయయ్యె నయ్యయ్యొ! నాకుఁ
బ్రాణ సంతాపకరమగు బాధయగును;
నాదు సౌందర్యగరిమయే నాకు మృత్యు
వగును బంభరమా, యిఁకేమని వచింతు?
శమ్మఁదేనియఁ ద్రావి ఝంకారములను
శ్రుతి సుఖమ్ముగఁ జేయుచు సొంపుమీఱు
నీరజాగారమున నుండు నీకు నెపుడు
సాటియాదురె మాబోంట్లు షట్పదంబ?

అని శుకకీటమూడ విని యానవ్వు నందపు రూపుగల్గి తా నెనయముఁ బ్రాణసంశయమునందుచుఁ ద్రిమ్మరుకంటె, నల్లరూపున మసిబొగ్గులా గలరి పువ్వుల తేనియలాని తమ్మిగీమున నివసించుటే సుఖము మోదమునించును;బోయివచ్చెదన్

అనివచియించి మిళిందము
ఘనవర్ణ గరుద్వయంబుఁ గదలించుచు జు
మ్మని గానము లొనరించుచుఁ
దనదారిని బోయెఁ బుష్పతరువాటికకున్.

---

# మాతృశతకము.

---

శ్రీకళ్యాణనిధాన మాశ్రితజనాశ్లేషానుభావ్యంబు పు
త్త్రికానందకరం బరాతినృపమూర్ధన్యస్త ముద్యద్యశో
వ్యాకోశీకృత దిఙ్ముఖంబు కరుణావాల్లభ్యపూతంబు నై
మాకుంగూర్చుత దేశమాతృపదయుగ్మం బర్థమారోగ్యమున్!

తల్లీశారద, మాతృదేశమును శ్రద్ధాభక్తి సేవింప నేఁ
డుల్లాసంబుగ సన్నుతుల్ సలుప నేనుంకించితిన్, నీవు నా
యుల్లంబందు దయామతిన్నిలిచి యుద్యోతించి, మందాకినీ
కల్లోలార్భటి నించు పల్కు రసనం బల్కింపవే, నింపవే.

కలవుంగాలమునాక బిడ్డలను నెక్కాలంబునం దైన స
త్కరుణా దృష్టులఁ బ్రోచి కట్టఁగుడువం గల్పించి పోషించి యా
త్యురుకష్టంబులు సైచు నీకుఁదులయే యోచింపఁగన్ దేవతల్
గురువుల్ బంధులు పుత్త్రమిత్త్ర ధనముల్ కోట్లైన నోమాతరో

తళుకుం జెక్కులు గబ్బగుబ్బలును నిద్దంపున్ లలాటంబు ను
జ్జ్వల శంపాలతఁ గేరు మేననుచు నిచ్చల్ స్త్రీలవర్ణింప నే
మిలభించున్ వెత దక్క? నిన్నుఁదలఁపన్ మించుంగదే సద్యశో
విలసత్ సౌఖ్యసమస్తసంపదలు నిర్వేలాకృతిన్ మాతరో.

ఘనముల్ కుంతలపాళిగాఁగ హిమవద్గ్రావంబు హీరప్రభా
ఖనియౌ దివ్యకిరీట మట్లెసఁగ గంగాసింధువుల్ బాహులు త్తై
రయొనర్పన్ వింధ్యము మేఖలావలయమై యొప్పార భవ్యాకృతిన్
మును గన్పట్టిన నీస్వరూప మిపు డింపుల్ వాసెనే మాతరో
సరసీజాప్తమయూఖముల్ కిసలయచ్ఛాయన్ విడంబించి క
ల్యరమాకంఠమునన్ సుమస్రజము లీలం గేరు వేళన్ సరో
వరతీరంబుల మౌనులాగమవచః ప్రాగల్భ్యముం జూపుచుం
బరగన్ స్నానము మున్నొనర్తు రిపుడవ్వా రేడనే మాతరో.
హరిణుల్ నిర్భయలీలఁ బచ్చికల నాహారింప వన్యోర్వి, ని
ర్భరమోదంబున గిండ్లు గైకొని ఝరింబ్రాపించి సల్లాపముల్
జరుపం దాపసకన్యకల్ ఋషులు సంజన్ మ్రొక్క, నానందమం
దిరముల్గా మునిపల్లెలొప్పఁగద మున్నే దేవి యో మాతరో
హోమోద్భూత పవిత్రధూమచయ సంయోగంబునం బుష్పితా
రామంబుల్ ఘృత సౌరభాంచితములై రాగోల్లసత్పల్లవ
స్తోమంబుల్ మసిపూతలొంద, మృగసందోహంబు క్రీడింపఁగన్
గోముం జిల్కువనంబు లిత్తఱిని రంగుల్వాసెనే మాతరో.
సెలయేఱుల్ శిలలం దొరంగి రవముల్ సేయంగ వాసంత కా
ల లతావాటులు తావులం జిలుక నుల్లాసంబుగం గోయిలల్
పలుకన్ మావుల నీడ శిష్యతతికిం బాఠంబులం జెప్పు నొ
జ్జలు నావన్య పవిత్రసంస్థ లిపు డేజాడయ్యెనే మాతరో.

తలఁపం జిత్రముగాదె బౌదుల నలందావిశ్వవిద్యాలయ
స్థలమున్ ముప్పదివేల శిష్యులట శాస్త్రంబుల్ పఠింపంగ ని
చ్చలు వాణీనిలయంబులై వెలయు నాస్థానంబు లేమయ్యెనో?
కలఁ జింతించిన యట్టులాయెఁగదె యకాలంబునన్ మాతరో.

జలకంబాడి త్రియాప్రయుక్తవిధులన్ సాంగంబుగందీర్చి వి
ద్యల నభ్యాసము సల్పుఁదాపసుల చైత్యంబుల్ సమీపించు శి
ష్యులు లేమింగద భావదాస్యపరతన్ శుష్కించుచుం గ్రుంగె దే
బలవత్కాలజలప్రవాహ భయదావర్తావళిన్ మాతరో.

సుతులత్యంత భుజాబలాఢ్యులగుచున్ శూరత్వమేపార వి
శ్రుతసంగ్రామకళాధురంధరత శత్రువ్రాతముం ద్రుంచి సం
తత కీర్తిన్ వెలయింప నీనయన పద్మంబుల్ ప్రమోదాశ్రుశో
భితముల్ గావొకో మున్ను; నేఁడవియెటుల్ పెంపేదెనే మాతరో.

* * *

అవనిన్ వాఙ్మయమందు క్షత్రియపద వ్యాప్తిం దొలంగింప భా
ర్గవరాముండు ప్రతిజ్ఞవట్టి తరుణక్ష్మాపాల కంఠాంకు రా
స్రవదస్రోత్కట నిర్ఝరిం బరశు మత్స్యం బేఁదనేర్పించి సం
స్తవనీయుండయి మించె నట్టిసుతు నెంచన్ లేవకో మాతరో.

* * *

ఖరరక్షో ముఖులైన నాల్గుఁబదివేల్ క్రవ్యాదులన్ ధైర్య సు
స్థిరతన్ దా నసహాయశూరుఁడయి నిశ్శేషంబుగంగూల్చి, రా
గ రమం గ్రక్కు నశోకశాఖవలె రక్తప్లావితాంగంబుతో
ధరణీజాతను డాయు దాశరథి సందర్శింపవే మాతరో.

వనధిన్ గోష్పదమట్లుదాఁటి యసుర వ్రాతంబుఁ జెండాడి సీ
తను దర్శించి యశోకవాటిక సముద్ఘాటించి పౌలస్త్య చెం
తను నిర్భీతిగ రామునాజ్ఞపలుకన్ దర్పించి లంకం ద్రుటిం
గనదగ్నిన్ రగిలించు మారుతి కిఁకం గైమోడ్పవే మాతరో.

కురువంశస్థులు పాండవుల్ సమదనిర్ఘోషంబులం జేయుచున్
ధరణీచక్రము దిద్దిరందిరుగ యుద్ధక్రీడ నన్యోన్యమున్
శరకౌశల్యముఁ జూపఁ గాంచి మది నుత్సాహంబు పొంగంగ నీ
మురువుంజూపిన కాలమిప్డు కలయైపోయెంగదే మాతరో.

మును చంద్రార్ధకళా కిరీటు శివునిం బోరన్ బడాయించి యా
తని మెప్పించి గడించి పాశుపతమున్, ధర్మక్ష్మాజానికిన్
ఘనరాజ్యంబును గట్టి కౌరవపతిం గాఱించి శౌర్యంబు చూ
పిన గాండీవి శరాలు త్రుప్పుదినెనే పృథ్వీస్థలిన్ మాతరో.

గురుకర్ణాఖిలయోధ సంఘటితమై ఘోరారి దుర్భేద్యమై
స్థిరమై యొప్పెడు తమ్మిమొగ్గరము దోఃస్థేమంబునం జీల్చి వై
రి రసాకాంతులు సైతముం బొగడ నిర్ణిద్రోగ్ర సంగ్రామబం
ధురతం జూపిన పార్థపుత్రుఁడు మదిందోఁతెంచునే మాతరో.

విజయా, నీతలగాచికొమ్మని రణావేశంబునం దేరులుం
గజముల్ సేనలు పీన్గుపెంట లటులం గావించి గర్జించి, యం
బుజనాభుండును జక్రమెత్తునటు లేపుంజూపె గాంగేయుఁడా
ధ్వజినీకాంతుని యంపశయ్యఁ గనుమా భావంబునన్ మాతరో.

గురుశాపంబును విప్రశాపమిపుడే కూడెంగదా, యస్త్రముల్
పరునిం దాఁకవటంచు నర్జున శరవ్రాతక్షతిన్ రొమ్ము నె
త్తురుఁబైఁ జిమ్మఁగ, నేలఁ గ్రుంగు రథమున్ దోర్దండముల్ మోపి యె
త్తెడుఁ బైకెత్తెడి కర్ణయోధ రణశక్తిం జూడుమీ మాతరో.
సెలవుల్ సాంధ్యరమున్ వహింపఁగఁ గురుక్షేత్రంబునన్ ధార్తరా
ష్ట్రిల కీలాలము దోయిలించి దగగొట్టుల్ దీఁటఁగాఁ ద్రావి, తూఁ
పులగంటుల్ విరఁబూయు కింశుక కుజంబున్ గ్రేణిసేయన్ జగం
బులు భీతిల్లగ ద్రౌపదిం దరియు భీముం గాంచుమో మాతరో.

* * *

గురువృద్ధాంచిత సైన్యముం గనుచు నీగోడేల నాకంచు సం
గర వైముఖ్యముఁ జూపు పార్థునకు వీకన్ గీత బోధించి ని
ర్భర శౌర్యంబును గొల్పి తేరికిని సారథ్యంబుఁ గావించి భూ
భరమున్ డించిన సూత్రధారిని మదిన్ భావింపవే మాతరో.
కంసోర్వీశుఁడు క్రూరుఁడై నిజభుజాగర్వంబునన్ లోకమున్
హింసింపన్ గతియేమిలేక పను లెంతేఁ గుయ్యో మొఱ్ఱోయనన్
శంసాపాత్రుఁడు కృష్ణుఁడా నృపతి మస్తంబూడ్చె; నవ్విక్రమో
త్తంసున్ దుష్టనికృంతనున్ నిరతమున్ ధ్యానింపవే మాతరో.
శరదిందూదయవేళ యామునతటిన్ సంగీతనాదంబు లం
బరహోంతస్థమిళింద ఝుంకృతులలోఁ బూర్ణత్వముంబొంది యిం
పు రహింపన్ మురళీరవాంచిత సుధాపూరంబు వాటించి యే
పరమాత్ముండిల మేలుకొల్పె, నతనిం బ్రార్థింపుమా మాతరో.

* * *

ఆలీసాందరువంటి శూరుని రణవ్యాపారముల్ మాన్పి సై
న్యాళిం బీనుగు పెంటలంజలిపి కయ్యంబందుఁ బ్రాచ్యావనీ
పాలుర్గండర మిండలంచుఁ దలవంపన్ గ్రీకుసర్దార్లు దో
ర్లీలం జూపిన చంద్రగుప్తు మదిఁ గోర్కింగాంచవే మాతరో.

* * *

ఢిల్లీ రాజ్యధురంధరుంగదిసి దండిన్ బోర జృంభించి శుం
భల్లీలన్ జయలక్ష్మిఁ గైకొని రిపువ్రాతంబులంజీల్చి పే
రుల్లాసంబున రాజపుత్ర యశముద్యోతింపఁ జిత్తోడ్ క్షమా
వాల్లభ్యంబు భరించె; నట్టిపురిశోభల్ మాసెనే మాతరో.

ఆర్యావర్తమనార్య సంఘపద విన్యాసోగ్రపాపంబునన్
శౌర్యౌదార్యపవిత్ర వేదవిధులం బాసెంగటా! లెందు మీ
ధైర్యస్ఫూర్తి యొకింతచూపుఁడని ప్రోత్సాహంబుఁ గొల్పన్ యశో
ధుర్యుండా మహరాట్ల బెబ్బులి మదిందోతెంచునే మాతరో.

* * *

ఔరా! గౌతమి తీరముల్ యవనపాలానీకినీ స్పర్శచేఁ
గూరెం గల్మష, మాంధ్రదేశయశ మెగ్గుంబొందె, నేమున్నదిం
కోరాయా, యని పోరులాడఁ బరరాడ్యూథంబులన్ గెల్చిపో
ట్మారన్ నిల్పడె కృష్ణరాయఁడు జయాంకోత్తంసమున్ మాతరో.

పరరాణ్మత్తగజేంద్ర కుంభదళన ప్రారంభనిర్యాత భా
స్వరముక్తాఫలహారముల్ విజయశః సాధ్వగళాలంక్రియ
స్ఫురణన్ మీఱఁగ నాంధ్రశౌర్యముఁ బరాసుల్ మెచ్చఁ బోరాడె
భూ। వరుఁడా బొబ్బిలి బెబ్బులిం గనుమ పాపారాయనిన్ మాతరో

* * *

విరుగన్ దుర్గము ఖడ్గతిక్కనయు "నబ్బే! పాలిదేమే?" యనన్
"విరుగన్ నీవెరణంబునం దిఁకను బాల్విర్గ న్వచిత్రించె"యుం
చరినిర్మూలన కేళికిం దనయు డాయంజేయు వీరప్రసూ
త్రరయింకొక్క తెలేదెయాంధ్రమహినిద్రింభాపఁగన్ మాతరో.
"ఇటనీరాడెడు చోట సిగ్గుపడిపోనేలా? తమాయింపు మి
చ్చట నీముప్వుర మాఁడువార"మను చున్ సంగ్రామమం దోడి ని
ష్కటముంజొచ్చినభర్త హేళనములన్ శూరత్వమున్ రేఁపి యు
త్కటయుద్ధంబున కంపినట్టి సతికిం గైమోడ్పవే మాతరో.
పరమత్తేభఘటాంకుశంబయి రణప్రౌఢిన్ విజృంభించి భూ
భరముందాల్చిననాగమాంబికయశఃప్రాగల్భ్యమాంధ్రాంగనా
భరణంబై చెలువారు, నట్టిసుత సంభావించి నేఁడైన సం
బరమున్ ముచ్చటముద్దు దీర్చుకొనవే భాగ్యమ్ముగన్ మాతరో

* * *

గ్రీకుల్ మూఢత నుండ, జంతువులటుల్ క్రీడింపరోమన్లు, ఘో
రాకారంబుల నీలిరంగుల శరీరాద్యంతముంబూసి కొం
చే కాంతారములందొ యాంగ్లజనముల్ హేయంబుగానుండ నీ
కాకాలంబున మించె నాగరక విద్యాసంపదల్ మాతరో.
ధర నెచ్చోటనుగాని విద్యలు విధుల్ ధర్మంబులున్ శాస్త్రముల్
సరసత్వంబును లేని నాఁటను మనోజ్ఞంబైన చిత్రింబులం
బరతత్త్వ ప్రకృతి ప్రభావముల నుత్పాదించు వేదంబులం
బొరి వాకుచ్చిరికారె నీకొమరులింపుల్ మీఱఁగన్ మాతరో

* * *

ఇల నేదేశమునందు నిట్టికళ నెందేఁగాంచమంచుఁ జనుల్
పలుకం, జంద్రశిలావళీరచితమై ప్రత్యగ్రరత్నాంకురో
జ్జ్వలమై తాజమహల్ నిలింపపురినా సంధించు నాశ్చర్యముఁ
గల రే నేఁడును నట్టిశిల్పులు ధరాకాంతాగ్రిణుల్ మాతరో.

దేవాగారవిహారమంటపములన్ దీపించు చిత్రాళి ప్రా
ణావిర్భావముగల్గఁ బల్కవె త్వదీయానల్పశిల్పక్రియా
సేవాసక్తి "నజంత" చిత్రరచనా శిల్పోన్నతిం గన్న నేఁ
డేవారల్ నినుసన్నుతింపరు ముదంబెచ్చన్ మదిన్ మాతరో.

యవనోర్వీశుల ధాటికిన్ మిగిలి యర్ధానర్ధరూపంబులం
దవులన్ నిల్చిన దేవతాలయములన్ దర్శింపఁ దత్పూర్వశి
ల్పవిధానంబుల యస్థిపంజరములన్ భావంబుదోఁ తెంచు; నిం
క వివేకింపుము పూర్వశిల్పమెటులం గాంతిల్లెనో మాతరో.

మును మంత్రంబులశక్తిచేఁ బ్రతిమలై పోయెన్ శిలల్, లేక యుం
డిన నింకెట్టుల నిట్టివిగ్రహములన్ నిర్మించు నేశిల్పియై
నను నాఁగన్ రమణీయ శిల్పముల ధన్యంబైన "యెల్లోర"సృ
ష్టినిగావించిన సిద్ధహస్తుల కళల్ జీర్ణించెనే మాతరో.

హారినీలంబులు పద్మరాగములు వజ్రాంకూరముల్ పచ్చలుం
బరగన్ నవ్యను హేంద్రచాప సుషమా ప్రాగల్భ్యముం గేరు తే
వ రహించెంగదె నెమ్మిగద్దియ కళావాల్లభ్యముంజాటు చా
వరపీఠం బిపు డేడనున్నదో మదిన్ భావింపవే మాతరో.

అన్నల్దమ్ముల్ మచ్చరించి సకలం బర్థంబు వేఱొక్క పు
ల్లన్నన్ నమ్మి వృథాగఁ దుట్టతుద కయ్యర్థంబుఁ గోల్పోవు కీ
లి న్నీ వ్రాఁతయుఁ దెల్లవాటె; బకధూర్తిన్ నమ్మి మత్స్యంబులా
పన్నత్వంబున డిందవే కపటముం భాటింపమిన్ మాతరో.

గంగోత్తుంగ తరంగ పాళులకు నాల్కల్ గల్గినం బూర్వ రా
జ్యాంగ ఖ్యాతి పరాక్రమక్రమరణ వ్యాపార పారీణతన్
రంగారన్ వచియింపవే వనజ నిర్యద్భ్రాంభరీ డింభకా
భాంగోద్యన్ మృదులార్భటుల్ శ్రుతులుగా భాసిల్లగన్ మాతరో.

పోయెన్ శౌర్యము, పోయెవీర్యము రమాభోగంబులుం బోయెవే
ఆయెం గీర్తికి నీకు దుర్యవన సైన్యాంబోధి కౌర్వానల
ప్రాయంబౌ యసి తుప్పుపట్టెఁ; బదముల్ బంగారుసంకెళ్ళలో
రాయన్ భూపలటంచు సంతసమునన్ రాజిల్లితే మాతరో.

* * *

పారావారములెల్లదాఁటి మునుపుం బాశ్చాత్యదేశంబుతో
బేరంబుల్ పొనరించి నావికులుగాఁ బేరొందె హిందూ వణి
గ్ధీకుల్ గాంచిరి కోట్లకున్ ధనము; నా తేంజంబు నీనాఁటి వ్యా
పారుల్ పొందను పాయమెంచుఁ గనుమా భావించియో మాతరో

హిమవత్పర్వత గహ్వరంబు డిగి మౌనీశుం డొకం డిప్పు డా
ర్యమహిం జొచ్చి యిదేమి దేశమన నార్యావర్తమం చేరు ధై
ర్యముతోఁ జెప్పఁగలారు? పూర్వమటులా యౌన్నత్యమా యెక్కు
నా! రమణీయత్వము నట్టినీతి గలదే రాజ్యంబునన్ మాతరో.

పరవీరుల్ బెగడొంద ఖడ్గములఁ ద్రిప్పంజాలి యుద్ధంబులన్
శరముల్ గాడిన పోటుగంటులె తగన్ సమ్మానపత్రంబులై
యొరపుంజూపిన యార్యయోధులిపుడేమో కత్తిచేపట్టఁగా
నర్హుల్ గారట! యిట్టివింతగలదే, న్యాయమ్మటే మాతరో.

కనకాగారము, రత్నసంఖచిత మెకాళలంబునం బండ్లు నిం
దునకేవచ్చును, బంజరంబయిన నింకుంగల్గు సౌఖ్యమ్మటం
చను రాచిల్క విధాన నుండె; నికనే నానందముంబొంద ముం
జని స్వాతంత్ర్యనభో విశాలతను నిచ్చల్గాంచుమీ మాతరో.

చెఱకా బెల్లము, బియ్యమా కబళ,మో చెట్లా ఫలంబిడు మి
మ్మనుభక్తిన్ భజియింతునన్న నిడునాయుష్యంగివాంఛార్థముల్
పరగన్ గానుగ రాచకున్న, ననలవ్యాపారమీకున్నఁ, గ్రి
చ్చుటఁగోలంగొని రాల్చకున్న; నిదినైజంబెందు నోమాతరో

* * *

గమనాయాసమునన్ హయంబులొఱగెం గపించెఁడె కేళంబు; క
ర్దమనిర్మగ్నములాయెఁ జక్రములు; చేరన్ లేదు గమ్యస్థలం
బ, మహింజుట్టెను జీఁకటుల్, రథమువోఁ బైకెత్త నీపుత్రులన్
గుమిగూడింపు ప్రబోధగీతములదిక్కుల్ మ్రోవఁగన్ మాతరో

"తరుణార్కుండిదెవచ్చువాఁడు, తమముల్ తల్గండి, పాల్పేదెమీ
హారువుల్" నా వచియించు శుక్రునటు భక్త్యావేశనక్షత్ర మీ
తరుణంబందుఁ ద్వదీయపుత్రహృదయాంతర్వర్తియై శోభిలన్
నరగన్ స్వాప్నికబంధముం జదిపి స్వేచ్ఛన్ లెమ్మికన్ మాతరో

తిమిరాంధీకృతశయ్యపైఁ గలగనం దెల్వేది స్వీయస్పృహా
సమతం బాసి, తమిస్రనైతివని యెంచంబోకు సూర్యాంశువుల్
రమణీయంబగు నీశరీరగరిమల్ రాజిల్లఁ జూర్క్రింతలం
దెమలన్ లేదో స్వరూపబోధకరుచిం దీండ్రించుచున్ మాతరో.

* * *

మదవేదండము శృంఖలందునుప, దిఙ్మాతంగ కర్ణోత్థ భీ
ప్రదఝంఝానిల ముట్టుపీవఁ; దటఘూర్ణస్ఫూర్తి నంభోధిసుం
భదనంతోర్మి కరాళదంష్ట్రిల ధరన్ భక్షింప నెవ్వారు కా
దిదియానం చెదరొడ్డువారు ప్రకృతిస్వేచ్ఛాహారిన్ మాతరో
ఆకుల్ దుంచియుఁ దీవలం జదిపి యాయావాపముం బూన్చి పై
పోకల్ వాపఁ గసల్లుదించి యెటులో సాకించియుం జైత్ర శ్రీ
కళ్యాణ రవంబు గేగఁ గళికల్ రెక్కల్ వెప్పఁదోఁట; నా
యాకాలంబున కవ్విగూడును నయత్నావాప్తిగన్ మాతరో.
కడుపుం గాల్చెడు శోకమేమొ! పలుకం గారాదు వాకట్టు చే!
నోడ లెల్లన్ వసివాళ్ళువాడె, నిఁకఁ గుయ్యో మొఱ్ఱచే నెల్గురా
పడె, ఝాళంఝుళ రత్ననూపురమిషన్ బల్మారు నమ్రించియున్
దోడిగెన్ శృంఖల నీకభాగ్యరమ సందుం జూచియో మాతరో

* * *

తనయుల్ మేమట! మానిరాణ్ణికరపాదస్పర్శఁ బూతాత్మవా
నినుబూజించెడివారమంట! రణనిర్ణిద్రోగ్ర శౌర్యప్రథా
ఘనులౌ వీరులు పూర్వులంట! యిఁక నిక్కాలంబునన్ నీవు భో
జనహీనంబుగఁ బొట్టగట్టికొన నిచ్చల్ సూతుమే మాతరో.

ఏలే ముప్పదిమూడుకోట్ల బలగంబింపారునం చీవు శా
ర్వ్యాలాపంబులు పల్కుచుండెదవు; విద్యాహీనులౌ పుత్రులుం
డే లేకేమి? స్వకీయమాతృముఖమే యెట్లుండునం చెన్నమూ
ర్ఖాళుల్ పుత్రులు శత్రులైన నొకటే యర్థంబెకా మాతరో.
తనకుక్షిన్ భరియింప నన్యమృగ సంతానంబులం జంపి జీ
వనముం జేయునుమాంసభక్షణరతిన్ వ్యాఘ్రంబుక్రూరంబుగన్
దనకుక్షిన్ భరియింప మాతృపదమందారంబు ఖండించి జీ
వనముం జేయునరాధముం డతఁడు విశ్వద్రోహియౌమాతరో.
నీగర్భంబునఁబుట్టి, యుప్పుపులుసుల్ నీవీయ భక్షింపుచున్
వేగన్ భాగ్యముసంగ్రహించియును, సద్వేషంబులన్ మాని నీ
పైఁగాల్దువ్వుచు నన్యధర్మముల సంభావించు దుష్టాత్మకుల్
నీగర్భంబును మంట వెట్టుదురె దుర్ణీతిం గటా! మాతరో.
కవిరాట్పల్లజులైన నీతనయులింకన్ స్త్రీలపాలిండ్లపైఁ
జివురుంజెక్కులపై దృగంచలముపైఁ జెన్నారునూగారుపైఁ
దవులం జిత్తము లుంతురో విజయసంధాకాద్రి వీరవ్రతో
త్సవసంధాయకభావబంధురసముల్ సంధింతురో మాతరో

ధనములోవ్వవును, రాజ్యముల్ సమయు, సద్బంబుల్ యుగంబుల్ క
డంజను నెంతైనఁ బవిత్రవీరచరితల్ శశ్వద్యశోరూఢతన్
మనవే సాంఘికరక్తనాళరుజలన్ మాయించి స్వచ్ఛాస్త్రసం
జనకోజ్జీవన భేషజంబులయి యశ్రాంతంబు నోమాతరో.

మునివాసంబుల శీతశైలగుహలన్ భూదేవి గర్భంబునన్
ఘనగంగా సరిదూర్మిమాలికల నింకన్ గ్రంథకాంతారమున్
గనవచ్చోటనో దాఁగుస్వీయచరితం దోఁపించి పూర్వోన్నతుల్
గనులంగట్ట మనస్కరింపుమి సుతుల్ గర్వింపఁగన్ మాతరో
స్వాతంత్ర్యంబను శక్తి నీహృదయ దేశంబందుమున్ బుట్టి గీ, స్
తేజస్సున్ రగిలించి, రోమములకున్ సిద్ధించి, యాంగ్లేయ హ్రా
ద్యోతంబై, యటుపై జపాను చయినాయుం బారసీకంబు ధీ
స్ఫాతిన్ లేవఁ బునః ప్రయాణగతి నీపై వ్రాలెనో మాతరో.

* * *

హిమవత్పర్వత సేతుమధ్యగతమౌ యీభూమి నేకాతప
త్రముగా నేలిన క్షత్రియాన్వయము సంతానమ్ములం బాసి, గ్రం
థములందప్పఁ దదీయ శౌర్యములు ప్రత్యక్షమ్ముగన్ లేమిఁ బూ
త మహీదేవత గొడ్డువోయినకొలంతల్ దోఁచె నో మాతరో.
కటకుంగత్తుల వైరివీరహృతనాకంఠంబులం దుంచి నె
త్తురుదోసిళ్ళ వసంతమాడి యెదలం దోఁతెంచుగాయంపు నె
త్తురులే యుద్ధరమాస్వయంవరమునందున్ నైచు పూదండలై
వలలం బోరిన పూర్వవీరుల ప్రతాపం బేదనే మాతరో.

* * *

మరుతుండేఁగి సభాంతరస్థలము సమ్మార్జించి యంభోజ పు
ష్పరజంబుల్ వెదజల్లె, సూర్యుఁడు జగాబంగారు క్రొన్నిగ్గులం
బఱపెన్, నవ్యవసంతలక్ష్మి కుసుమవ్రాతంబులం బోహాళిం
చి రచించెన్ హరిపీఠిఁ గొలువ్వసకురా శీఘ్రంబుగన్ మాతరో

